

# స్వల్పాహారమును అధిక ప్రయోజనకారిగ చేయుట యెట్లు.

దేశమున ఆహారకొరతవల్ల, ప్రస్తుతము కనీస అవసరములవరకు రేషనులు నిర్వహింపబడుచున్నవి. ఈరోజులలో అందుచేత, స్వల్ప ఆహారమును అధికప్రయోజనకరముగ చేయుట బాధ్యతకల ప్రతి గృహిణియొక్క ధర్మమైయున్నది.

ఇందుకొఱకై మీ భోజనపదార్థములు సాధ్యమైనంత రుచికరముగ తయారుచేయబడునట్లు చూడుడు. స్వస్తిక్ గోవాలిన్ బ్రాండు వనస్పతితో, పూరీలు, చపాతీలు, బజ్జీలు, మున్నగు సకల భోజన పదార్థములు మిక్కిలి రుచ్యములై యుండును. ఉత్తమ శాకముల నుండి తీయబడి శక్తి సమృద్ధమైన ద్రవ్యములతో తయారైన గోవాలిన్ బ్రాండ్ వనస్పతి, దానిగుణమును చెడనీయని పరిశుద్ధమైన సీలు డబ్బాలలో మీవద్దకు చేరును.

అన్ని స్టోరులలోను 2, 5, 10 పౌనులలో దొరకును.

స్వస్తిక్ వారి యితర ప్రొడక్టులలో సువాసన అముదము,
కాంతి సోప్, యితర టాయిలెట్ సబ్బులు, స్వస్తిక్ షేవింగ్ స్టిక్,
బట్టల సబ్బులు చేరియున్నవి.



**SWASTIK** GOWALIN BRAND **VANASPATI**

*UNMATCHED FOR QUALITY*

**SWASTIK OIL MILLS LIMITED, Wadala, BOMBAY.**

50M-8 SHILPI

*BE INDIAN - BUY INDIAN!*

సేల్సుడిపో, మద్రాసు నెం. 14, జి. స్ట్రింగర్ వీధి, లాఁజస్క్వేర్, మద్రాసు.
సేల్సుడిపో, బెంగుళూరు ఆర్కాట్ శ్రీనివాసాచారివీధి, బెంగుళూరుసిటి.






డైరెక్టరు - కే. వి. రెడ్డి B.Sc.Hons

camera sound art

BARTLEY. ARASU. NAGOOR & RAMARAO

STUDIO - NEWTONE

## భారత పరిశ్రమల ఆయువుపట్టు ఇంకను బ్రిటిషువారి చేతులలోనున్నది.

### మనమందర మైకమత్యముతో కలిసి కృషిచేసినప్పుడే అవి మనకు వశము కాగలవు.

తక్కువ పెట్టుబడితో, జాతీయ పరిశ్రమలు నెలకొల్పుటకు బ్రహ్మాండమైన ప్రణాళిక.

## ★ మా సోడావాటర్ మెషినులను స్థాపించుడు.

## ★ పరిమళద్రవ్యములను, టాయిలెట్ వస్తువులను ఉత్పత్తి చేయుడు.

మేము చిన్నవి, పెద్దవి అన్ని రకముల సోడావాటర్ యంత్రములు, సుగంధ తైలములకు, టాయిలెట్ వస్తువులకు ఉపకరించే పరికరములు మిక్కిలి చౌకధరలకు సప్లయిచేయుదుము.

ఉచితముగా మీకు ప్రవీణుల సలహాకూడ నొసంగబడును.

## THE ESSENCE & BOTTLE SUPPLY AGENCY,

**14, Radha Bazar Street,**

**CALCUTTA.**



## ఫిబ్రవరి, 1947



---

### ఫిబ్రవరి కథలపోటీ–బహుమానాలు.

ఫిబ్రవరి కథానికల పోటీకి వచ్చిన కథానికల్లో కూడా ప్రథమ ద్వితీయ బహుమతులకు యోగ్యమైన కథలు బొత్తిగా రానందువల్ల మూడవశ్రేణివే మూడు కథానికలుగా చూచి ఈ సంచికలో ప్రచురించడమైనది. ఆ మూటికిన్ని (వ్యక్తావ్యక్తంలో యుద్ధం; కుటుంబం; మాతృదేవి) విడివిడిగా మూడు తృతీయ బహుమానాలు ఇవ్వడానికి నిర్ణయించడమైనది.

—సంపాదకుడు, భారతి.

త్వరపడుడు ! ఇప్పుడే వెలువడినది త్వరపడుడు !!

# శ్రీమద్భగవద్గీత (తెలుగు)

(వ్యాఖ్యాత : శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు)

## చతుర్థ ముద్రణము : వెల రూ. 4-0-0

(పోస్టేజి ప్రత్యేకము)

సంస్కృతమూలము. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు వ్రాసిన తెలుగు టీకాతాత్పర్యవిశేషార్థ వివరణములు గల 400 పుటల గ్రంథము. గీతాధ్యయనము చేయువారికి మిక్కిలి ఉపయుక్తమైనది. ఖద్దరు బైండు.

**మేనేజరు, ఆంధ్ర గ్రంథమాల.**

---

## ఆంధ్రపత్రిక

# సర్వజిన్నామ సంవత్సర పంచాంగము

శుభానికి గాని అశుభానికి గాని పంచాంగము చూడని హిందువు ఉండడు. ప్రతి హిందూగృహానికీ తప్పనిసరి వస్తువు పంచాంగము.

దైవజ్ఞభూషణ:

**బ్రహ్మశ్రీ పిడపర్తి కృష్ణమూర్తి శాస్త్రులుగారిచే గుణింపబడినది.**

**1000 కి రు. 250/-** 100 కి రు. 27-8/- ఒక్క 1 కి రు. 0-5-0.

ప్యాకింగ్ పోస్టేజి ప్రత్యేకము. ఆర్డరుతోపాటు సగం సైకం అడ్వాన్సుగా పంపవలెను.

వివరములకు :—మేనేజరు.

---

**ఆంధ్రపత్రికాకార్యాలయము, మదరాసు.**

7, తంబుశెట్టి వీధి — జి. టి. మద్రాసు.



ఆటపాటలు
చిత్రకారుడు: వేలూరి రాధాకృష్ణగారు



సంపుటము 24
సంచిక 2

భారతి

ఫిబ్రవరి, 1947
వ్యయ, మాఘము

# వాలాస్యము

*

= శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

ఫక్కుమని నవ్వినది - జక్కవల బెక్కువలఁ
జక్కడచు జనుదోయినిక్కఁ బార్వతి యపుడు
నిక్కుజనుదోయిలో నిబిడరోమోద్గమము
దిక్కుదిక్కుల నెల్ల దివ్యనేత్రోత్సవము

తెగమిగులుదొగలజిగిబుగులుగన్నులదోయి
నిగనిగలు మిట్టింప నిలచి చూచెను గౌరి
నిలుచు వాలకములో నెలవంపు - వంపులోఁ
గులికినది యమృతమో! గోటిసౌందర్యాలో!

బంధూకపుష్పసంబంధువగుఁ జిఱుఁబెదవి
నందముగఁ గదియించె నల సహాసం బార్య
యానవ్వులోఁ గదలె నచ్చరల సిగ్గులో!
గాని-యీశ్వరు కలలో! కామధేనువుపాలో!

స్థలపద్మముల యొప్పు గల తామ్రతలపాద
ములఁ గదల్చెను దేవి మురిపెములు జిలికించి
కదలు కదలికలోనఁ గలకలా నవ్వెనఁట
గోదమగంటలో! నిల్చికొన్న స్వరకన్యకలో!

లలితముగఁ బలికినది మొలనూలు-గోయిలల
జిలుఁగు గొంతుకతీపి జలజలా పారించి —
యా వాకలో నిల్చె నాగమాంబురుహమ్ము
లావిరులపై నాడె నానందబ్రహ్మమ్ము —

జంకించినది లులితచపలభ్రూలతలతో
శంకరుని శర్వాణి - జలదసుందరవేణి
దటుకునను సూచిహస్తంబుతో - నాగేంద్ర
కటకునకు ధైర్యంబు గంపించి పోయినది—

అటు బండె నొకసారి యతివ కిలికించితం
బిటు విరిసె నొకసారి యింతియుల్లోకితము[1]
ప్రమదాకపోలమ్ము భావకిమ్మీరితము
కమనీయమదరాగ కలికావిచుంబితము

కుణుకుణుక్వాణనంబు లనుగతిగముగఁ బాడ
నణుమధ్య జూపినది యభినయవిభేదములు
వనములను - వనధికంకణములను - జగతిలో
నణువణువునను భావ మాక్రమించినదపుడు
తరళలోచన వింతతానకంబుల నిలచి
కరపద్మముల నర్థకలనంబుఁ జూపించె

---

1. మీఁదికి నిక్కింపఁబడిన దృష్టి యుల్లోకితము.

నాసృష్టి నందుకొన కమరులును దేవర్షు
లాశంకితులు - నద్భుతాక్రాంతమానసులు

గా నిలిచినది దేవి-కలకంఠశ్రుతివీథి
లో - నిత్యరమణీయలోకములు బొంగెత్తఁ
బలికినవి వల్లకులు కలకంఠిగానమ్ముఁ
బలికినవి వల్లకులో ! బరమేశ్వరియొగాని !

తకఝుణుతఝుణుతక - తకిటతదిగిణతొంతది
గిణతొం-తదిగిణతొంయనురణనములుమీఱంగఁ
బ్రతిగజ్జెయెడఁదలో భావములు బులకింపఁ
బ్రతిభావమున రసము వాఱి దిక్కులు ముంప

[2] ప్రియురాలి యూరుపులు బ్రేరేప చషకమ్ము
పయి మందవలితమ్ములయి లేచు దరగలటు
బాలేందుఫాల - నగబాల - పార్వతి నిలిపి
లీలావిపర్యాప్త[3] రేచితభ్రూలతలు

[4] పరివాహితము శిరము-చిఱునవ్వు-నెత్తమ్మి
విరికన్నుఁగవలందు [5] విభ్రమాలోకితము-
కించిదాకుంచితము- చంచలము బొమదోయి
పంచాస్త్రు బాణమ్ము-పర్వతేశ్వరు సుతకు -

[6] నవశిరోభేదములు నవకంబుగాఁ జూపి
భవురాణి [7]యష్టగుణభావదృష్టులు మోపి
[8] పదిరెండుహస్తములు బట్టి-మదిరాక్షిమఱఁ
బదిలంబుఁగాఁగ గ్రీవాభేదములతోడ

ఆడినది గిరికన్నె యలసమారుతమట్లు
బాడినది సెలకన్నె పకపకా నవ్వినటు—
లాటపాటలలోడ నవశులై బ్రహ్మర్షి
కోటు లెల్లెడ నమితజూటులై సేవింప

శరదబ్జధూళిపింజరితముల చక్రముల
సరిదూగు లావణ్యభరితకుచయుగ్మములు
చనుకట్టునెగమీటి మినుదాకునో! యనఁగ
వనజాక్షి-బైపైని నటుమ్మ విరియించి
యాడినది గిరికన్నె !

ఒకవైపు భ్రూభంగ మొదిగించి చూచినది
వికచసాకూతముగ విశ్వేశ్వరుని - లలిత
యా చూచుచూపుతో నర్ధేందు భూషునకుఁ
బూచిపోవఁగఁ బుష్పముకుళములు నిలువెల్ల
ఆడినది గిరికన్నె !

మేఖలాచంద్రకిత మృదుమధురహా మధ్య
మాకంపితంబయ్యె నగరాజ ప్రియపుత్రి
కాకంపితంబులో నలసవ్రీడాభరం
[9] బాకేకరితదృష్టి యనురాగసూచకం
బాడినది గిరికన్నె !

సవ్యహస్తం బర్ధచంద్రాఽభినయముతో
దివ్యలీలను నిలిపి - దేవి నడుమునయందుఁ
గొనగోట నుదుటఁ గ్రమ్మిన జెమ్మటల మీట
కొనచూపులనె శివునిగోర్కె లోతులు దూట
యాడినది గిరికన్నె !

2. ఆమె రేచితభ్రూలతలు చాల లలితముగ నగుపడి నవి. అవి యెట్లున్న వనఁగా - ప్రియురాలు ప్రియునకు మద్యమందించునపుడు - ఆమె యూరుపులచేత నా మద్యపాత్రమున లేచు మద్యతరంగము లంత లలితముగ నున్నవి.

3. అందముగ మీఁది కెత్తఁబడినవి.

4. వింజామరమువలె ఇరు ప్రక్కలకు వంచు శిరస్సు పరివాహితము.

5. తిరుగుడుగల చూపు ఆలోకితము.

6. సమము, ఉద్వాహితము, అధోముఖము, ఆలోలితము, ధుతకంపితములు, పరావృత్తోత్క్షిప్తములు, పరివాహితము.

7. సమము, ఆలోకితము, సాచి, ప్రలోకితము, నిమీలితము, ఉల్లోకితము, అనువృత్తము, అవలోకితము.

8. ఇచట హస్తశబ్దము హస్తప్రాణముల కాపచారికము. హస్తప్రాణములు పదిరెండు. ప్రసారణ, కుంచిత, రేచిత, పుంఖిత, అపవేష్టితక, ప్రేరిత, ద్వేష్టిత, వ్యావృత్త, పరివృత్త, సంకేత, చిహ్న, పదాగ్రటీకలు.

9. కనబొమ్మలు పైకెత్తిన దృష్టి

కోపఘూర్ణితమైన కొదమనాగమువోలెఁ
దీపులగు నూరుపులు దెసలెల్ల జల్లించి—
యలసవలితములు జేతుల భంగిమలతోడ
జలజారిముకుటు గన్నుల నాన లెసకొల్పి
యాడినది గిరికన్నె !

నడునొసలిపై నున్న నాభినామము గరఁగి
వడిజాఱి-కనుబొమల వంకలను నిలువంగఁ
గ్రొత్తఁదోమిన దంతకోరకంబుల గాంతి
గుత్తులుగ గుత్తులుగ హత్తి కొన శివుపైని
యాడినది గిరికన్నె !

సమపాదయుతమైన స్థానకస్థితినిలచి
క్రమముగాఁ జూపులను గంజాక్షి విరఁజిమ్మ
ఘలుఘల్లుఘలుమనెడి వలయనాదములతోఁ
జిలిపినవ్వుల సుమాంజలి పట్టి శివునకై
యాడినది గిరికన్నె !

వెలయంగఁదొమ్మిదగువిధములను జెలువముగ
నలినాక్షి[10]భూచారినాట్యములు జూపించి
పదునాఱగు [11]ఖచారిపద్ధతుల నెసగించి
మదిరాక్షిగతిచారిమధురిమలు బొసఁగించి
యాడినది గిరికన్నె !

శిరముఁజూపులుమించుఁజెక్కిళ్లఁ గనుబొమలు
దరుణాధరము బయోధరములునుదంతములు
ముఖరాగచిబుకములు మొదలైన వావగలు
సకియ - భావానుగుణచాలనంబుల నెసఁగ
నాడినది గిరికన్నె !

శుకతుండనిభకుచాంశుకము వదులుగ జాఱ
మొకముపైముంగురులుముసరుకొనివిడఁబాఱఁ
బంచవన్నెల కాసె వగలుగులుకఁగ-విమల
చంచలాక్షులఁ గటాక్షాంచలమ్ములుమిగుల
నాడినది గిరికన్నె !

సమరూపములగు నంసములుఁ గటికంఠములు
సమపాదములు నంగసమరూపచలనములు -
నురము పెక్కువయు-సుందరభావప్రకటనము
సరసీజముఖి - నాట్యసౌష్ఠవమ్మునుఁ జాట
నాడినది గిరికన్నె !

ఆవైపు నీవైపు నతిరయంబునఁ దూఁగ
భావభవు తరవారినా వెలయు గీలుజడ
చలితనాట్యమున కాశ్చర్యపరవశుఁ డగుచు
లలితేందుధరుఁడు దానిఁబువఁ దిన్నఁగనగుచు
నాడినది గిరికన్నె !

పూవుగుత్తులనడుమఁ బొలుచుగిసలయమువలె
దా విమలమర్దళాంతరమునను నిలుచుండి
పలుమారునిలమీఁద లలితముగఁ గ్రుంగి-కిల
కిలకిల మటంచు-మేఖలనవ్వులనుఁ బొదల
నాడినది గిరికన్నె !

జఱితపావడ చెఱఁగు చలియింప - గంటసరి
గరము నటియింప - బంధురశ్రోణి గంపింపఁ
గరయుగంబుల ఘల్లుఘలుమంచు నెలుగించు
వరకంకణములతో - భావభవు గంధగజ
మాడినది గిరికన్నె !

కలఁగఁ జెక్కిళ్లపయిఁ గస్తూరిమకరికలు
మలఁగ నిటలంబుపైఁ దిలకంబు లలితంబు
నిడుదఁగన్నులఁ దేరు నీలోత్పలములతోఁ
దడఁబడని లయతోడఁ గడువేగముగ నప్పు
డాడినది గిరికన్నె !

ధిమిధిమి యటంచు దుర్దినవారిధరధీర
భ్రమబూన్చి మద్దెలలుబలుమాఱుధ్వనియింప
జకితచకితాంగియగు సౌదామనియువోలె
వికచాక్షి - యజ్ఞాతవిభ్రమంబులు జూపి -
యాడినది గిరికన్నె !

10. నేలపై నిలిచి చేయు నాట్యము
11. పైకి ఎగిరించుచుఁ జేయు నాట్యము

భవుని వక్షమునందుఁ బదలాక్షుఁ జిత్రించి
నవరసంబులకుఁ బుణ్యపుఁ బంటఁ జూపించి
భరతముని నానందతరళితునిఁ గావించి
స్వరకన్యకలకుఁ దత్తఅపాటుఁ గల్పించి
యాడినది గిరికన్నె

కుచ్చెళులు భువిఁ గుప్ప గూరమై నటియింప
ముచ్చెమటతో మొగముమురిపెముల వెల
యింప
ముచ్చటగ నిరుప్రక్కముక్కరయుఁగంపింపఁ
బచ్చవిల్తుని పూన్కిఁ బౌరంబు జూపింప
నాడినది గిరికన్నె !

ప్రతిపదములో శివుఁడు బరవశతఁ దూగంగ
సతి జంద్రముకుటంబు సారెకుఁ జలింపంగ
వ్రతతి దూగాడినటు వాతధూతం బౌచు
శతపత్ర మది ముకసరివిచ్చికొన్నట్టు
లాడినది గిరికన్నె !

గగనవనమున విచ్చికొనిన జలదంబట్లు
వనముననుఁ బారాడు వాతపోతంబట్లు
పోతమ్ము గల్లోలములపైనిఁ దూగినటు
శాతాక్షి గాయమ్ము సంచాలిత మొనర్చి
యాడినది గిరికన్నె

బ్రహ్మాణి యానందపారిప్లవాంగియై
జిహ్మాగాక్షుముల వీక్షించి - మిన్నాకంగ
సకలామరులు శిరస్సులకీలితాంజలులు
సకలేశ్వరినిఁ దన్ను సంస్తుతించుచునుండ
నాడినది గిరికన్నె !

ప్రసుమముఁ దన్మయత్మమునఁగిలకిల నవఁ
బ్రతిపక్షి యున్మాదపరవశత నదియింపఁ
బ్రతిజీవి బులకింపఁ బదునాల్గులోకముల
నతులితంబైనట్టి యద్వైతమే ప్రోఁగ
నాడినది గిరికన్నె !

తన లాస్యమును మెచ్చి తరుణచంద్రాభరణుఁ
డనుమోదమునఁ జేతులనుగలిపి యాడంగ
శివశక్తు లొక్కటిగఁ జేరినంతన మౌను
లవికృతేంద్రియు"లో"మ్మటంచుఁజాటింపంగ
నాడినది గిరికన్నె !

పలికి రంతటన గీర్వాణు లెల్లరుఁ గూడఁ
జలితకంఠముల శివశక్తులకు మంగళము
కచ్ఛపీవీణ యుత్కంఠతోడుత రాగ
గుచ్ఛముల నీన నాఘూర్ణితములుగ దిక్కు
లాడినది గిరికన్నె !

"దేవాదిదేవాయ, దివ్యావతారాయ
నిర్వాణరూపాయ, నిత్యాయ, గిరిశాయ,
గౌర్యై నమో నిత్యసౌభాగ్యదాయై
తురీయార్థదాత్ర్యై, ధరాకన్యకాయై"



# పతంజలి - ఆయన మహాభాష్యము

= శ్రీ గరికిపాటి కృష్ణమూర్తి =

అన్ని శాస్త్రాలలోనూ సూత్రాలు ఉన్నవి. వాటిమీద భాష్యాలూ ఉన్నవి. ఇన్ని ఉండగా ఒక్క వ్యాకరణభాష్యానికే మహాభాష్యం అని పేరు వచ్చినది. దీనిలో మహత్త్వం ఏమిటి? "లోకంలో వ్యాప్తిలో ఉన్న సర్వన్యాయములకూ మూలం ఇందులో కనబడుతుంది కాబట్టి ఇది మహాభాష్యం" అని ఒకరన్నారు. ఇంకొకరు "ఇతరశాస్త్రాలలో సూత్రాన్ని అనుసరించే భాష్యాలు అర్థంచెప్పినవి. వ్యాకరణభాష్యంలో ఒక్కొక్కసూత్రం భాష్యకారుడికి ఇష్టంలేకపోతే ఆ సూత్రం అనవసరం అని చెప్పటం, సూత్రం మార్చటం మొదలైనవి పతంజలి చేస్తాడు. సూత్ర ప్రత్యాఖ్యానమందుకూడా పతంజలికి, అధికారం ఉన్నది కాబట్టి ఆయనభాష్యం మహాభాష్యం" అని అన్నారు.

వ్యాకరణశాస్త్రంలో కట్టుబాటులు చేయుటకు అధికారం తనకు ఉందని పతంజలికి తెలుసును. ఎక్కడైనా శాస్త్రం సందిగ్ధంగా ఉండి అర్థంకాకపోతే "వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తిః, నహి సందేహాదలక్షణమ్"—(సందిగ్ధంగా ఉన్నంతమాత్రాన శాస్త్రం కాకపోదు. వ్యాఖ్యానంవల్ల విశేషజ్ఞానం కలుగుతుంది) అని చెప్పి, "మేము ఇలాగ వ్యాఖ్యానం చేస్తాము" అంటాడు. మహాభాష్యంశైలి చాలా సరళం. ఎక్కడా ఒక పెద్ద సమాసం కనబడదు. భావం అతిగంభీరం. అర్థమైనాసరే కాకపోయినాసరే పుస్తకం పూర్తిగా చదవాలని అనిపించుతుంది. అంత హృదయంగమంగా భాష ఉంటుంది. ప్రశ్నోత్తరాలతో, ఆక్షేప సమాధానాలతో ఒక నాటకం నడిపినట్టు మహాభాష్యం నడుపుతాడు. తలనొప్పి తెచ్చుకోవాలి అంటే, వ్యాకరణంకంటే మంచిఉపాయం లేదు. అటువంటి వ్యాకరణాన్ని సాహిత్యగ్రంథం చేశాడు. చదువరి 'కిమర్థకమ్' అని ఏదో పతంజలిని అడిగినట్టూ, ఆయన 'ఇదమర్థకమ్' అని సమాధానంచెప్పినట్టూ ఉంటుంది. ఈ 'కైమర్థక్యం'తో, 'ఐదమర్థక్యం'తో గ్రంథమంతా సంభాషణ నడిపినట్టు నడుపుతాడు. చదువుతూంటే అనేకశాస్త్రసంప్రదాయాలు తెలుపుతాడు. ఆయన లోకజ్ఞానం ఆశ్చర్యం కలుగజేస్తుంది. ఇటువంటి శబ్దానుశాసకుడు కలిగిఉండటానికి ఇతర భాష లేవీ నోచుకోలేదు.

ఈ వ్యాకర్తలంతా శబ్దాన్ని శాసించారుగదా! ఎక్కడిది వీరికీ శబ్దం? కుమ్మరియింటికి వెళ్లి "అబ్బాయీ! మాకు కుండ ఒకటి కావాలి, దానితో పనివచ్చింది" అనిచెప్పి చేయించుకున్నట్టు 'వైయాకరణ'ంగారిదగ్గరికి వెళ్లి "అయ్యా, చాలా అవసరం వచ్చింది. మంచి శబ్దాలు రెండు చేసిపెట్టండి" అని చెప్పి తయారుచేయించవచ్చునా? వీలులేదు. శబ్దం లోకంలో సిద్ధమైఉన్నది. దానిని సాధువుగా ప్రయోగించడమే వైయాకరణుడు చెయ్యగలిగిన పని. శబ్దమూ సిద్ధమే, అర్థమూ సిద్ధమే, శబ్దార్థసంబంధమూ సిద్ధమే. 'సిద్ధమంటే ఏమిటి?' అని మళ్లీ ప్రశ్న. 'నిత్యము' అని సమాధానం. శబ్దము నిత్యమైన పదార్థము అని ఏలాగు చెప్తావంటే 'సంగ్రహం' అనే గ్రంథంలో 'వ్యాడి' అనే ఆయన అలాగ నిర్ధారణచేశాడు అని పతంజలి సమాధానం చెప్తాడు. 'వ్యాడి' లక్షశ్లోకాల వ్యాకరణగ్రంథం వ్రాసి దానికి 'సంగ్రహం' అని పేరుపెట్టాడు. ఆ చిన్న పేరుమటుకు నిలిచిఉన్నది. పెద్దపుస్తకం అంతరించిపోయింది. వ్యాడి కాత్యాయనుడితో చదువుకున్నాడనీ, కాత్యాయనుడికి ఒక్కసారి వింటే కంఠతా వస్తుందనీ, వ్యాడికి రెండుసార్లు వింటే వస్తుందనీ కథాసరిత్సాగరంలో ఉన్నది.

"శబ్దార్థములు నిత్యములు" అని అంటారు కాని, లోకంలో శబ్దం ఒక అర్థంలో బయలుదేరి ఇంకొక అర్థం పొందటం చూస్తున్నాము. కొన్ని కొత్తశబ్దాలు పుట్టటం, కొన్ని పాతశబ్దాలు పోవటం చూస్తున్నాము. మరి నిత్యత్వం ఎలాగ అని అడిగితే వారికి ఈ లోకంలో గోల ఏమీ పట్టలేదు. వాక్కు మూలాధారంలో బయలుదేరుతుంది. అప్పుడు 'పరా' అని దానిపేరు. అక్కడనుంచి నాభిదగ్గరకు వచ్చేటప్పటికి 'పశ్యంతీ' అని పేరుపెట్టారు. హృదయందగ్గరకు వచ్చేటప్పటికి 'మధ్యమా' అన్నారు. దీనినే వైయాకరణులు శబ్దమని, స్ఫోట అని అన్నారు. కంఠందగ్గరకు వచ్చేటప్పటికి 'వైఖరీ' అని పేరువచ్చింది దీనికి. ఇదే మనం మాట్లాడేది. ఇది శబ్దగుణమైన ధ్వని. నాదబిందువు ఈ నాలుగు అవస్థలూ అనుభవించి పైకి వస్తుందట. మూడో అవస్థలో ఉన్న స్ఫోటనే శబ్దబ్రహ్మమని, అది నిత్యమని, మనం చెవులు మూసుకుంటే వినపడే శబ్దమే స్ఫోటసదృశమనీ వైయాకరణులు ప్రతిజ్ఞచేస్తారు. వ్యాకరణం చదివినా బ్రహ్మోపాసన చేసినట్టే అని దీనివలన తేలుతుంది. వ్యాకరణానికి దర్శనత్వం సిద్ధమౌతుంది. దర్శనమంటే తత్త్వజ్ఞానసాధనం కాబట్టి.

శబ్దం నిత్యం కాదు అని తార్కికులు అంటారు. లోకానుభవంవలన ఇది నిజమేమో అనిపించుతుంది. వాచోయుక్తివలన దీని నిగ్గు తేలదు. యోగసమాధిలో నాదం వినపడుతుంది అని యోగశాస్త్రం. అదే స్ఫోట అని కొందరు వైయాకరణులు అంటారు. ఇదంతా అనుభవైకవేద్యం. తెలియనివాళ్లు ఉన్నదీ అంటే మూఢవిశ్వాసం అంటారు. లేదు అని వాదిస్తే మూర్ఖనిశ్చయం అంటారు. స్ఫోటనుగురించి పతంజలి సూచించి విడిచిపెట్టాడు; భర్తృహరి, నాగేశభట్టు విపులంగా వ్రాశారు.

ఇంత శబ్దశాస్త్రం సాధించిన మునులుగూడా ఒక్కొక్కచోట వారి శాస్త్రానికి విరుద్ధంగా ప్రయోగాలు చేస్తారు. అవి తప్పులు అని అంటే సాంప్రదాయకుల మనస్సు చివుక్కుమంటుంది. వారు ఆ ప్రయోగాలను అనుసరించి అనేక 'జ్ఞాపకాలు' సాధించుతారు. పాణిని 'స్త్రియాఖ్యౌ' అని ప్రయోగించాడు. ఆయన సూత్రాలప్రకారం 'ఆఖ్యా' అనే శబ్దమే ఉండాలి. కాని ఆయన 'ఆఖ్య' శబ్దం వాడేశాడు! ఉపసర్గముందు ఉన్నప్పుడు 'క' ప్రత్యయం రాకపోయినా వాడేశాడు పాణిని. ఇదేమయ్యా అంటే 'ఛందోవత్ సూత్రాణి భవంతి' అంటాడు భాష్యకారుడు. 'సూత్రం వేదంలాంటిది'. ఆక్షేపించటానికి వీలులేదు. వెంటనే ఆక్షేపకుడు బయలుదేరి ఒక కవి వాడిన ఆఖ్యశబ్దం శ్లోకంలో చూపించాడు. "యస్మిన్ దశ సహస్రాణి పుత్రే జాతే గవాందదౌ, బ్రాహ్మణేభ్యః ప్రియాఖ్యేభ్యః సోఽయ ముఞ్ఛేన జీవతి"—కొడుకు పుట్టినప్పుడు ప్రియంవదులైన బ్రాహ్మణులకు ఎవరైతే అనేకగోసహస్రాలు యిచ్చాడో ఆయన ఇప్పుడు ఉంఛవృత్తితో జీవించుచున్నాడు అని అర్థం. ఏమయ్యా ఈకవి ఆఖ్యశబ్దం వాడాడు - అంటే, "ఛందోవత్కవయః కుర్వంతి" అని వేసి శబ్దప్రామాణ్యం కవిరచనకు గూడా కలుగజేశాడు పతంజలి. ఈ రోజుల్లో ఈ వాక్యం మనకు చాలా ఉపకరిస్తుంది. 'ఛందః' అన్నప్పుడు 'ఇష్టంవచ్చినట్టు' అని కూడా అర్థం చెప్పకోవచ్చును.

సౌత్రప్రయోగం ఒక విధంగా ఉంటే భాష్యప్రయోగం దానికి భిన్నంగా ఉన్నప్పుడు భాష్యప్రయోగాన్నే వైయాకరణులు శిరసావహిస్తారు. సర్వనామానికి (దక్షిణ, వామ మొదలైనవాటికి) పూర్వనిపాతం రావలసిఉండగా భాష్యకారుడు 'అస్మిన్నవకాశే హస్తదక్షిణో గ్రహీతవ్యః, అస్మిన్నవకాశే హస్తవామః' అని పరనిపాతంగా ప్రయోగించాడు. 'ఈ అవకాశంలో హస్తదక్షిణంగానూ, ఇంకొకచోట హస్తవామంగానూ తిరగాలి' అని దాని అర్థం. భాష్యకారవచనంవలన ఇది ఇలాగా వాడాలి అన్నాడు కైయటుడు.

శాస్త్రంకూడా లోకవ్యవహారాన్ని అనుసరించి నడుస్తుంది. 'అకృతకారి శాస్త్రమ్'- శాస్త్రంలో ఇదివరకు చేసిన పనినే మళ్లీ చేస్తూఉండరు. 'నాగ్ని ర్దగ్ధం దహతి'-నిప్పు తగలబడినదానిని తిరిగి తగలపెడుతుందా? భోజనం చేసినవాడు వెంటనే మళ్లీ భోజనానికి సిద్ధమౌతాడా? మీసాలు కత్తిరించుకున్నవాడు మళ్లీ వెంటనే

మంగలిదగ్గఱకు తయారౌతాడా? (కృతశ్మశ్రుః నపునః శ్మశ్రూణి కారయతి) పునఃప్రవృత్తి అవసరం లేనప్పుడు భాష్యకారుడు ఈ విధంగా వాదిస్తాడు.

పునఃప్రవృత్తి కావలసివస్తే 'కృతకారి శాస్త్రమ్' అని మొదలుపెడతాడు. 'పర్జన్యవ ల్లక్షణప్రవృత్తిః' —శాస్త్రం మేఘంవలె ప్రవర్తిస్తుంది. మేఘం సముద్రంలో, నదిలో, మరుభూమిలోకూడా వర్షిస్తుంది. సముద్రంలో, నదిలో నీరుఉన్నదిగదా అని మాని వెయ్యదు. భోజనం చేసినవాడుకూడా మంచి పిండివంట యెవరైనా తెచ్చిపెడితే తింటాడు. మంగలిపని చేయించుకున్నవాడుకూడా ఇంకా బాగా పనిచేసే వాడు వస్తే మళ్లీ వాడిదగ్గఱ మీసాలు దిద్దించుకుంటాడు. 'శిల్పివిశేషాత్ కృతశ్మశ్రుశ్చ పునః శ్మశ్రూణి కారయతి' పతంజలి ఆదిశేషువు అవతారం కాబట్టి చెప్పిననోటితో చెప్పకుండా వేయిరకాల వాదాలు వేయినోళ్లతో చెప్పగలడు.

ఒక్కొక్కసారి ఒకసూత్రం ప్రవర్తించుకుంటే దానితోబాటు అనవసరం అయినవి కొన్ని బయలుదేరుతై. కావలసినదానితో అక్కఱలేనివికూడా వస్తున్నవి అని కావలసినపని చెయ్యటం మానేస్తామా? "నహి భిక్షుకాః సన్తీతి స్థాల్యో నాధిశ్రీయంతే, నహి మృగాః సన్తీతి యవా నోప్యంతే"—మధుకరం వాళ్లతో బాధపడలేక వంట మానేస్తామా? మృగాలు ఉన్నవిగదా అని పైరువెయ్యకుండా ఊరుకుంటామా? బాధానివారణకు ఉపాయం ఆలోచించాలిగాని—

ఒకశబ్దం ఎక్కడో కొద్దిగా మాఱినంతమాత్రాన మఱియొక శబ్దమైపోదు. "ఏకదేశవికృత మనన్యవత్." తోకతెగితేమటుకు కుక్క కుక్క కాకుండా పోతుందా? ఒకశబ్దం ఇంకొకశబ్దంమాదిరి ప్రవర్తించినంతమాత్రాన ఆశబ్దంగా మాఱిపోదు. "నహి గోధా సర్పంతీ సర్పణా దహిః భవతి"—ఉడుము సర్పగతిని అవలంబించినమాత్రాన సర్పమైపోతుందా?

పశుపక్ష్యాదులు హర్షంచేత జీవికకొఱకు, ఆశ్రయంకొఱకు మట్టివెదజల్లుతున్నవి అనే అర్థంలో 'అపస్కిరతే' అని ఆత్మనేపదం, 'సుట్' వస్తుంది. "అపస్కిరతే వృషో హృష్టః—కుక్కుటో భక్ష్యార్థీ, శ్వా ఆశ్రయార్థీ"—ఆంబోతు సంతోషంచేత మట్టి వెదజల్లుతుంది; కోడి తిండికోసం; కుక్క ఆశ్రయం కోసం. ఆవులు తల్లిని పోలుతై, గుఱ్ఱాలు తండ్రులని—"పైతృక మశ్వా అనుహరంతే, మాతృకం గావః"

పూజచేస్తున్నాడు అనే అర్థంలో 'ఉపతిష్ఠతే' అని ఆత్మనేపదం రావాలి. సమీపించుచున్నాడు అన్నప్పుడు పరస్మైపదమే. ఇది ఉదాహరించేందుకు పతంజలి రెండుశ్లోకాలు చదువుతాడు. "బహూనా మప్యచిత్తానాం ఏకో భవతి చిత్తవాన్; పశ్య వానరసైన్యేఽస్మిన్ యదర్క ముపతిష్ఠతే. మైవం మంస్థాః సచిత్తోఽయ మేషోపిహి యథా వయమ్, ఏతదప్యస్య కాపేయం యదర్క ముపతిష్ఠతి."—చలచిత్తమైన ఈ కోతిగుంపులో ఆ కోతి ఒక్కటే సచిత్తమైనది—అది ఒక్కటే సూర్యుడిని ఉపాసించుచున్నది కాబట్టి అని ఒకరన్నారు. మిగిలిన కోతులకు కోపంవచ్చి అంటున్నవి: "అలాగు అనుకోవద్దు. మేము ఎటువంటి మనస్సుగలవాళ్లమో అదీ అటువంటిదే. సూర్యుడికి అభిముఖమైఉన్నది అని అంటే, అదికూడా కోతి చేష్టల్లోలెక్కే."

మనం మాట్లాడుతున్నప్పుడు తప్పులు పట్టదలచుకుంటే చాలాకనపడుతై. సాలెవాడిదగ్గఱకు వెళ్లి "ఈనూలుతో బట్ట నేసిపెట్టు" అంటే వాడు తెల్లబోతాడు. నేస్తే తయారు అయ్యేది బట్ట. ఇదే బట్ట అని అనకుంటే, నెయ్యనక్కఱలేదు. బట్ట నేసిపెట్టమనటం విప్రతిషిద్ధం. అయితే భావిసంజ్ఞను ఇప్పుడే ప్రయోగించాడు కనుక 'తప్పులేదు' అని తర్కించి అప్పుడు ఒప్పుకుంటాడు. "భావినీ ఖల్వేషా సంజ్ఞాఽభిప్రేతా. సతుస్యేవాతవ్యో యస్మిన్నుతే శాటక ఇత్యేతద్భవతి" శాస్త్రంలోకూడా ఇటువంటి ప్రయోగాలు తప్పుగావు. లోకంలో ప్రయోగం ఉన్నదిగనుక. కాని అన్యోన్యాశ్రయం ఉంటే తప్పు ఔతుంది. 'వృద్ధిరాదైచ్' అని మొదటిసూత్రంలో ఆకార, ఐకార, ఔకారాలకు పాణిని వృద్ధిసంజ్ఞ విధిస్తాడు. వ్యాకరణశాస్త్రంలో అంతటా పూర్వోచ్చారితం సంజ్ఞి,

పరోచ్చారితం సంజ్ఞ. ఈ సూత్రంలో పాణిని ఆ నియమం పాటించలేదు. ఇటుది అటూ, అటుది ఇటూ మార్చాడు. ఏమయ్యా ఈ విపరీతం అంటే 'మంగళాదీని హి శాస్త్రాణి ప్రథంతే, వీరపురుషకాణి చ భవంతి, ఆయుష్మత్పురుషకాణి చ, అధ్యేతారశ్చ వృద్ధియుక్తా యథాస్యుః"—వృద్ధిశబ్దం ఆదిలో మంగళంకోసం ప్రయోగించాడు. అధ్యేతలు వీరులై, వృద్ధియుక్తులై, ఆయుష్మంతులై ఉండుటకు శాస్త్రంలో ఈ విధంగా మంగళకరమైన శబ్దం మొదలు ప్రయోగిస్తారు అని సమాధానం పతంజలి చెప్తాడు. మళ్లీ ఆక్షేపం వస్తుంది: ఈ సూత్రంలో సంజ్ఞి తెలియాలంటే, సంజ్ఞ ఏమిటో అర్థం కావాలి; సంజ్ఞ అర్థంచేసుకుందామంటే సంజ్ఞి తెలిస్తేనేకాని అది తెలియదు. ఇతరేతరాశ్రయదోషం పట్టింది. కట్టివేసిఉన్న పడవకి ఇంకొక పడవని కట్టివేస్తే నీటిలో మునుగుతున్నవాడిని రక్షించుటకు అది ఉపయోగించదు. అలాగే ఈసూత్రంలోకూడాను.

ఈ విధంగా వాదోపవాదాలతో మహాభాష్యం నిండిఉంటుంది. కొన్నిచోట్ల ఈ వాదములవలన చక్రకమూ (Argument in a circle), అన్యవస్థ ఏర్పడితే ఆ ఆక్షేపం అక్కడికి తుంచివేస్తాడు, మళ్లీ చుట్టుకుండా. వ్యాకరణశాస్త్రానికి పాణిని పోశాడు; కాత్యాయనుడు బలంకలుగజేశాడు; పతంజలి అందం తెచ్చిపెట్టాడు.

౨

వైదికవిజ్ఞానం వెదజల్లుతూ, అంతటితో తృప్తిపొందక లోకజ్ఞానం కలిగి కేవలమూ గ్రంథగ్రస్తుడై తనలో తను ముడుచుకొనిపోకుండా తన ప్రతిభచేత అందఱను ముగ్ధులను చేస్తూ, ధనమార్జించి, వైదికకర్మానుష్ఠానానికి ముప్పులేకుండా ఐహికసుఖం అనుభవించి, చమత్కారప్రియమైన స్వభావం సూచించుతూ కంటిలోనుంచి తొంగుతున్న తరలద్యుతులతో ఒకపక్కన శిష్యసందోహానికి చక్కిలిగిలి పెడుతూ, ఇంకొకపక్కన ప్రతివాదముకొఱకు వచ్చినవాళ్లని సమ్మోహితులను చేస్తూ, స్ఫురద్రూపంతో, పింగలకపిలకేశములతో, ఆచారవంతుడై శుచిగా, సుష్ఠుగా భోజనంచేసి, సుఖోపవిష్టుడై శిష్యులకు సుగమంగా ఉండేలాగున పాఠంచెప్తూఉన్న మూర్తీభవించిన శబ్దబ్రహ్మముగా పతంజలిని మనము ఊహించుకోవచ్చును. సూత్రాలకు ఉదాహరణ-ప్రత్యుదాహరణాలు ఇవ్వటంలో ఆయన ఒక విశిష్టతను కనబరుస్తాడు. అందరికీ అనుభవంలో ఉన్న సంగతులు జీవద్భాషలో పలుకుతాడు. ఆయనమాటలు చెవికిసోకగానే కంటికి చిత్రం కట్టినట్టు అర్థమవుతుంది.

'అబ్రాహ్మణుని తీసుకొనిరమ్మ'ని చెప్తే, మట్టిముద్ద ఒకటి తీసుకొనివచ్చి 'అబ్రాహ్మణుడు వచ్చాడు' అంటే పొసగదు. బ్రాహ్మణసదృశుడు, బ్రాహ్మణభిన్నుడు అయిన మిగిలిన వర్ణంవారినే తీసికొనిరావాలి. బ్రాహ్మణుడైయుండికూడా బ్రాహ్మణగుణాలు లేకపోతే వాడినికూడా 'అబ్రాహ్మణుడు' అనవచ్చు. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రశబ్దాలు గుణసముదాయమందే వర్తించుతై. "తపః శ్రుతంచ యోనిశ్చేత్యేతద్బ్రాహ్మణకారకమ్, తపః శ్రుతాభ్యాం యో హీనో జాతిబ్రాహ్మణఏవ సః"—తపస్సు, అధ్యయనం, జన్మ ఈ మూడూ ఉంటే బ్రాహ్మణుడు. ఒక్క జన్మచేతనే బ్రాహ్మణుడైనవాడు ఏమి బ్రాహ్మణుడు! "అబ్రాహ్మణోఽయం తిష్ఠన్ మూత్రయతి, తిష్ఠన్ భక్షయతి"—నుంచొని మూత్రవిసర్జనం చేసేవాడు, నుంచొని తినేవాడు, వాడు జన్మచేత బ్రాహ్మణుడైనప్పటికీ అబ్రాహ్మణుడే; గుణహీనుడుకాబట్టి. బ్రాహ్మణుని పిలుచుకొనిరమ్మని అంటే, వెళ్లి 'గౌరం, శుచ్యాచారం, పింగలం, కపిలకేశం'—తెల్లగా, శుచిగా, పింగలకపిలకేశములతో, బ్రాహ్మణలక్షణాలతో ఒప్పుతున్నవాడిని చూసి పిలుచుకొనివచ్చి, తరువాత వీడు జాతివలన బ్రాహ్మణుడు కాడు అని తెలుసుకోవచ్చును. అంతేగాని బ్రాహ్మణుని పిలవమన్నాడుగదా అని నల్లగా మినుములరాశిలాగ కొట్టుమీద కూర్చున్నవాడిని చూసి వీడు బ్రాహ్మణుడు అని పిలుచుకొని వస్తాడా? "నహ్యయం కాలం మాషరాశివర్ణం ఆపణే ఆసీనం దృష్ట్వా అధ్యవస్యతి బ్రాహ్మణోఽయ మితి."

మామూలుగా ప్రకృతిని, ప్రత్యయాన్ని విడదీసి ఎంతవఱకు ప్రకృతి, ఎంతవఱకు ప్రత్యయం ఉన్నదీ చెప్పవచ్చును. కొన్నిచోట్ల ఎంతవఱకూ ఏది ఉన్నదో తెలుసుకోలేము. ఏ అవకాశంలో (Proportion) నీరూ పాలూ కలిసిఉన్నవో తెలుసుకోలేనట్టు. "క్షీరోదకే సంపృక్తే, కస్మిన్నవకాశే క్షీరం, కస్మిన్నవకాశే ఉదకమితి న జ్ఞాయతే."

సూత్రంచేత ఒకరూపం తయారు అయినప్పటికీ పతంజలికి ఇంకొకరూపం ఇష్టం అయితే అదికూడా వాడవచ్చును. దానిని 'ఇష్టి' అంటారు. ఒకసూతుడికీ (రథచోదకుడు), ఒక వైయాకరణుడికీ తగాదావచ్చింది.

"వై—ఈ రథానికి 'ప్రవేత' (సారథి) ఎవరు?

సూ—నేనూ ఈ రథానికి 'ప్రాజిత' (సారథి).

వై—అపశబ్దం ప్రయోగించుచున్నావు.

సూ—దేవానాంప్రియులకు (మూర్ఖులకు) సూత్రప్రాప్తమైన రూపమే తెలుస్తుంది. ఇష్టివలన వచ్చిన రూపం తెలియదు. 'ప్రాజిత' అనే రూపం కూడా ఉన్నది.

వై—ఈ 'దురుతుడు' నన్ను తిట్టుచున్నాడే!

సూ—సూతశబ్దం 'వే' ధాతువునుంచి రాలేదు. 'సూ' ధాతువునుంచి వచ్చింది. నన్ను తిట్టదలచుకుంటే 'దుఃసూత' అని అనాలి."

'అజ' అనే ధాతువునుంచి 'ప్రవేత' అనే రూపం సూత్రంవలన 'వీ' అనే ఆదేశం పొందివచ్చింది. ఇష్టివలన ఆదేశంలేకుండా ఆధాతువునుంచే 'ప్రాజిత' అనే రూపం వచ్చింది. ఈ ఇష్టి వైయాకరణుడికి తెలియలేదు. అదేకాకుండా, సూతశబ్దం 'వే' ధాతువునుంచి వచ్చిన క్తప్రత్యయాంతము అనుకొని, సు + ఉత సూత అన్నప్పుడు మంచిసారథిఅనే అర్థం వచ్చింది అని భ్రమపడి, వాడిని తిట్టదలచుకున్నాడు కాబట్టి దుర్ + ఉత = దురుత అని తన అజ్ఞత్వాన్ని వెలిబుచ్చాడు. 'వే' ధాతువునుంచే 'ఉత' శబ్దం వచ్చింది గాని సూతశబ్దానికి, దానికి సంబంధంలేదు. 'ఇష్టి' కున్నప్రాముఖ్యం ఈ సంభాషణవలన తెలుస్తుంది.

ఆర్యావర్తం యెంతవఱకో పతంజలి చెప్తాడు, తూర్పు—ఆదర్శపర్వతం, పడమర—కాలకవనం. దక్షిణం—హిమవంతం, ఉత్తరం—పారియాత్రం. ఈ హద్దులమధ్య ఉన్నదంతా ఆర్యావర్తం. కంచుకంచంలో భోజనంచెయ్యడం పతంజలి చెప్తాడు. 'ఆయుర్ఘృతం'—నెయ్యి తాగితే ఆయుర్వృద్ధి. 'దధిత్రపుసం ప్రత్యక్షో జ్వరః'—పెరుగు (ఏ తేగటి పెరుగో) తాగితే జ్వరం ప్రత్యక్షమాతుంది. "మూత్రాయ కల్పతే యవాగూః, ఉచ్చారాయ యవాన్నం"—(బార్లీ) గంజి తాగితే మూత్రం, యవాన్నం తింటే మలం అధికంగా అవుతై.

డబ్బు సంపాదించాలంటే నాలుగు ఉపాయాలు. "స్వం నామ చతుర్భి రేతత్ప్రకారై ర్భవతి: ౧. క్రయణాత్—వ్యాపారం, ౨. అపహరణాత్—దొంగతనం, ౩. యాచ్ఞయా—ముష్టి, ౪. వినిమయాత్—మార్పిడి. ఇన్ని తిప్పలు పడి ప్రజలు సమృద్ధి చెందుతారు. "శయానా వర్ధతే దుర్వా"—గడ్డి పడుకునే వర్ధిల్లుతుంది; "ఆసీనం వర్ధతే బిసం"—నిటారుగా కూచొని తామరతూడు ఎదుగుతుంది. ఎంత కష్టపడి ఎంత సంపాదించినా "యశ్చిరం జీవతి స వర్షశతం జీవతి"—మహాబతికితే నూరేళ్ళే. ఆతర్వాత యముడు 'అహరహ ర్నయమానో గా మశ్వం పురుషం పశుమ్, వైవస్వతో నతృప్యతి సురాయా ఇవ దుర్మదీ'—పశువులనీ, మనుష్యులనీ దినదినం తీసుకొనివెళ్ళుతూ కూడా తృప్తి అనేది పొందడు—మత్తిల్లినవాడు సురచేత తృప్తి పొందనట్టు.

సమానవర్ణం అయినప్పటికీ ఆవు ఎఱ్ఱగా ఉంటే 'లోహితం' అంటారు. గుఱ్ఱం ఎఱ్ఱగా ఉంటే 'శోణం' అంటారు. ఆవు నల్లనిదైతే 'కృష్ణం' అంటారు, అదే రంగు గుఱ్ఱానికి ఉంటే 'హేమం' అంటారు. ఆవు తెల్లనిదైతే 'శ్వేతం', గుఱ్ఱం తెల్లగా ఉంటే 'కర్కం' అంటారు.

ఒకటి అడిగితే ఇంకొకటి చెప్పటం ఎప్పుడూ ఉన్నదే. "ఆమ్రాన్ పృష్టః కోవిదారా నాచష్టే"—మామిడిసంగతి అడిగితే కోవిదారంసంగతి చెప్పటం అదే.

ఏ నిమిత్తాన్ని అనుసరించి పని చేస్తున్నారో ఆ నిమిత్తవాచి సప్తమీవిభక్తిలో ఉండాలి అన్నారు. పతంజలి ఉదాహరించాడు—"చర్మణి ద్వీపినం హంతి, దంతయో ర్హంతి కుంజరమ్, కేశేషు చమరీం హంతి సీమ్ని పుష్కలకో హతః"—చర్మంకోసం పులిని చంపుతారు; దంతాలకోసం ఏనుగని; జుట్టుకోసం చమరీ మృగాన్ని; కస్తూరికోసం కస్తూరిమృగాన్ని.

ఉత్పాతం జ్ఞాప్యమాన మాతుంటే చతుర్థీవిభక్తి వస్తుంది. "వాతాయ కపిలా విద్యు దాతపా యాతిలోహినీ, పీతా భవతి సస్యాయ దుర్భిక్షాయ సితా భవేత్"—కపిలవర్ణంగా మెఱుపు ఉంటే గాలి వీస్తుంది; ఎఱ్ఱగా ఉంటే ఎండ బాగా కాస్తుంది; పచ్చగా ఉంటే సస్యసమృద్ధి; తెల్లగా ఉంటే దుర్భిక్షుద్యోతకం.

పెద్దవాళ్లు వచ్చినప్పుడు చిన్నవాళ్ల ప్రాణాలు లేచిపోతై. చిన్నవాళ్లు లేచి అభివాదన చేస్తే ఆ ప్రాణాలు తిరిగివస్తై. "ఊర్ధ్వం ప్రాణా హ్యుత్క్రామంతి యూనః స్థవిర ఆగతే, ప్రత్యుత్థానాభివాదాభ్యాం పున స్తాన్ ప్రతిపద్యతే" ఈ శ్లోకం మహాభాష్యంలోనే కాకుండా మహాభారతంలోనూ, మనుస్మృతిలోగూడా ఉంది. ఎవరు ఎందులోనుంచి గ్రహించారో! 'ఏతి జీవంత మానందో' అనే వాక్యం భాష్యంలో ఉన్నది. "ఏతి జీవంత మానందో నరం వర్ష శతాదపి" అనే శ్లోకం రామాయణంలో ఉన్నది. పతంజలికి, మిగిలినవారికి గల పౌర్వాపర్యం ఎప్పటికైనా పరిశోధకులు నిర్ణయించకుండా విడిచిపెట్టరు. "వరతను సంప్రవదంతి కుక్కుటాః" అని భాష్యంలో ఒక వాక్యం. కుమారదాసు వ్రాసిన జానకీహరణం అనే గ్రంథంలో ఒక శ్లోకంలో ఒక పాదంగా ఈవాక్యం కనబడుతుంది. కుమార దాసుని గుఱించి లోకంలో ఒక శ్లోకం ఉన్నది. "జానకీహరణం కర్తుం రఘువంశే స్థితే సతి, కవిః కుమారదాసశ్చ రావణశ్చ యదిక్షమః"—జానకీహరణం అనే తప్పపని ఇద్దరుచేశారు. ఒకడు రావణుడు. రఘురాముడు ఉండగానే ఈయన ఈపని చేశాడు. రెండు, కుమారదాసు. ఘువంశం ఉండగా మళ్లీ ఈయన జానకీహరణం అని వ్రాశాడు. ఈ శ్లోకాన్ని బట్టి కాళిదాసుకంటే, కుమారదాసుకంటే తరువాత వస్తున్నాడు పతంజలి అని చెప్పేవాళ్లు ఉన్నారు. శ్లోకంలో ఇమిడేలాగున ఈ వాక్యంఉన్నది అని కుమారదాసు తన శ్లోకంలో ఇరికించుకున్నాడేగాని పతంజలి చాలా ప్రాచీనుడని శిష్టశిరోమణులు అనుకుంటారు. ఈ విధమైన వాద మే భౌమకకవిని, పతంజలినిగురించి ఇంకొకటి ఉన్నది.

సుశబ్దజ్ఞానంవలన ధర్మం కలుగుతున్నది అన్నారు. అయితే ఒక్కొక్క శబ్దానికి అనేకఅపశబ్దాలు శబ్దజ్ఞానం ఉన్నవాడికి అపశబ్దజ్ఞానంకూడా ఉంటుంది; కాబట్టి అధర్మం మరీ ఎక్కువ కలుగుట లేదా అని ఆక్షేపించుతే జ్ఞానపూర్వక ప్రయోగమందే ధర్మమని వేదం చెప్పినది. 'శబ్దప్రమాణకా వయమ్'—వైయాకరణులు శబ్దప్రమాణకులు. వ్యవహారకాలంలో సాధుశబ్దప్రయోగంవలన వాగ్యోగవిదుడైన వాడికి పరలోకంలో అనంతమైన జయం కలుగుతుంది అని వేదవాక్కు. అయితే, ఈ బ్రాహ్మణి ఒకమాట అనటానికి ఇంకొక మాట అన్నది అని చెప్పవలసివచ్చినపుడు ఆనిడ ఉపయోగించిన అపశబ్దం మనం ఉపయోగించితే అధర్మం వెంటనే చుట్టుకుంటుందా? లేదు. శిష్టులైనవాళ్లని అనుకరించితే అభ్యుదయం కలుగుతుంది. వారు ఈ విధంగా సత్రం నిర్వహించుతారు అని మనంగూడా ఆవిధంగా సత్రం నిర్వహించితే అభ్యుదయం కలుగుతుంది. వాళ్లు ఈ విధంగా కల్లు తాగారు అని మనంకూడా కల్లు తాగి చూపిస్తే తప్పే. కాని అప్రతిషిద్ధమైనది, శాసింపబడనిది చేస్తే తప్పూ లేదు, ఒప్పూ లేదు. వాడు ఇలాగ నవ్వుతున్నాడు, ఇలాగ గోకుతున్నాడు, ఇలాగ వాడికి ఎక్కిళ్లు వస్తున్నవి అని వాడిని అనుకరించితే దానివలన అభ్యుదయం లేదు, దోషం లేదు. అపశబ్దం అనుకరణలోనేతప్ప ఇంకొకచోట కనబడకూడదు. అర్థంలేని చదువూ వ్యర్థమే. బూడిదలో ఎండుకట్టె ఎంత మండుతుందో అంతే అది. వాగ్విదుడైనవాడికి వాక్కు నిజస్వరూపాన్ని వ్యక్తపఱుచును.

టుంది. సువాసస్సు ధరించిన భార్య నిజరూపాన్ని భర్తకు అర్పించినట్టు—"ఉతోత్వస్మై తన్వం విసస్రే, జా యేవ పత్య ఉశతీ సువాసాః."

వ్యాకరణంచేత సాధువైనది గదా అని ప్రతి శబ్దానికీ ప్రయోగం లేదు. అప్రయుక్తమైన శబ్దాలు ఉన్నై. 'వండాడు' అనటానికి 'పేచ' అనవచ్చు. 'చేశాడు' అనటానికి 'చక్ర' అనవచ్చు. కాని ఇవి ప్రయోగంలో లేవు అని భాష్యం. మాఱుమూలశబ్దాలు వ్యాకరణంచేత సాధువైనప్పటికీ ప్రయోగించకూడదు. ధాతువుకు ఇష్టం వచ్చినట్టు ముందు ఉపసర్గ చేర్చ కూడదు. శిష్టప్రయోగం ఎలా ఉందో కనిపెట్టి వాడాలి. 'అవాద్గ్రః' అని సూత్రం. 'అవ' పూర్వకమైన 'గృ'ధాతువుకు ఆత్మనేపదం విధించాడు. గృధాతువు రెండుచోట్ల ఉన్నది. 'గిరతి' అనే రూపం కలది ఒకటి; 'గృణాతి' అనే రూపం కలది ఒకటి. ఈరెంటిలో దేనికి వర్తించుతుంది ఈసూత్రం అంటే, 'గిరతి'అనేదానికే. 'గృణాతి' అవపూర్వకంగా ప్రయోగింపబడదుగనుక. "గృణాతి స్త్వవపూర్వకో నప్రయుజ్యత ఏవ" అని భాష్యం. కాబట్టి అపశబ్దప్రయోగమూ చెయ్యకూడదు; అప్రయుక్తశబ్దప్రయోగమూ చెయ్యకూడదు.

సంస్కృతంలో 'ళ' కారం లేదు. ఎ, ఒ-లు (హ్రస్వాలు) లేవు. తెలుగువారు అవి తమ భాషలో ఉన్నవికాబట్టి తెలుగు ఇంకా సంపూర్ణమైన భాష అని ముచ్చటపడతారు. సంస్కృతంలో 'ళ' కారానికి లోకంలో ప్రయోగం లేదు. వేదంలో ఉన్నది 'అగ్నిమీళే' అని. అలాగే ఎ, ఒ లకుకూడా ఛందోగంలో సాత్యముగ్రిరాణాయనీయులవేదపరిమత్తులో 'సుజాతే, విశ్వసూనృతే' అని హ్రస్వప్రయోగం కనబడుతుందిట. మిగిలిన వేదంలోకాని, లోకంలోగాని హ్రస్వప్రయోగం లేదు. లేవు అంటే వాటి సంగతి తెలియదని గాదు. ఏ, ఓ-లు సంధ్యక్షరాలు. అ + ఇ కలిసి ఏ; అ + ఉ కలిసి ఓ అయినవి. రెండుమాత్రలు ఉన్నవి కాబట్టి అవి దీర్ఘంగానే ప్రయోగించటం న్యాయ్యం. అరవంలో 'ఝ', హిందూస్థానీలో 'ఖ' వగైరాశబ్దాలు వికృతంగా చప్పడౌతై. అవి వ్రాతకు లోబడే అక్షరాలు కావు. ఈధ్వని సంస్కృతంలో లేదు అని కొందరు అంటూఉంటారు. మొద్దునాలుకవాడు తేలికనాలుకవాడిని ఆక్షేపించితే ఎంత బాగుంటుందో అంత అందంగా ఉంటుంది ఈ ఆక్షేపం. సంస్కృతంలో ప్రత్యక్షరం ఉత్పత్తిస్థానాన్ని, ప్రయత్నభేదాన్ని అనుసరించి నిర్ణయించబడింది. పాణినీయ శిక్షలో "వ్యాఘ్రీ యథా హరేత్ పుత్రాన్ దంష్ట్రాభ్యాం నచ పీడయేత్, భీతా పతనభేదాభ్యాం తద్వద్వర్ణాన్ ప్రయోజయేత్"—పులి తన పిల్లలని పళ్లతో కఱచి తీసుకొనివెళ్లుతుంది. పిల్ల కింద బడకుండా గట్టిగా పట్టుకుంటుంది; దానికి నొప్పి తగలకుండా ఉండేఅంత వదులుగానూ పట్టుకుంటుంది. ఆవిధంగా వర్ణాలు ఉచ్చరించాలి. సంస్కృతం సంస్కరింపబడిన భాష. అది ఎంత కృషిచేస్తే అంత ఉపోద్బలకంగా ఇతరభాషలకు ఉంటుంది. ప్రాకృతుడు బాగుపడాలి అంటే సంస్కృతుడి సహవాసం చెయ్యాలి.



# జనకకృత శుకపరీక్ష

= శ్రీ నోరి నరసింహశాస్త్రి =

ఒక్క ముహూర్తావధి యట నక్కరణిన్ నిల్వ శుకుఁడు నాలో నతనిన్
ఒక్క నృపామాత్యుఁడు కని - మ్రొక్కి వడి ద్వితీయ కక్షలోనం జేర్చెన్.

అం దొక రమ్యహా నుపవనావని యొప్పు మరందబిందుని
ష్యందము దిగ్దిగంతరవిసారిపరాగము విభ్రమన్మదేం
దిందిరశారికాపికసమీరితరావము కేళిదీర్ఘికా
నందితరాజహంసము మనఃప్రభవోజ్జ్వలమందిరంబునై.

ఆ వనభూమిమధ్యఁ జెలువారు నొకానొక కాంతకాంతి రా
జావసథంబు; వ్యాససుతు నందు వసింపఁగఁ జేసి పూజ్యసే
వావిధు లెల్లఁ దీరిచి యవారణమైఁ బరిచర్యసేయ వే
శ్యావనితాశతంబు శుకు సన్నిధి నుంచె నమాత్యసింహమున్.

ఆ పడతుల్ నవోదయితయౌవనకోమలగాత్ర లంగజో
ద్దీపకదీపికాసదృశ దివ్యదృగంతలు చక్రవృత్తశై
లోపమపీవరోన్నతపయోధరనమ్రలు శ్రోణిభారసం
దాపితమత్తయాన లల దైవతభామల జోడు లందరున్.

వారలు కాకలీకలరవప్రియ కంఠలు, గీతరాగని
స్సారణ చారణీకళలు, సారచతుర్విధవాద్య వాదనన్
ధీరలు, నృత్యవిద్య నవధీరితరంభలు, కామదేవదీ
క్షారుచిపానశౌండలు ప్రగల్భలు మంజువచోవిచాలనన్.

శుకునంగంబుల నిండుజవ్వనపు రోచుల్ చిందులాడన్, సుధాం
శుకళాస్నిగ్ధములై ముఖంబున స్మితజ్యోత్స్నల్ వెలుంగొంద, శా
రికలన్ గీరపికాళిఁ గేరెడు వచఃశ్రీ పొంగువారంగ ద
ర్పకరమ్యాద్భుతరూపుఁ గాంచి వనితల్ కామార్తలై రందరున్.

ఎన్నఁడు నోరులనె తమచేఁ - బన్నిన మోహంపు టురులఁ బట్టుచుఁ బరపా
కోన్నతి యెఱుఁగని నట్టువ - లన్నా, విజ్ఞానముగ్ధ లగు టది యరుదే!

వలయు సపర్యలన్ సలుపఁ బంచి యమాత్యుఁడు నిష్క్రమింప, నా
లలనలు పంచబాణభరలాలసలై శుకుఁ జేరి, తియ్యపె
లుకుల చవి చూపుచున్ గుసుమకోమలపాణుల నూది, గారుడో
పలచితకుట్టిమం బగు సువర్ణగృహంబునఁ ద్రిప్పి రెల్లెడన్.

దేశకాలోపపన్నేష్ట దివ్యవివిధ - మృష్టరుచిరాన్నకలన సంతుష్టుఁ జేసి
వారవనిత లర్చించిరి పరమభక్తి - శుకు యథాశాస్త్రనిర్దిష్ట శుద్ధవిధిని.

వా రంతన్ శుకుఁ గేళికావనములో వాహ్యాళికిం బోవఁగాఁ
బ్రేరేపించి ప్రియోక్తులన్ వనతరుశ్రీ చూపి వర్ణించుచున్
శారీకోకిలకేకికాకలరవస్వానంబు విన్పించుచున్
జేరం దీసిరి దీర్ఘికాతటము కాంచీనాదముల్ పొంగఁగన్.

పాణి పాణిఁ దెమల్పఁ బద్మపాణి యొకర్తు బిగియనూఁదఁడు విడిపించుకొనఁడు
కనుదూపులు నిగుడ్పఁ గామాక్షి యొకతుక తూలఁడు లోలుఁడై తొలగి కనఁడు
గోటఁ జెక్కిట గీటఁ గోపన యొక్కతె పులకరింపఁడు చెంపఁ బులుముకొనఁడు
పెదవంటి ముద్దాడ బింబాధర యొకర్త మరుముద్దిడఁడు మోము మలచికొనఁడు,
కాము బారిఁ జిక్కి కామిను లాశుకుఁ - జుట్టుముట్టి చిక్కు పెట్టుచుండ
పట్టువడఁడు వారిఁ బదరఁడు తొలగఁడు - పాదుకొల్పి మాతృభావ మెడఁద.

మారుఁడు తోలఁగా నొక కుమారిక పోదిగనాడి సిగ్గు, మై
జారఁగఁ బైఁట నిక్కిన కుచద్వయితో శుకు రొమ్ము గ్రుమ్మి చే
యారఁ గవుంగిలింపఁ, జనులంట శుకుం డరచేత నల్ల, పొం
గారెను బాలు కన్నశిశు వంటిన జాలున దాని చన్నులన్.

ఆకలితీర్పఁ జాలు రుచిరామ్రఫలం బటువోలె చూపుకుం
దాక దురాశ దీపిక నితాంతము చుట్టి నిరాశఁ దూలు న
ఱ్ఱాక పతంగమట్లు దగయూర మరీచికనీటికిన్ మృగా
నీకమురీతి నంటి, శుకునిం బడయంగనరైరి కామినుల్.

సాయంకాలవనాంతవాయువులు సంచారింప నాశ్శాలి వే
శ్యాయోషల్ రచియించి రొక్క సుమశయ్యన్ నేరుపొప్పన్ పరా

ధ్యాయత్తాస్తరణంబుగా సురభిదీపారాత్రికంబై శుకా
ప్యాయార్థంబుగ దివ్యరమ్యవివిధోపస్కారపూర్ణంబుగాన్.

శుకుఁ డాబాలల గోల యల్ల తొలగన్ జూపోపి యందున్న వా
పికనీటన్ గుశపాణియై కరపదాక్షేపాత్తశౌచాత్ముఁడై
యకలంకస్థితి నేకచిత్తుఁడయి సంధ్యాకృత్యముల్ తీర్చి యం
దాక యామంబు నివాతదీపికలతో నొప్పారె ధ్యానించుచున్.

ధ్యానానంతరమందుఁ దద్రచితశయ్యాసీమ మై వాల్చి తా
రానాథోదయమీలితాబ్జముల మేరన్ నేత్రముల్ మూయఁగా
ఆ నాళీకనిభాస్య లాడి రట మంద్రాలాపసాంద్రంబుగా
జో నా ముద్దులబాల, జో శుకశిశూ, జో యం చయత్నంబుగన్.

శుకుఁడు యామద్వయము సుఖసుప్తి నొంది-అంత పాశ్చాత్యయామినీయామ మెల్ల
ధ్యాన సంస్థితుఁడై స్నాన మాచరించి - తీర్చి ప్రాతఃక్రియల్ పొల్చె స్థిరమతియయి.

(మదీయ 'శ్రీ దేవీభాగవతము' నుండి)



# తక్కువ త్యాగముతో డబ్బును, ఎట్లు ఎక్కువనిలువ చేసికొనవచ్చును?

AC 92 TG





స మ స్య:— నాలుగు అగ్గిపుల్లలతో రెండు చదరములను నాలుగు చదరములుగా మార్చుడు.



జ వా బు:— అదనముగానుండు నాలుగు పుల్లలను పటములో తెలిపినట్లు ఉంచుడు.

నేర్పుగా నాలుగు పుల్లలను ఉంచుట మూలముగా అవి ఎనిమిది అగ్గిపుల్లలు చేయుపనిని చేయునట్లు చేయవచ్చును. అదే విధముగా మీ కుటుంబ ఆదాయ వ్యయముల పట్టీలో, మీరు దాచిన సొమ్మును ఏ విధముగా ఉపయోగించవచ్చునో తెలిసికొనిన పక్షమున అత్యధికలాభమును మీరు పొందవచ్చును. నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్లను కొనుడు. కొద్దికొద్ది మొత్తములను దాచుకొనగలవారికే ఇవి ముఖ్యముగా ఉద్దేశింపబడినవి.

## నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్లు

### వీటివలన కలుగు ముఖ్యమైన లాభములు ఏవనగా:—

1. మీరు నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్లను 5, 10, 50, 100, 500, 1000, లేక 5000 రూపాయలకు కొనవచ్చును.

2. ఒక కుటుంబములోని ప్రతిమనిషియు (ఈడువచ్చిన మనిషి లేక మైనరు) 5,000 రూపాయలవరకు కొనవచ్చును. ఇద్దరుకలిసి 10,000 రూపాయలవరకు కొనవచ్చును.

3. 12 సంవత్సరములలో వీటి విలువ 100 కి 50 వంతులు పెరుగును. పెట్టుబడిచేయు ఒక్కొక్క రూపాయరూ. 1-8-0 లు అగును. ఇది గవర్నమెంటు పత్రముల మీద ఇవ్వబడు అత్యధిక వడ్డీ.

4. వచ్చే వడ్డీమీద ఇన్కంటాక్సు కట్టనవసరము లేదు.

5. 2 సంవత్సరములు దాటిన తరువాత వీటిని రొక్కముగా మార్చుకొనవచ్చును. (5 రూపాయల సర్టిఫికేట్ల విషయములో 18 మాసములు దాటిన చాలును)

6. కొద్ది మొత్తములను దాచుకొనగలవారు 1 రూపాయకు, 8 అణాలకు లేక 4అణాలకు సేవింగ్సు స్టాంపులను కొనవచ్చును. ఇట్లు కొనగా కొనగా, స్టాంపుల మొత్తము 5 రూపాయలైనపుడు, వాటికి బదులుగా ఒక సర్టిఫికేటును పుచ్చుకొనవచ్చును.

7. సర్టిఫికేట్లు, స్టాంపులుకూడ పోస్టాఫీసులలో గాని, గవర్నమెంటువారిచేనియమింపబడినఅధికారముపొందిన ఏజెంట్లవద్దగాని, సేవింగ్సు బ్యూరోలలో గాని దొరకును.

**మీ సేవింగ్సు గ్రూపులో మీరు ఇప్పుడే చేరండి!**



# బిడ్డ ఆరోగ్యం

తల్లి ఆరోగ్యంపైన

ఆధారపడివుంటుంది..

తన బిడ్డను పోషించి పెంచవలసినది, బిడ్డకు బలము, చైతన్యము కలిగించవలసినది తల్లి గనుక, బిడ్డ ఆరోగ్యం తల్లి ఆరోగ్యంపైన ఆధారపడివుంటుంది. శాంతి అశోకను ఇచ్చి తల్లి ఆరోగ్యాన్ని కాపాడండి. శాంతి అశోక ఆరోగ్య పోషకవస్తువులు గల ఉత్తమ రసాయనం. ఇందుకుతోడు, దీనిలో స్త్రీల ఆరోగ్యాన్ని సమూలంగా నాశనంచేసే స్త్రీ వ్యాధులకు ఉత్తమఔషధమని పూర్వంనుంచి ప్రసిద్ధి కెక్కిన ఓషధి 'అశోక' చేరివున్నది.

## శాంతి అశోక

**ఉత్తమ గర్భాశయ రోగనివారిణి**

శాంతి కుటీరం

తణుకు—పశ్చిమ గోదావరిజిల్లా,

సోల్ ఏజంట్లు:-శ్రీ కృష్ణా జనరల్ స్టోర్సు, తణుకు.

ఉజ్వలమైన సతీత్వము



పండిత్ డి. గోపాలాచార్యులవారి

# అరుణ

గర్భాశయరోగ నివారిణి.

అరుణ ఋతు దోషము లను పోగొట్టి, పరిపూర్ణ స్త్రీత్వమును ప్రసాదించ గల స్వయం సంపూర్ణ మగు ఔషధము. అట్టి దానిని విడువక సేవించినట్లయితే, మిమ్ము ఆరోగ్యవంతులను జేయుటయేగాక, మీ జీవన పరమావధి యగు అమందా నందమును తప్పక యొస గును.



ఆయుర్వేదాశ్రమం, లిమిటెడ్

టి-నగర్.... మద్రాసు.

EASTERNS 378.

# సాహిత్యము-శృంగారము



### బెజారే రెడ్డి

గత ఇరవై సంవత్సరాల ఈప్రాంతాలలో అమెరికన్ నవలాసారస్వతమందు మహావిపరీతమయిన విషయము మన కళ్లముందే జరుగుతూవచ్చింది. పుల్లవిరుపుగా చెప్పాలంటే, ప్రజాబాహుళ్యానికి విరివిగా అందుబాటౌతూన్న సారస్వతంలో ఈనాడు ఉన్నంత స్వేచ్ఛా, స్వైరవిహారం ఏనాడూ లేదు. పురుషార్థాన్ని నిర్మొగమాటంగా బటబయలు చెయ్యటంలో చీనాపురాణాలూ, అరెటినో (Aretino), పెట్రోనియస్ (Petronius) ల పూర్వగ్రంథాలు మాత్రమే వీట్లతో కాస్త తులతూగగలుగుతాయేమో! కాని అరెటినో పచ్చిశృంగారం కోసమనే తన గ్రంథం వ్రాశాడు. పెట్రోనియస్ ఏకొద్దిమందినో ఉద్దేశించి వారికై వ్రాశాడు. చీనాకవులు పండితబృందానికి కొద్దిమందికిమాత్రమే అర్థమయే గ్రాంథికభాషలో వ్రాశారు. నే చెప్పవచ్చిన దేమంటే ఇంతకుపూర్వం ఏదేశంలోనూ, సామాన్యపతయితే, ఈనాడు మనదేశంలో అయినంతగా జీవప్రధానికమైన ప్రాకృతకర్మచర్చకింతగా గురికాలేదు. ఈ పరిస్థితులు క్రమక్రమంగా అతిశాంతంగా, అంటే విమర్శపాత్రాలు కాకుండా ముందుకు చొచ్చుకొనివచ్చి ఈనాడు విమర్శకు అవశ్యకతను కల్పించాయి.

"రెస్టోరేషన్ కామెడీ" (Restoration Comedy) లే చాలా అల్లరిగా ఉందన్నరోజులు, డ్రెయిజర్ (Theodere Dreiser) రచనల స్థూలసత్యాలే చాలా చొరవగా ఉన్నాయనుకొన్న రోజులు, కేబెల్ ద్వంద్వార్థాలూ, నర్మస్ఫురణలూ, వక్రోక్తుల ప్రాగల్భ్యాన్ని పారచూచాయని అనుకొన్న రోజులూ, ఈ రోజులన్నీ జ్ఞాపకంచేసుకోటానికి, శత వృద్ధులము కానక్కరలేదు. మొన్నమొన్ననే గడిచాయి ఈ రోజులన్నీ. విక్టోరియాశకాన్ని అంటిపెట్టుకొని వచ్చిన తరాలవారంతా ఫీల్డింగ్, స్మాలెట్లు అనుభవించిన స్వేచ్ఛావాతావరణాని కీర్ష్యచెందారు. ఆరోజులలో, ఎప్పుడైనా ఏండ్లనుండీ ఉండే బొక్కాషియో (Boccacio), బాండెల్లో (Bandello), రాబిలాస్ (Rabelais), హెప్టామెరన్, (Heptameron) గ్రంథరాజాలు గ్రంథవిక్రేతల రహస్యపుబీరువాలలోనూ, గ్రంథాలయాలలో ప్రత్యేక స్థానాలలోనూ మాత్రమే ఉండేవి. అనాడు అపరూపముగా ఉండే ఆ గ్రంథాలను చూడండి. ఈ నాడు గ్రంథవిక్రేతల బీరువాలు నిండిపొర్లుతూ ప్రజలందరికోసం గ్రంథమాలలు విరివిగా పంపకంచేస్తూన్న ఈ నవలలను చూడండి. వీట్ల పేర్లు చెప్పనక్కరలేదు. అక్షౌహిణీరూపంలో, నిముషానికొక్కటిగా వెలువడుతున్నాయివి.

పూర్వము నవలారచయిత తన నాయికానాయకులను శయనగృహకవాటంవద్దకు తీసుకురావటంతో తన పని పూర్తిఅయిపోయిం దనుకొనేవాడు. కాని ఆధునికనవలారచయితల ప్రబలయత్నాలన్నీ ఆ గదిలో అడుగుపెట్టడంతో ప్రారంభిస్తాయి. అమాయికపతయితల మోములు సిగ్గుతో చెమరించకుండా, ఆస్టెరిక్స్-చుక్కలు-వీరోచితంగా ప్రవర్తించేవి. ఇప్పుడాచుక్కలన్నీ ఒక్కొక్కటే అన్నిఅన్ని పుటల విపులీకృత వచనవాక్యాలుగా మారిపోయాయి. ఎవరో Sumner వంటి మరీ పూర్వాచారపరాయణుడుతప్ప వాటిని చదివి సిగ్గుపడటము లేదు.

ప్రఖ్యాతనవలారచయితలు-అందులోనూ ముఖ్యం రచయిత్రులు - తమ నాయికలను ఎందరెందరి పక్కల్లోకి మార్చగలమా అన్న ఉత్సాహంలో పోటీలు పడుతున్నారు. వీరిలో ... కొంచెం

లైనవారు ప్రపంచశాంతిమహాసమావేశకలాపాలను బ్రాడ్‌కాస్టుచేయటానికై రేడియోఇంజనీయరు తయారయ్యే శాస్త్రప్రపరిముట్లతోటీ, తీసుకొనే అత్యంత శ్రద్ధతోటీ సరిసమానమైన దీక్షాశ్రద్ధలతో మిథునక్రియాప్రముఖసూత్రాలను సందర్శించుతారు. ఆపైన నాయిక చీరచెరగులు నేల జారటంతోటే నవలాకారుని రచనావిధానము (Technique) ప్రతిదృక్కోణంనుంచీ అనేక కెమేరాలతో ఫిల్ముతీస్తూన్న దర్శకుని ఉత్సాహాన్ని తలదన్నుతుంది. రచయిత తన రచన నతిమోజుపడి వ్రాస్తున్నాడన్న విషయం విదితమౌతూనేఉంది. కాని తరుచు ఆతను తను పొందినంత ఉత్సాహాన్ని చదువరిలో కలిగించలేకపోతున్నాడు. ఈ అతిసృష్టిలో మొగము మొత్తి రచయిత మనోరథం విఫలమై, విసుగుబుట్టిస్తుంది. శస్త్రవైద్యసమీకరణాలతో సమీపిస్తే శృంగారము మృతప్రాయమై ఊరుకుంటుంది. రతికృత్యాన్ని విపులంగా వర్ణించినకొద్దీ, ప్రేమరమ కావ్యంలో మృగ్యమయ్యే ఆస్కారముంది.

ఒక్కటొక్కటిగా చిన్నచిన్న నింద్యగ్రామ్య పదాలనేవి గోడలూ కంచెలూ దాటి, అతిగౌరవనీయమైన గ్రంథాలయ ప్రచురణల అచ్చుకాగితాలలోకి క్రమక్రమంగా ప్రవేశించాయి. భయంభయంగా, నయంనయంగా దూరటం ప్రారంభించి, తమ నడ్డుపెట్టేవాళ్లు ఎవళ్లూ లేకపోయేటప్పటికి ధైర్య మినుమడింప చేసకొని, ఈనాటికి అట్టి పదజాలంయావత్తూ, అతిగౌరవమైన అచ్చుపదాలమధ్యకూడా ఆదరణను పొందింది. ఒకనాడీమాటలు నిషిద్ధమయి, కేవలం నిషిద్ధాలయిన కారణంచేతనే ప్రబలశక్తివంతమయి ఉండి, ఈనాడు తక్కిన మాటలతోబాటు పరిపాటిగా అచ్చులో కనబడసాగేటప్పటికి, తక్కినవాట్లలో పాటయిపోయి, తమ ప్రత్యేకశక్తి రాలిపోయి, సామాన్యస్థితికి కృంగిపోయినవి. మొదటిమాటు అచ్చులో కనబడ్డప్పుడు ఎంత విడ్డూరంగా కనపడ్డా, అలవాటుగా కనబడటంతో ఆ విడ్డూరం సన్నగించింది. పరిమితి దాటడంతో ప్రతిఫలం క్షీణిస్తుందన్న న్యాయము మొకటుంది.

ఉదాహరణకు, మొన్నమొన్ననే, ఆంగ్లేయ నాటకరంగంమీద, ఒక నటీమణిచేత "బ్లడీ" (Bloody) అన్న చిన్నమాటను వాడించిన లజ్జుకో, జార్జి బెర్నార్డ్‌షా, ప్రేక్షకులలో సంచలనం కల్గింపజేశాడు. ఈనాడామాట నాటకరంగంమీద విరివిగా వినపడుతూ తక్కిన చిల్లరగ్రామ్యంతోపాటుగానే శక్తిహీనమైపోయింది. ఈలాంటి మాటలన్నీ, మళ్లీమళ్లీ అచ్చులో, ఆబాలగోపాలమూ చదివే పుస్తకాలలో కనబడటం మొదలుపెడితే వాట్లకు మునుపున్న ప్రభావము పూర్తిగా నశిస్తుందంటే, నమ్మకం కలగటం కష్టమే కావచ్చును. కాని తప్పకుండా, ఆమాటలలో ఉండే ఆభాసప్రభావం నశిస్తుంది. అదీకూడా మంచిదే. ఎందుకంటే, నిషిద్ధాలుగా పతనమైపోయిన ఈమాటలు తక్కిన మాటలతోపాటు గౌరవం అందుకొని తమ నైచ్యతను గోల్పోవటం ఒకమాదిరి విజయంగానే భావించవచ్చును. కాని వచ్చిన చిక్కేమిటంటే, మానవుడు మానవుడుగా ఉన్నంతకాలం, మన ప్రకృతి ఈవర్గానికి చెందవలసిన కొత్త హాస్యపదజాలాన్ని సృష్టించుకొనేందుకు ప్రేరేపిస్తూనేఉంటుంది. ఆమాటల పూర్వస్థానం ఖాళీగా ఉండకుండా, కొత్తమాటలతో నిండి పోవలసిందే.

పదాలకు బాహ్యకమైన ఈ అతిపరిచయన్యాయమే, ఒకనాడు నిషిద్ధమైన రంగాల వర్ణనకు, నిషిద్ధవిషయవిపులీకరణకుకూడా అన్వయిస్తుంది. ప్రబల స్వైరవిధానంలో సంచరించనన్వేషించే నవలారచయిత అంతకంతకూ మైకము పెంచే మద్యగీతాల నాస్వాదించి ఆలపించవలసివస్తుంది. తను అనుకొన్న రసాన్ని పుట్టించేందుకు అంతకంతకూ తన వాక్యాల మధువులో మత్తుపదార్థాలను బలీయం చేయవలసిఉంటుంది. స్థానభ్రంశి మందకుండా తను నిలవగలగాలంటే, అంతకంతకూ వేగంగా పరువులు తీయాల్సిఉంటుంది.

కాని నవలారచయిత ఈ మత్తుపదార్థాలను హెచ్చించటానికికూడా ఒక అంత్యముంది. అతని పరుగువేగానికి కూడా ఒక పరిమితి ఉంది. ఆ పరిమితి అందుకున్నాక (ఒకటిరెండు ఈమధ్యవచ్చిన ప్రముఖరచయితల నవలలలోనూ, ఘట్టాలలోనూ ఆ పరిమితి వచ్చేసిందనే నేననుకొంటాను) మనం మళ్ళీ కాస్త సింహావ

లోకనం చేసుకొని చూస్తే, ఈ ఫలితానికి ఇంత శ్రమా అవసరమేనా అనిపిస్తుంది. అసలున్న విషయమేమిటంటే, ప్రపంచంలోని స్వేచ్ఛ అంతా యిచ్చినా కూడా, సృజనాదక్షమయిన ప్రతిభ లోపించిన వాడు ఆస్వేచ్ఛ వృథాయే అవుతుంది. మరి అట్టి ప్రతిభే, సాంప్రదాయసిద్ధమైన పరిమితమార్గాలలోనే, సంపూర్ణ శక్తితో విజయవంతంగా ఫలించగలుగుతుంది. వినిర్ణీత కామోద్దీపనరంగాలలో కూడా ఈ విషయమే నిజమని కనబడుతుంది. "వీనస్ అండు అడోనిస్" (Venus and Adonis)లో రమ్యమైన ఘట్టాలను పరికించండి. ఆధునికనవలాకారులు మైక్రోస్కోపుల తోనూ, ఫ్లాష్‌లైటతో, టెక్నికలర్ కెమేరాల తోనూ జాగ్యముచేసే రంగంలో ఆ మహాకవి సూచీమాత్రంగా స్థలనిర్దేశ మొనరించి, ముందుకు సాగిపోయాడు. పవిత్రపర్వతారోహణ కృత్యంతో దినమంతా గడపటానికి ఆ మహాకవి నిరాకరించాడు.

రచయిత కెంత స్వేచ్ఛనైనా ఇయ్యండి, మేడ్మెజెల్ మాపిన్ (Mademoiselle Maupin) లోని నిర్దుష్టవచనాలంకారాలు కల్పించగలిగినవాటికన్నా కామోద్దీపనరంగాలను సృష్టించలేడు. లేదా అడోల్ఫ్‌లో (Adolphe) బెంజమిన్ కాన్‌స్టంటు (Benjamin constant) కన్నా ప్రేమరాగంలోని ఆవేదన, ఆనందాలను సూటిగా తరచలేడు.

కాన్‌స్టంట్ నవలవంటి మహత్తరరచనలనూ, తదితర ఉత్కృష్టకల్పనలనూ చూస్తే, అంతకన్నా సంపూర్ణమైన స్వేచ్ఛతో రచనకు సాగినా, వీరి కింతకన్నా ఒరగగలిగిన దేముందా అని ఆశ్చర్యం వేస్తుంది. మన 'వాస్తవికరచయితలు' తమ ప్రత్యేకతగా చెప్పుకొంటూన్న రంగంలో కూడా పూర్వరచయితలు ఆచ్ఛాదనలతో రచన సాగించినాకూడా జయప్రదంగానే కృషిచేసినట్లే కనబడుతూంది. నే చెప్పిన ప్రత్యేకత వ్యభిచారజీవనరంగములోనిది. ఆధునికనవలారచయితలు సిద్ధహస్తులమని చెప్పుకోగలిగితే, ఈ రంగంలోనే. ఈ విషయికంగా వారు చేసిన కృషి అనంతం ఉన్న నిజాన్ని - యావత్తునిజాన్నీ బహిరంగపరిచేందుకు అత్యుత్సాహంతో శ్రమకోర్చి, కృషిచేశారు. కాని పూర్వసాహిత్యవిజయాలతో పోల్చిచూస్తే, వీరి గొప్పగొప్ప విజయాలన్నీ ఏ పాటివి? ధర్మశిష్టం కాని ప్రేమగాథలైన ప్రసిద్ధనవలలను తీసుకొని, ఈనాడు నాజూకుగా పరిగణించబడుతూన్న గోపనరహితమైన పద్ధతి వీట్లల్లో అవలంబించబడకపోయినందువల్ల, వీటికి గల్గిన లాభనష్టాలను ఒక్కసారి గాఢంగా పరికించిచూస్తే తెలుస్తుంది.

ఉదాహరణకు అడాల్ఫ (Adolphe), అన్నాకెరెనినా (Annakarenina), స్కార్లెట్ లెటర్ (Scarlet let er), వానిటీఫెయిర్ (Vanity Fair), టెస్ ఆఫ్ దిడర్బర్‌విల్లీస్ (Tess of the Durbervilles) నవలలు తీసుకొందాం. అడాల్ఫ, ఎల్లనోర్‌ల హృదయబంధము, అభిగ్రహణము, విజయము, తదుపరి నైరాశ్యము, తుదిమోసంతో సంభవించిన విషాదసంఘటనమూ, బెంజమిన్ కాన్‌స్టంట్ (రచయిత) తన ప్రేమీప్రేమకుల దైహికసంబంధాన్ని విపులీకరిస్తే, ఇంతకన్నా ఎక్కువగా రాణించేవా? కౌంటిఫ్రాన్స్కీపట్ల అన్నాకున్న మోహబంధము, వారి విషమ సమావేశఘట్టాన్నీ, సంయోగవిపులీకరణాలతో నింపి ఉంటే టాల్స్టాయి ఇంతకన్నా గొప్ప నవలను సృష్టించగలిగిఉండేవాడా? మన వాస్తవికరచయిత లెవరైనా పూనుకుంటే, హెస్టర్ ప్రిన్, ఆర్థర్ డిమ్స్‌డేలల గాథ నెలా రచిసారోనని నా కాశ్చర్యమేస్తుంది. అధమం పెర్లగర్భంలో పడటమైనా చదువరికి చూపించకుండా వదిలేవారు కారు. కాని, సాంప్రదాయమార్గాలలోనే నడిచి హాథార్న్ మన కెంత ఎక్కువగా ఉపయోగపడగలిగాడో?

థాకరీ తను చెప్పకుండా వదిలేసిన విషయాలన్నీ చెప్పేఉన్నట్లయితే, బెక్కీ షార్ప్ (Becky-sharp) ఇంతకన్నా విశదంగా మన కర్థమయి, ఆమె ఇంకా ఉన్నతస్థితికి పోయి, సారస్వత నాయికలలో ఆమెకున్న స్థాన మింకా బలీయమయి, రాడన్ క్రాలీ (Rawdon crawly), లార్డ్‌స్టేన్ (Lord steyne), జోసఫ్ సెడ్లీ (J.seph Sedley)లతో ఆమెసంబంధబాంధవ్యాల విషయంలో మనకు గల్గిన జ్ఞానమేమైనా పెం

పొందేదా ? జవాబును తడుముకోనవసరం లేదు. పెన్స్ విషయ మాలోచిద్దాం. మన అనామక వాస్తవిక రచయితలు చీకట్లో నిశ్శబ్దయూ అలముకొన్న బేడ్ లో రతిగాన్ని వర్ణించబూనుకొంటే, ఏం చేసిఉందురో వేరే చెప్పాలనా ? అధమం ఆరుపేజీలవరకైనా రచయితో, పఠయితా కూడా అంగాంగవిశదీకరణంలో మునిగి పోయిఉండేవారు. కాని ఇంత బట్టబయలైన రచనా కూడా విశ్వాసపూరితమైన సుషుప్త్యావస్థలో ఉన్న పెన్ ఉచ్ఛ్వాసనిశ్వాసాలకు సన్నగా కదలుతూన్న నులిజిలుగువసనాంచలాలను వర్ణించటంతో పొర్తి సిద్ధింప జేసిన అనుభూతికి సమము కాలేదు.

అసలు యథార్థ మేమిటంటే, మన నవలాకారులు, ఈస్వేచ్ఛకై తడుములాడుకోటంలో, కరచరణాద్యంగ విశేషవర్ణనాపంకంలో కూరుకొనిపోయి, ఆ బురద కన్ను కప్పి, సార్వత్రికమైన విశిష్టతలను పరికించలేకున్నారు. పైన పేర్కొన్న నవలాకారులందరూ కళాశీలురే. కళాశీలురు కావుననే, కథావిశిష్టత, కథన సంయమనము, రూపాంతరీకరణము, కవిసమయసాంకేతికాలు లేకుండా కళ నిలువలేదని వారికి తెలుసును. కళాశీలురు గావుననే ఉత్తమ కళారూపంలో ప్రత్యేక సూత్రాలు సమిష్టిసూత్రానికి అనుయాయులుగా ఉండాలని కూడా వారికి తెలుసు. కేవలం 'కళ' కోసమనే మన రచయిత లీ సంపూర్ణస్వేచ్ఛ నభిలషించి, పొందగలిగినవారైతే, వారు తప్పుడు దోవను పడ్డారనే అనుకోవచ్చును. ఎందుకంటే 'కళకు' 'సంపూర్ణస్వేచ్ఛకు' ఏనాడూ సామరస్యమైన పొత్తు కుదరలేదు. కేవలం, సమాజాన్ని విభ్రమంతో ముంచెత్తి తమ గ్రంథాల నమ్ముకోనేందుకే కొందరు రచయిత లీ స్వేచ్ఛ నుపయోగించి ఉన్నట్లయితే, తాత్కాలికంగా వారు విజయమందిఉండవచ్చునుగాని, వారు తొక్కిన మార్గ మంతంతమాత్రంలోనే తుదముట్టే మార్గం.

* * *

తక్కిన అన్ని సాంప్రదాయాలలాగే భాషా సాంప్రదాయాలుకూడా కాల్పనికాలే ! సర్వజనాంగీకారకారణంగా సంభవించినవే. ఆచారనిషేధాలు, అథవా నాగరికసంఘంలోమాత్రమైనా అతివేగంతో వచ్చిపోతూ ఉంటవి. ఈ విషయం సమన్వయమైనర్చుకొనేందుకు దేశదేశాలలో యుగయుగాలలో స్త్రీ సౌజన్యతాభావ మందుకొన్న రూపాలను పరికించితే చాలును. ఒకచోట మేలిముసుగు, ఒకపరి అనాచ్ఛాదిత వక్షముః ఒకనాడు చీలమండల దిగిన చీరకట్టు, ఇంకొకసారి పైకిపాకిన పరికిణీ—అన్నీ కూడా స్త్రీల నమ్రతకు చిహ్నాలయాయి. యుద్ధపూర్వకాలంలో పాశ్చాత్య స్త్రీ బిడియానికి నల్ల మేజోళ్లు తొడుగుకొని బీచీకెళ్లేది. నేడు బీచికి ఏయువతిఅన్నా అల్లాంటి మేజోళ్లు తొడిగి వెడితే, పురుషుల నాకర్షించుకొని వెంట త్రిప్పుకొనేందుకు చేసే విలాసంగా ఎన్నబడుతుంది. కాని సౌజన్య విషయంలో మన కున్న సాంప్రదాయాల కాల్పనిక స్వభావము గుర్తెరిగేందుకు ఇల్లా దేశకాలాలన్నీ పరచ నక్కరలేదు. తన గృహాంతరంలో దుస్తులుమార్చుకొంటూ ఏకవస్త్రగా నున్నప్పు డెకస్మాత్తుగా పరాయి మొగవాడు వస్తే, లోపలికి పరుగెత్తుతూ కేకలుపెట్టే సామాన్యసవినయువతి, అత్యల్పాచ్ఛాదన మాత్రంతో వపులావణ్యాన్నంతనూ వయ్యారంగా సర్వజనుల సౌందర్యపిపాసాదృష్టికి, ఛాయాగ్రహణయంత్ర స్థిరీకరణాలకు అంకితం చేసుకొంటూ బీచిఒడ్డున సేదతేరేందుకు ఏమాత్రమూ సంకోచించదు.

ఇతర గోళాలవారి కివి పరస్పర విరుద్ధంగా కనిపించవచ్చునుగాని భూమిమీదిమనుష్యులమేయైన మన కిందులో ఏమీ వైరుధ్యం కనిపించదు.

భాషావిషయంలోకూడా ఈ సూత్రమే అన్వయిస్తుంది. బీచీకద్ద నగ్నతకు ఇంకా ఇంటిదగ్గర నలుగురిమధ్యా తావులేకున్నట్లే, గ్రంథపుటలలో ఉన్న స్వేచ్ఛాపదాలకు పత్రికలపుటలలో తావు లేదు. ఆ కారణంచేతనే నే నిప్పుడు చర్చిస్తున్న సాహిత్య విషయం సోదాహరణంగా చెప్పలేకుండాఉన్నాను. సాంప్రదాయాలకు ఘాతం తగులుతుంది. చట్టశాస్త్రం కూడా పైనబడుతుంది. ఈ పత్రికాపఠయితలే మళ్లీ నవలాపఠయితలుకూడానూ ! సర్వం హాస్యాస్పదంగానే ఉంది ! నవలలూ, పత్రికలూ ఒకదానిప్రక్కనే ఒకటి ఉంటూంటే, వివిధసాంస్కృతులకు చెందినవా అని

అనుకోవలసివస్తుంది! అంతా హాస్యాస్పదంగానే ఉంది, కాని జనమూ హాస్యనిలయులే.

ఎప్పుడో ఒకనాటికి,— ఆరో జంత దగ్గిరగా కనబడటం లేదుగాని—నవలల కిచ్చినంత స్వేచ్ఛ పత్రికలకుకూడా ఇయ్యబడవచ్చును. కాని ఈ విషయం జరగటం, జరగకపోవటంకూడా అంత ముఖ్యం కాదు. సంపూర్ణమైన స్వేచ్ఛ కలిగినంతమాత్రాన పత్రికారచన ఇంతకన్నా బాగూపడదు; పాడూఅవదు. మానభంగ విషయాన్ని విపులంగా వర్ణించిన ప్రథమవిలేఖరి "స్కూప్" తెచ్చుకోవచ్చునేమో, కాని కొన్నాళ్లు పోయాక అదేవర్ణన పత్రికాసాంప్రదాయభాగమై, నిస్సారమైన అనుకరణమాత్రంగానే మిగిలిపోతుంది.

మనచుట్టూ ఈనవలలనిండా ఈ చాతుర్వర్ణశ్రీ నిషిద్ధపదాలూ, కామినీదేహాంగ వర్ణనలూ, ఈమన్మథ కృత్యవిశేషవిపులీకరణాలూ ఇంతింతగా ఉండటం చూసి, "నిషేధచట్టాలు" (Censor) తమ విధ్యుక్త ధర్మమొనర్చటం లేదని కొందరంటారు. కాని వారికీ విషయమేమాత్రమూ అవగతం కాలేదనే చెప్పాలి. నిషిద్ధచట్టాలు ఈసాహిత్య సీమలో పని చేయగలగటం దాదాపు అసంభవం. అల్లాంటపుడు అవి ఉపయోగించలేదనే నిందకూడా అసమంజసమే. యుద్ధ వార్తలను, రాజకీయ మత విషయైకరచనలనూ నిషిద్ధ చట్టాలకు బాహాటంగానూ ప్రచ్ఛన్నంగానూ గురి చేయవచ్చును. గాని, కామోద్దీపన కరాలను, అంటే "బూతుభావం" అని సామాన్యంగా పిలవబడేదానిని ప్రచ్ఛన్నంగాకూడా నిషిద్ధము చేయలేము.

"బూతువిషయంలో" ఎవరి రుచిని బట్టి వారు పదాలను తయారుచేసుకొంటారు. ఈపదాలకు కావలసిన ముడిపదార్థం అనంతంగా లభిస్తుంది. ఒక పదజాలాన్ని తీసేస్తే, అంత బలీయంగానూ వాట్ల స్థానాన్ని ఇంకో పదసమూహం మాక్రమిస్తుంది. ఈ 'బూతుభావం' మానవుని లోపలనుంచే పుట్టుకొనివచ్చేది. ఎంత స్వల్పవిషయమైనాకూడా ఆ భావన లుద్దీపింపజేయవచ్చును. ఒకతరం యువకులకు ఆడవాళ్లదుస్తుల అడ్వర్టయిజ్మెంట్లవల్లా, వైద్యగ్రంథచిత్రాలవల్లా కలిగిన ఉద్దీపనమే ఇంకోతరంయువకులకు చిత్రకళాపత్రికలలో స్త్రీ నగ్నసౌందర్యచిత్రాలవల్ల కలుగుతుంది. స్త్రీల చీలమండలు కనబడితే మన తాతలు ఎంతగా అయ్యేవారో, మేజోళ్లు పైతొడలు కనబడితే మన తరంవారూ అంతే ఔతారు.

చిన్నపిల్లలకు బూతులు పరిచయంకాకుండా భద్రతలు తీసుకొన్నా, వాళ్లు తమ ప్రత్యేకపు 'బూతులను' తయారుచేసుకొంటారు. అందుచేత బూతును నిర్మూలంచేద్దామనుకొనేవారికి ఎంతెంతటి ప్రకృతిబలాలాధారంగా బూతు తమ నడ్డుకొంటుందో తెలియదు.

అందుచేత సాహిత్యంలో బూతులు లేకుండా నిషేధాలొనర్చాలా, అక్కరలేదా అనేది ప్రశ్న గాదు. సారస్వతం స్వేచ్ఛారహితంగా మడిగట్టుకొన్ననాడూ, కావలసినంతమాత్రంగానూ అవి పెరిగాయి. సంపూర్ణంగా స్వేచ్ఛనిచ్చినా వీలయినంతగానూ పెరుగుతాయి. అందుచేత మన కున్న లాభదాయకమైన తేలికప్రశ్న ఒక్కటే. ఈ"స్వేచ్ఛ"తో మన రచయితలు ఏం చేస్తున్నారు? దీనికి జవాబూ తేలికే. తమ తమ ప్రజ్ఞల కొద్దీ, బాగుగానో ఓసుగానో, తమ తాతముత్తాతల లాగే రచనలు చేస్తూన్నారు. ప్రపంచంలో ఉన్న స్వేచ్ఛ అంతాకూడా కలిపినా, రచయితకీర్తిచ్ఛాయ లొక్క మూరెడుకూడా పెరగలేవు. ఏదిపడితే అది చెప్పటానికి ఒక మనిషికి స్వాతంత్ర్యమిచ్చినంతమాత్రాన చెప్పదగ్గ విషయమేదో ఆ మనిషిదగ్గిరా ఉందని అర్థంకాదు. నిన్నమొన్నటి మహాకవులు ఈ స్వేచ్ఛ లేకుండా, ఎంతెంతగా రచించారో, అంతంతమాత్రంగా ఈ నాటి మహాకవులు ఈ స్వేచ్ఛ అంతటితోటీ రచించగలిగితే చాలు. అంతకన్నా ఎక్కువ ఆశించటం సారస్వతస్వభావాన్నే అపార్థంచేసుకోవటమన్నమాట. ('అమెరికన్ మెర్క్యురీ')

# శోకాశోకవనము

= శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి =

౧

అంతో ఇంతో ఆలాపించే
రోజులు పోయిన లోకములోనే
జీవితసాగరచేలాంచలమును
చేరదీయుమని చెప్పగనేలా ?

౨

లోకాలోకనరుచులను వీడుచు
దేవయానముల తేలి వసింపగ,
దివిజవిభావము తీరగ నాపై
చింతాజలవీచీగతి చనెగా !

ఆవృతతేజము నాదా ? నీదా ?
ఆ లోకములో, ఆ సమితులలో,
ఆవరించినది ఆనందాశ్రువు !
ఆనతీయగలవా ? మిహిరహారా !

పొగడలుమాత్రమె పూచిన వీనికి ;
పూవులదాపున మల్లియ లన్నీ
స్మేరవదనముల మరచిన వేలా ?
చింతాపరివృత మీ వనసంపద !

౪

కాని అశోకము శోకావిలమై
కళలీనే వనరాగిణిదిశగా,
దారుణశోకము కనుకొలకులలో
తరలగ నణచుచు చూచిన దేలా ?

ఏల చలించవొ ? ఏల ఫలించవొ ?
ఎవరేమనిరో ? ఏమో ? ఏమో !
ఆలాపనతో నేభావముతో
ఆలోకించినదో ?

# కళాపూర్ణోదయ కథకు లింగపురాణము మూలము కాదు



శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి

మూలమని నామిత్రులు శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారు వెనుక నెపుడో భారతిలో నొకవ్యాసము ప్రకటించియున్నారు. ఆ యభిప్రాయము సరిగా దని గుడివాడ పరిషద్వార్షికసభకు వచ్చినపు డాయనతో చెప్పియున్నాను. కాని, పాఠకుల కాభ్రాంతి తొలఁగించుట సముచితమని కొందఱు మిత్రులు చెప్పుటచే నందలి యీ ముఖ్యవిషయమును గూర్చి మాత్ర మిందు సంగ్రహముగా వ్రాయుచున్నాను.

లింగపురాణములో తుంబురునారదగానమాత్సర్యకథ యున్నమాట నిజము. అది కళాపూర్ణోదయములో నున్న కథవలె సహృదయరంజకము గాకపోయినా, ఒక పురాణములో కనవచ్చుచున్నది గావున ప్రాచీనమనియు, దానిని గ్రహించి సరసముగావించి సూరనార్యుఁడు తన కృతిలో స్వీకరించి యుండుననియు చూచినంతనే యెవరికైనా భ్రాంతి కలుగకపోదు. ఆ విషయమున చెప్పవలసిన దేమీ లేదు. దాని ప్రాచీనత యెట్టిదో తరువాత చూతము. కాని ఆ చిన్న గానమాత్సర్యకథ కళాపూర్ణోదయమూలకథకే మూల మనుటమాత్ర ముచితము కాదు. ప్రాసంగికమైన యా చిన్నకథ (నేను పరిష్కరించి సవ్యాఖ్యానముగా ప్రకటించిన ప్రతినిబట్టి) రెండవయాశ్వాసము ౬౬ వ పద్యము మొదలుగా ౧౦౪ వ పద్యమువఱకు ౩౯ పద్యములలో నిమిడియున్నది. "ప్రధానకథ కావశ్యకము గాని యీవర్ణన మెందు"కని శంకించుకొని నా వ్యాఖ్యానములో సమాధానము తెలిపి యున్నాను. అది శాస్త్రిగారి వ్యాసమునకు పూర్వము జరిగినదే. ఈకథ నారదుఁడు నాలుగేళ్లు శ్రమపడి గానవిద్య నేర్చుకొన్నట్లతనిని ద్వారకకు చేర్చుటయును, ఆసమయమున కలభాషిణీమణికంధరులు శ్రమకోర్చుచుండఁగా సంగీతములో సంపూర్ణజ్ఞాన మార్జించిరనుటకు నుపయోగపడుచున్నది. ఇందు కలభాషిణి గానవిద్యావిశారద యనునంశము మూలకథతో సంబంధించియున్నను, (ఆ గానమునకై యీకథ కల్పించ నక్కఱలేదు. అది తొలుతనే యీ విద్యలో ప్రవీణురాలని యెక్కడ చెప్పినా చెప్పవచ్చును) ఈ ౩౯ పద్యములును పుస్తకములోనుండి తీసివేసి పూర్వోత్తరసందర్భమున కొక్కవాక్యము వ్రాసి విడిచినా కళాపూర్ణోదయమూలకథకు లేశమైనా లోపము రాదు; ఏమైనా హాని కలుగదు. అట్టియెడ లింగపురాణములోని యీ కథ కళాపూర్ణోదయములోని గానమాత్సర్యకథకు మూలమంటే అనవచ్చునుగాని, దీనిని పురస్కరించుకొని లింగపురాణము కళాపూర్ణోదయకథకు మూల మనుట యుక్తమా? పాఠకుల కీమాట విదితమగుటయే ముఖ్యము.

నేనీక్రింద తెలుపఁబోవు విషయము సప్రమాణమని, సిద్ధాంతమని చెప్పఁజాలను గాని నాకిట్లు తోఁచినది—లింగపురాణములోనే కాదు, సర్వపురాణములలోను ప్రక్షిప్తభాగము లెన్నో యున్నవని గ్రంథపరిశోధకు లెందఱో భావించియున్నారు. కొన్నిటిని నిరూపించియునున్నారు. ఈ గానమాత్సర్యకథయు నట్టిదే యనియు, సూరనార్యుఁడు చక్కని సందర్భము తెచ్చిపెట్టి సరసముగా కల్పించి వర్ణించిన యీ పద్యములు చదివిన యానాటి విద్వాంసుఁడొకఁ డీకథాచమత్కృతి కానందించి దీనిని సంస్కృతీ

కరించి లింగపురాణములో సందర్భము కలిగించి యుం డుటకే యుండుననియు నే ననుకొనుచున్నాను. ఇందు కౌనాఁటి యాచార మొకటి తోడ్పడుచున్నది.

తిరుమల దేవరాయలు కృతిపతిగా వెలసిన రామ రాజభూషణుని వసుచరిత్ర చదివి సంతోషించిన కామా క్షీదాసను కాళహస్తికవి వసుచరిత్రచంపు వొకటి సంస్కృతమున నిర్మించియున్నాఁడు. ఈకవి తిరుమల రాయల తమ్ముఁడై చంద్రగిరి నేలిన వెంకటపతిరాయల యాస్థానములోని యప్పయదీక్షితుల శిష్యుఁడు. క్రీ. ౧౫౭౦ ప్రాంతమునందు తెలుఁగువసుచరిత్ర పుట్టినది. ౧౬౦౦ ప్రాంతమునందు సంస్కృతవసుచరిత్ర పుట్టి నది. కావున తెలుఁగుకృతినిబట్టియే సంస్కృతకృతి పుట్టిన దని వేఱుగా చెప్ప నక్కఱలేదు. ఈ క్రింది సంస్కృతారంభము కూడా యందుకు తగినట్లే యున్నది.

"వసుప్రభు ర్వ్యాసవధాతరీత్యా
కోలాహలాద్రీశకుమారికాయాః,
గీతోజ్జ్వలాయా గిరిజాభిధాయాః
కల్యాణశా లీతి కథా స్తు పుణ్యా."

నాఁటి యీ యాచారమును పురస్కరించుకొని, ౧౬౩౦ ప్రాంతమున జన్మించిన యీ కళాపూర్ణోదయ ములో నప్పటి రాజాస్థానములలోని విద్వత్కవుల మాత్సర్యములకు జ్ఞాపక మగునట్లుగా కల్పింపఁబడిన యీ కథలోని చమత్కృతి కానందించిన శాశ్వతిక విశ్వాంసుఁ డొకఁడు దీనిని సంస్కృతీకరించి లింగ పురాణములో దీనికి సందర్భము కల్పించి యతికియుండు ననుకొనుట సాహసము కాదేమో! అయినా, "ఈకథ లింగపురాణములోనే ముందుగా పుట్టినది. దానినే సూర నార్యుఁడు తెలిఁగించె"నని యంగీకరింతము. అయితే మాత్రము కళాపూర్ణోదయమున కీ మాత్సర్యపుమాటలే మూలమా? అట్లు కాదనుట మమ్మాటికి నిజమని పాఠ కులు భావించినఁ జాలును. సూరనార్యుఁడు లేని గొప్ప తనము చెప్పుకొన్నవాఁడు కాఁడు. ఇతరుల మాటలు గైకొను గ్రంథచోరుఁడు కాఁడు. లోకవంచకుఁడు కాఁడు.

"అత్యపూర్వకథాసంవిధానవైచిత్రీ మహనీ యము" తన కళాపూర్ణోదయ మనుచు, ప్రతిజ్ఞ చేసి యద్భుత మపూర్వము నైన ప్రధానకథతోను, ప్రాసం గికకథలతోను, ఉపాఖ్యానములతోను ఎనిమిదాశ్వాస ముల మహామహాప్రబంధము కల్పించిన యతఁడు ౩౯ పద్యముల యీ చిన్నకథను లింగపురాణమునుండి దొంగిలించియుండు నని మనము స్మరించుటకూడా యర్హము కాదు. కళాపూర్ణోదయములోని యెల్లకథల తోడి మూలకథ యా మహాకవి సూరనార్యుని నవనవో న్మేష ప్రతిభలో పుట్టినదే కాని, అం దొకయక్షర మైనా యన్యుల దని యారోపించుట యంగీకార్యము కాదు. సత్యము వెల్లడించుట కింతమాత్రము చాలును.






[నాటకం]

## శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి

[గతసంచిక తరువాయి]

### రెండో అంకం

[కోర్టు. జడ్జి. జడ్జి వెనకాల అయిదుగురు జూరీలు. కోర్టుగుమాస్తా. ఫిర్యాదుతరఫు ప్లీడరుగారు, ముద్దాయి తరఫుప్లీడరుగారు ఎదురెదురుగా కూచునివుంటారు. ఫిర్యాదు తరఫుప్లీడరు తన వాదం అప్పుడే ముగించేసి కూచోబోతున్నాడు.]

ఫి. ప్లీ—కోర్టువారు చిత్తగించాలి. ఇదీ ప్రాసిక్యూషన్ కేసు. (అని కూచుంటాడు.)

ము. ప్లీ—(లేచి, జడ్జీగారికి తలొంచి దండం పెట్టి) కోర్టువారూ, జూరీ మెంబర్లూ చిత్తగించాలి. నేను ముద్దాయి చెక్కు దిద్దనే లేదని వాదించను. కాని అతను ఆ పనిచేసినప్పటి మానసికస్థితిని తెలియజేయడానికి మీ యెదుట సాక్ష్యం పెట్టి, అతను నిజంగా తెలిసే ఈ పని చేశాడని నిర్ధారణకి రావడానికి మీకు అవకాశం లేదనీ, దుఃఖాతిశయంచేత, మతి చెడినప్పుడు, అంటే తాత్కాలికంగా మనశ్చాంచల్యం కలిగినప్పుడే ఈపని చేశాడనీ నిరూపిస్తాను. ముద్దాయి తన చేష్టలకి తాను కర్తకాడని మీకే నిస్సందేహంగా బోధపడుతుంది. రామయ్యగారూ...

('రామయ్యగారూ' అని కోర్టుబంట్రోతు కేక. రామయ్య బోనులోకి ఎక్కి 'నిజమే చెబుతా'నని ప్రమాణంచేస్తాడు)

ము. ప్లీ.—పేరు ?

రామ—రామయ్య.

ము. ప్లీ.—మీరు రాఘవయ్యగారి ఆఫీసులో హెడ్డుగుమాస్తా.

రామ—అవును.

ము. ప్లీ.—ముద్దాయి ఎంతకాలంనుంచీ మీ ఆఫీసులోవున్నాడు ?

రామ—రెండుసంవత్సరాలు. కాదుకాదు. (అని వేళ్లు లెక్కపెట్టుకుంటూ) రెండుసంవత్సరాలకీ పదిహేడురోజులు తక్కువ !

ము. ప్లీ—అన్నిరోజులూ మీరు అతన్ని కనిపెట్టి చూస్తూవుండేవారు ?

రామ—ఆ. ఆదివారాలూ, శెలవరోజుల్లోనూ తప్ప.

ము. ప్లీ—బాగాచెప్పారు. అతని ప్రవర్తనని గురించి మీ అభిప్రాయమేమిటో చెప్పండి, చూద్దాం.

రామ—మంచివాడు. పెద్దమనిషి... (పరమ రహస్యం చెబుతున్నట్టు, కొంచెం ముందుకివొంగి) అల్లరిచిల్లరిపోకళ్లు ఏమీకనిపించలేదు నాకెప్పుడూను. తప్పుపట్టడానికి ఎన్నడూ అవకాశం దొరకలేదు. ఇలాటిపని చేశాడంటే నాకూ చాలా ఆశ్చర్యంగానే వుంది !

ము. ప్లీ—అతను విశ్వాసపాత్రుడు కాదని మీ కెప్పుడయినా తట్టిందా?

రామ—ఊహుఁ. మా ఆఫీసులో అనుమానాస్పదులా? కుదరదే?

ము. ప్లీ—(జూరీవైపు తిరిగి) మీరు ఈ మాటలని బాగా చిత్తగించి జ్ఞాపకం ఉంచుకోవాలి.

రామ—విశ్వాసం లేనిదే ఎక్కడా పనిచెయ్యలేమని అందరికీ తెలిసినదే.

ము. ప్లీ—అతను మంచివాడేనంటారా, అనరా?

రామ—ఎందుకు అనరూ? మేం అందరమూ చాలా కులాసాగా వుండేవాళ్లం, ఇది జరిగినదాకా. నాకు మాచెడ్డ దెబ్బతగిలిందంటే నమ్మండి!

ము. ప్లీ—ఈ నేరం జరిగిందే, ఏడో తారీకు, ఆరోజు ఉదయం, ముద్దాయి ప్రవర్తనలో ఏమైనా విశేషం కనిపించిందా మీకు!

రామ—అప్పుడు...అతని మనస్సు మనస్సులో లేదనుకున్నట్టు నాకు జ్ఞాపకం!

జడ్జీ—ఆనా డతనికి పిచ్చి ఎక్కిందనా మీ సూచన!

రామ—కాదండి. అతని మనసు మనసులో లేదు.

జడ్జీ—అంటే? కొంచెం తెలిసేటట్టు చెప్పాలి.

రామ—నా ఉద్దేశం (జడ్జీ కేసిచూస్తూ)...చాలా పరధ్యానంగా కనిపించాడు. నే అన్నముక్కకి అర్థం జూరీకి తెలుసుంది లెండి!

ము. ప్లీ—మీ కెందు కా అభిప్రాయం కలిగిందో చెబుతారా?

రామ—ఓ. నా టిఫిను హోటలునించి కోర్టుకే తెప్పించుకుంటా! హోటలు కెళ్లడమంటే గొడవ. పూరీ, బంగాళ దుంపకూర నా మామూలు. ఆనాడు రాజారావు చెక్కు నాకిస్తూవుంటే, టిఫినొచ్చింది. మరి నాకు టిఫిను వేడిగాఉండగా నేతినెయ్యవేసం ఇష్టం! అంచేత చెక్కు సుబ్బారావుచేతికిచ్చి, సొమ్ము తీసుకు రమ్మన్నా. మోహనరావు పూరికే అటూ యిటూ పచారుచేస్తూఉంటే చూసి "ఏమిటోయి, కాలుగాలిన పిల్లి లా ఇలా తిరుగుతున్నావు?" అన్నాను.

ము. ప్లీ—చెప్పిన జవాబు జ్ఞాపకముందీ?

రామ—"పిల్లిజన్మ ఎత్తినా బాగుండి పోనండీ రామయ్యగారూ" అన్నాడు. చాలా గమ్మత్తుగా కనిపించింది.

ము. ప్లీ—మరే విషయమైనా గమ్మత్తుగా కనిపించిందా?

రామ—ఆ.

ము. ప్లీ—అదేమిటి?

రామ—చొక్కాకి గుండీలు తిన్నగా పెట్టుకోలేదు. మనుష్యులు నీటుగా వుండడం నాకిష్టం. "గుండీలు పెట్టుకోలేవోయి" అన్నాను.

ము. ప్లీ—జవాబేం చెప్పాడూ మీకు?

రామ—జవాబేమీ చెప్పందే? గుడ్లప్పగించేసి, నాకేసలా తేరిపారజూశాడు. పెద్దమనిషి తరహాగా లేదు.

జడ్జీ—తేరిపారజూశాడూ? అందరూ చేసే పనేగా అది?

రామ—అవునను కోండి. కాని అతని చూపులో వుంది. విప్పిచెప్పలేను. గమ్మత్తుగా వుంది.

ము. ప్లీ—ఇదివర కెప్పుడైనా అతనిలో అలాటి చూపు కనిపెట్టారూ?

రామ—ఊహు. అలాటిదేదైనా కనిపిస్తే మా యజమానితో మాట్లాడుదును. మా ప్లీడరుగారి దగ్గిర అవకతవకలు పనికిరావు!

జడ్జీ—మరి ఆనాడు మాట్లాడావా ప్లీడరు గారితో?

రామ—లేదండి. పూర్తిగా దాఖలావుంటేగాని వాళ్ల నిబాధపెట్టడమెందుకనుకున్నాను. ఇంకోమాటు అలా కనిపిస్తే, తప్పకుండా మాట్లాడుదును.

ము. ప్లీ—ఆ చూపు మీ హృదయంలో గాఢంగా నాటుకుపోయింది, ఏం?

రామ—అవును. మా రెండో గుమాస్తా సుబ్బారావుంటే, అతనూ ఆ మాటే చెప్పును.

ము. ప్లీ—అవునవును. అత నిప్పుడు ఇక్కడ లేకపోడం అందరికీ చిక్కుగానే వుంది. ఫోర్జరీపట్టుబడిన రోజు ఉదయం సంగతులు చెప్పగలరా?

రామ—(చెవిదగ్గిర చెయ్యిపెట్టుకుని) నాకు... కొంచెం చెపుదు!

ము. ప్లీ—ఆ రోజు పొద్దున్న—ఫోర్జరీ పట్టుబడకపూర్వం, మీ కేదైనా కొత్తగా కనిపించిందా?

రామ—ఆ. ఒక స్త్రీ.

జడ్జీ—నేరానికీ, దీనికీ ఏమిటి సంబంధం?

ము. ప్లీ—నేను ముద్దాయి ఏ మానసిక స్థితిలో నేరం చేశాడో నిరూపించడానికి ప్రయత్నం చేస్తున్నాను.

జడ్జీ—ఆ సంగతి మాకూ అర్థమయింది. కాని నేరం జరిగిన చాలా రోజుల తరవాత విషయం ఇది!

ము. ప్లీ—కాని నా వాదాన్ని బలపరుస్తుంది.

జడ్జీ—సరే. చూద్దాం.

ము. ప్లీ—చూడండి, రామయ్యగారూ! ఒక "స్త్రీ" అన్నారు. ఆవిడ ఆఫీసులో కొచ్చిందంటారా ఏమిటి?

రామ—ఆ!

ము. ప్లీ—ఎందుకూ?

రామ—మోహనరావుకోసం. అప్పుడు అతను లేడక్కడ.

ము. ప్లీ—మీరు చూశారూ, ఆవిడని?

రామ—ఓ.

ము. ప్లీ—ఒంటరిగానే వొచ్చిందా?

రామ—నన్ను గొప్ప చిక్కులో పెట్టేశారు. కోర్టువారితో నాకు ప్రత్యక్షంగా తెలిసిన విషయాలే మనవిచేసుకోవాలిగాని, విన్నకబుర్లు చెప్పకూడదుగా! మానౌకరు నాతో చెప్పినసంగతులు ఇక్కడ చెప్పకూడదు.

ము. ప్లీ—అవునవును. సరేకాని, ఇంతకీ మిమ్మల్ని అడగదలచింది ఏమిటంటే, మోహనరావుని చూడ్డానికి వొచ్చిందన్నారే! ఆనాడు మీకు బాగా జ్ఞాపకముండిపోయినమాట ఏమైనా అందా?

రామ—ఇంకా కొంచెం విప్పి...

ము. ప్లీ—అనలేదా?

రామ—అంది. కాని నే చెప్పవలసిన సమాధానం మీరే సూచించడం నాకేం నచ్చలేదు.

ము. ప్లీ—(కొంచెం విసుగుతో) జూరీతో అదేమిటో చెబుదురూ?

రామ—మోహనరావుని చూడనిస్తే, తనప్రాణం రక్షిస్తారని అంది.

ము. ప్లీ—ఆమనిషి అంతమాట అందంటారు!

రామ—(తలూపుతూ) ఊ. ఇంతమాత్రానికే ప్రాణం రక్షించడమేమిటని నేనప్పుడే ఆశ్చర్యపడ్డాను!

ము. ప్లీ—(విసుక్కుంటూ) సరేనండీ. మోహనరావు, ఈ విడవుండగా లోపలకొచ్చాడా? (రామయ్య తల ఊపుతాడు) చూసింది. వెళ్లిపోయింది.

రామ—వెళ్లడం నేచూడలేదు, కనక ఆ విషయం నేను చెప్పలేను!

ము. ప్లీ—అయితే, ఇంకా అక్కడే వుందా మరి!

రామ—(చిరునవ్వుతో) అబ్బే, ఎందు కుందీ! లేదు.

(ము. ప్లీ. కూచుంటాడు. వాది తరఫు ప్లీడరు లేచి, జడ్జీగారికి వొంగి దండం పెడతాడు)

వా. ప్లీ—చూడండి రామయ్యగారూ! నేరం చేసిననాటి ఉదయం ముద్దాయిమనిసు మనసులో లేదన్నారు. అంటే ఏమిటని మీ ఉద్దేశం

రామ—బాగా అర్థంచేసుకోవాలి మీరు. యజమాని కనిపించకపోతే పెంపుడు కుక్కపిల్ల ఎలావుంటుందో ఎప్పుడైనా కనిపెట్టారా మీరు? ఆరోజున అతనుకూడా కళ్లు అలా దొర్లించాడు.

వా. ప్లీ—సమయానికి జ్ఞాపకంచేశారు. కళ్లసంగతే అడుగుదామనుకుంటున్నా. గమ్మత్తుగా ఉన్నాయన్నారు! అంటే మేము ఏమర్థం చేసుకోవాలి? కొత్తగా వున్నాయనా?

రామ—అవును. గమ్మత్తు...

వా. ప్లీ—బాగానే వుందండీ! మీకు గమ్మత్తుగా తోచినది నాకుగాని, జూరీకిగాని గమ్మత్తుగా

కనిపించకపోవొచ్చును. మీకు ఆకళ్లలో కనిపించినది ఏమిటి ? భయమా ? కోపమా ? విచారమా ?

రామ—నన్ను మా కష్టంలో పెడుతున్నా

నేను ఓ మాట చెప్పాను. అదికాదు, "ఇంకో మాట" చెప్పమంటారు.

వా. ప్లీ—(బల్లగుద్దుతూ) గమ్మత్తు అనా మీ ఉద్దేశం ?

రామ—అబ్బే. వెర్రెందుకవుతుంది! గమ్మత్తు...

వా. ప్లీ—సరే. చొక్కాకి గుండీలు పెట్టుకోలే దన్నారు. ఆ రోజున ఉక్కగా వుందా ?

రామ—ఉక్కగానే వుందనుకుంటా !

వా. ప్లీ—మీరు చెప్పిన తరవాత గుండీలు పెట్టు కున్నాడా ?

రామ—పెట్టుకున్నాడనుకుంటా !

వా. ప్లీ—ఇదే కాబోలు మతి స్థిరం లేకపోడం ! (అని భుజాలెగరేసి ఠీవిగా కూచుంటాడు)

(రామయ్య జవాబు చెప్పడానికి ప్రయత్నిస్తాడు కాని, తెల్లబోతాడు. మాటరాదు)

ము. ప్లీ—(లేచి) అదివరకెప్పుడైనా అత నలా చింపిరిగా వుండడం మీరు చూశారా ?

రామ—ఎప్పుడూ లేదు. చాలా నిదానమైన వాడు. పరిశుభ్రంగా వుండేవాడు.

ము. ప్లీ—సరే, మీరు వెళ్లవొచ్చును.

(రామయ్య బోనుదిగిపోతాడు. తరవాత సాక్షి, సుందరమ్మ బోను ఎక్కుతుంది. ప్రమాణం అయిన తరవాత—)

ము. ప్లీ—పేరు ?

సుంద—సుందరమ్మ.

ము. ప్లీ—వయస్సు.

సుంద—ఇరవై ఆరు.

ము. ప్లీ—నీకు పెళ్లయింది. కాపరం చేస్తు న్నావు. ఏం...కొంచెం గట్టిగా చెప్పాలి.

సుంద—రెండు మూడు నెలలనించీ లేదు.

ము. ప్లీ—ఏమన్నా సంతానమా !

ఇద్దరు.

ము. ప్లీ—నీ దగ్గిరే వున్నారా

సుంద—ఆ.

ము. ప్లీ—ముద్దాయిని ఎరుగుదువా ?

సుంద—ఆ.

ము. ప్లీ—నీకూ, అతనికీ ఏమిటిసంబంధం ?

సుంద—స్నేహితులం.

జడ్జి—స్నేహితులా ? (అని గద్దిస్తాడు)

సుంద—నేనం టే అతనికి చాలాయిష్టం.

జడ్జి—అవునూ...కాని—

సుంద— (తలఊపుతూ) లేదండి ... ఇంకా అలాటిదేమీ లేదు.

జడ్జి—ఇంకా లేదూ ?...(ఒక్కమాటు సుంద రమ్మకేసి తీక్షణంగా చూసి) సరే...

ము. ప్లీ—భర్తవృత్తి ?

సుంద—వ్యాపారం.

ము. ప్లీ— సుఖంగా కాపరం చేసేవారా ?

సుంద—దాన్ని గురించి మాట్లాడకుండావుం టే నే మంచిది.

ము. ప్లీ—నిన్నేం బాధపెట్టేవాడా ?

సుంద—(తల ఊపుతుంది)

ము. ప్లీ—ఏవిధంగా...

సుంద—ఎన్ని విధాల బాధపెట్టాలో, అన్ని విధాలానూ...

జడ్జి—ఈ ప్రశ్నలు ఇంక ఆపెయ్యాలను కుంటా !

సుంద—(మోహనరావు నుద్దేశించి) నన్ను ఈ నరకంలోంచి తప్పిస్తానన్నా రాయన. రంగూను వెళ్లి పోడానికి అంతా సిద్ధం చేసుకున్నాం.

ము. ప్లీ—అవునవును, కాని ప్రయాణం ఎందు కాగిపోయింది ?

సుంద—అతన్ని పట్టుకున్నప్పుడు నేను ఆఫీసు దగ్గిరే వున్నా...నా గుండె పగిలిపోయింది.

ము. ప్లీ—నీ కతను ఏ నేరం చేశాడో వెంటనే తెలుసునన్న మాట !

సుంద—తరవాత లోపలికి వెళ్లి రామయ్యగారిని కనుక్కున్నా. సంగతంతా వారు చెప్పారు.

ము. ప్లీ—జూలై ఏడోతారీకు, అంటే, శుక్రవారంనాటి పొద్దుటి సంగతులేమైనా, జ్ఞాపకమున్నాయా ?

సుంద—ఆ...

ము. ప్లీ—ఎందుకు జ్ఞాపకముండవలసొచ్చింది ?

సుంద—ఆరోజున మాఆయన, నా గొంతుక పిసికి, నాప్రాణంతియ్యడానికి ప్రయత్నంచేశాడు.

జడ్జీ—(నమ్మనట్టు) గొంతుక పిసికి చంపబోయాడూ ?

సుంద—అవును.

ము. ప్లీ—వొట్టి చేతులతోనేనా ?

సుంద—అవును. బయటపడేసరికి సహంప్రాణం పోయింది. తిన్నగా నా స్నేహితుడి యింటికే వెళ్లాను. అప్పుడు ఎనిమిదిగంటలయింది.

—పొద్దున్నా ఇది జరుగుత ! తాగి చేసిన పని కాదన్నమాట యిది !

సుంద—తాగవలసిన అవసరమే లేదండి.

ము. ప్లీ—నువ్వప్పుడు ఏ స్థితిలో వున్నావో కొంచెం చెప్పు.

సుంద—స్థితి చాలా అసహ్యంగా వుంది. చీర సహం చిరిగిపోయింది. ఊపిరి తిన్నగా ఆడ్డంలేదు.

ము. ప్లీ—నీ స్నేహితుడితో జరిగిన సంగతంతా చెప్పావా ?

సుంద—ఆ. ఎందుకు చెప్పానా అనిపిస్తోం దిప్పుడు.

డి. ప్లీ—ఏం ? అతన్ని కలతపెట్టేసిందేం, ఈ సంగతి.

సుంద—ఉపద్రవంగా.

ము. ప్లీ—నీతో ఎప్పుడైనా ఆ చెక్కుని గురించి మాట్లాడాడా ?

సుంద—ఊహు.

ము. ప్లీ—నీ కెప్పుడైనా డబ్బిచ్చాడా ?

సుంద—ఆ.

ము. ప్లీ—ఎప్పుడు ?

సుంద—శనివారంనాడు.

ము. ప్లీ—ఎనిమిదో తారీకునా ?

సుంద—నాకూ పిల్లలకీ కావలసిన సామానులు కొని, ప్రయాణానికి తయారుకావడానికి.

ము. ప్లీ—నీ కప్పుడు ఆశ్చర్యమెయ్యలేదూ ?

సుంద—ఎందుకు ?

ము. ప్లీ—నీ కివ్వడాని కతనిదగ్గిర డబ్బుండడం !

సుంద—కొంచెం. నాభర్త చంపడానికి ప్రయత్నించిన నాటి పొద్దున్న నన్ను రక్షించడానికి సొమ్ము లేకపోయిందని ఏడిచాడు. తరవాత ఏటో బాపతు సొమ్ము ముట్టిందని చెప్పాడు.

ము. ప్లీ—నువ్వు ముద్దాయిని ఆఖరుమాట ఎప్పుడు చూశావు?

సుంద—అతన్ని పట్టుకున్నరోజున. ఆ వేళే క్షేమ బయలుదేరవలసిన రోజు.

ము. ప్లీ—ఈ లోపుగా ఎప్పుడైనా కలుసుకుంటూ వొచ్చావా ?

సుంద—(తల ఊపుతుంది.)

ము. ప్లీ—ఎలా వున్నట్టు కనిపించాడు ?

సుంద—మాట చాలా తగ్గించేశాడు. ఒక్కొక్కప్పుడు అసలు మాట్లాడనే లేకపోయేవాడు.

ము. ప్లీ—అలవాటు లేని పని ఏదో చేసినట్టు.

సుంద—అవును.

ము. ప్లీ—అయినా,సంతోషంగా వున్నాడా, విచారంగా వున్నాడా ?

సుంద—కొంచెం భయపడుతున్నట్టు, ఏదో భీతి అతన్ని ఆవరించినట్టు కనిపించింది.

ము. ప్లీ—(సందేహిస్తూ) ముద్దాయి అంటే నీకు చాలా యిష్టమా ?

సుంద—(దృఢంగా) ఆ.

ము. ప్లీ—నువ్వంటే అతనికి కూడా చాలా యిష్టమేనా ?

సుంద—ఆ.

ము. ప్లీ—నీకష్టాలు అతని మనసుని చాలా కలతపెట్టేశాయంటావా? ఒక్కొక్కప్పుడు అతను చేస్తున్నపనిని తెలుసుకోలేనంత దుఃఖాన్ని కలిగిస్తాయంటావా?

సుంద—తప్పకుండా!

ము. ప్లీ—మతిచెడిపోడానికి కూడా అవకాశముందంటావు.

సుంద—ఆ.

ము. ప్లీ—శుక్రవారం ఉదయం నీ సంగతి విన్నప్పుడు గాభరాపడి పోయాడా?

సుంద—చాలా ఆవేదన పడిపోయాడు. ఆ స్థితిలో అతన్ని వొంటరిగా వదలి వెళ్ళడానికి మనసు ఒప్పనేలేదు.

ము. ప్లీ—అతనంటే ఇంకా యిష్టమేనా?

సుంద—నాకోసమే కాదూ, తన జీవితమంతా పాడుచేసుకున్నది!

(ము. ప్లీడరు కూచుంటాడు. ఫిర్యాది తరఫు ప్లీడరు లేచి అడ్డుసవాళ్లు ప్రారంభిస్తాడు)

వా. ప్లీ—నువ్వు! ఏడో తారీఖున అతన్ని వొదిలి వెళ్లేసరికి, అతనికి పిచ్చి ఎక్కిందనవు కదా!

సుంద—ఊహుం.

వా. ప్లీ—సరే. నేనింక అడగవలసిన ప్రశ్నలేమీ లేవు. (అని జడ్జీగారికి దండంపెట్టి కూచుంటాడు)

సుంద—(జూరీవైపు తిరిగి) అతనికోసం నేనైనా ఇంతపనీ చేద్దును. తప్పకుండా చేద్దును.

జడ్జీ—(బల్లగుద్దుతూ) టట్. టట్. మీదాంపత్యం చాలా దుఃఖభాజనంగా వుండేదన్నావు. తప్ప ఉభయత్రా కూడా వుందనుకుంటాను!

సుంద—అన్న ప్రతిమాటకీ "చిత్తం, మహాప్రభూ" అనకపోడమే నాతప్పు.

జడ్జీ—అతన్ని ప్రతిమాటకీ ఎదిరించేదానివి కాబోలు.

సుంద—దెబ్బలాట రాకుండా, మనసు కనిపెట్టి నడవడానికే ప్రయత్నించేసేదాన్ని.

జడ్జీ—ఈముద్దాయిని కలుసుకున్నదాకానా?

సుంద—కానేకాదు. ఆతరవాతకూడా!

జడ్జీ—నువ్వు ఈ ముద్దాయిని ప్రేమించడం ఏదో మహాఘనకార్యంచేసినట్టు భావిస్తున్నావని అనిపించిందిలే. అంచేత అడిగాను.

సుంద—(సందేహిస్తూ) అవును. నాజీవితంలో కొంచెమైనా ఆనందాన్ని యిచ్చింది అదే. ఇహ నాకు మిగిలినదీ అదే...

జడ్జీ—(గుడ్లెఱ్ఱజేసిచూస్తూ) సరేలే, వెళ్లు.

(బోనుదిగుతుంది సుందరమ్మ. తరవాత మోహనరావు బోను ఎక్కుతాడు)

(ప్రమాణం అయినతరవాత)

ము. ప్లీ—పేరు?

మోహ—మోహనరావు.

ము. ప్లీ—వయసు?

మోహ—ఇరవై ఆరు.

ము. ప్లీ—పెళ్లికాలేదు.

మోహ—(లేదని తలఊపుతాడు)

ము. ప్లీ—సుందరమ్మని ఎంతకాలంనుంచి ఎరుగుదువు?

మోహ—ఆరునెలలు.

ము. ప్లీ— మీసంబంధాన్నిగురించి ఆవిడచెప్పినది నిజమేనా?

మోహ—ఆ.

ము. ప్లీ—నువ్వావిడంటే ప్రాణమిస్తావు! ఏం?

మోహ—అవును.

కాపరంచేస్తున్న[illegible] అని తెలిసి కూడా?

మోహ—నామనసు మళ్లించుకోడానికి సాధ్యం కాకపోయింది.

జడ్జీ—సాధ్యంకాకపోయిందీ?

# చందనము—

## శీతల పరిమళము

చందనమునకుగల అనేక ఉత్తమగుణములలో అనాదినుంచి అధికముగా ప్రశంసింపబడుచున్నది దానిలోనున్న 'చలువ గుణము'. జ్వరదాహమును అణచుటకు ఔషధముగాదు ఉపయోగింపబడుటయేగాక, చందన తైలము అలసిపోయిన అవయవములకు నూతనోత్తేజమును కలిగించును. పూర్వము నుంచి పరిశుద్ధతకు పర్యాయపదముగానున్న చందనము నేడు తన ఆధునిక స్వరూపముతో— "మైసూరు శాండల్ సబ్బు" పేరుతో చలువదనమును నూతనోత్తేజమును కలిగించుచున్నది.

# మైసూరు
## శాండల్ సబ్బు

పరిశుద్ధతకు ప్రసిద్ధమైనది చందనమే

మైసూరు గవర్నమెంటు ప్రాడక్టు

B-I.TG.

A PINCH OF
"TILAK" BRAND
MISKY ASAFOETIDA.
IN
EVERY DISH
APPRECIATED
FLAVOUR




GOPALJI CHAMPSHI & Co
30 Govindappa Naick St.,
Madras.

ప్రసిద్ధికెక్కిన

**తిలక్ మార్కు**

**మిస్కి యింగువనే వాడండి.**

వాసనకున్ను, రుచికిన్ని
శ్రేష్ఠమయినది

అన్నిచోట్ల దొరకును.

## గోపాల్జి చాంప్సీ అండ్ కంపెని

ఇంగువ, మర్చంట్సు,

30, గోవిందప్ప నాయక్ వీధి, మదరాసు.

హెడ్డాఫీసు : బొంబాయి.

బ్రాంచి : మధుర.

లోకప్రసిద్ధిపొందిన

# పి. వి. రాజన్

## అండ్ కంపెనివారి




## శ్రేష్ఠమైన మదరాసు

## R. S. సుగంధ ముక్కుపొడి.

అన్నిటిలో. సాటిలేనిది.

ధర వివరములకు వ్రాయుడు.

తయారుచేయువారు :—

## పి. వి. రాజన్ & కంపెని,

అర్కోణం, Arkonam, N. A. Dt.

రిజిసరు చేయబడి సర్టిఫికెట్టు పొందిన

## పాలసుగంధిలేహ్యం

ఇది రక్తశుద్ధిచేయు అనేకమూలికలతో తయారుచేయబడినది. సవా మేహములు, మేహపొడలు, మచ్చలు, కురుపులు, చర్మవ్యాధులు, కుష్ఠు, మలబద్ధగము, కీళ్లవాపులు మొదలగు అనేకవిధములగు వ్యాధులను ఖండించుటలో అద్భుతమైనది. 2 డబ్బీలు చాలును.

20 తులముల డబ్బి రు. 2-0-0.
పోస్టేజి ప్రత్యేకము.

## పి. సి. ఏ. కంపెని,

పెరిదేపి, (నెల్లూరు జిల్లా).

మదరాసు బ్రాంచి :
7, సీను మొదలి వీధి, (మిద్దెమీద)
సెలెక్టు టాకీస్ ఎదురుగా, జార్జిటవున్.

మోహ—ఆవిడమీదికి మనసుపోకుండా కట్టి పెట్టడానికి నాకు శక్తివున్నట్టు తోచలేదు.

(జడ్జీగారు నోరు చప్పరిస్తారు)

ము. ప్లీ—మీ యిద్దరికీ ప్రథమంలో పరిచయం ఎలాగయింది ?

మోహ—మా అక్కయ్యద్వారా ?

ము. ప్లీ—ఈవిడ కుటుంబం సంగతి తెలుసా ? భర్తతో సౌఖ్యంగా కాపరం చేస్తోందేమో ?

మోహ—అసలు ఎప్పుడూవున్న గొడవే. అది నరకం !

ము. ప్లీ—భర్తని ఎరుగుదువా ?

మోహ—ఆవిడద్వార నే. పశువు !

జడ్జీ—కోర్టువారి యెదుట లేని ఒకవ్యక్తిని నోటి కొచ్చినట్టు తిట్టడానికొప్పుకోము.

ము. ప్లీ— (జడ్జీగారినుద్దేశించి) క్షమించాలి. (మో. తో) నువ్వు ఈచెక్కుమార్చినట్టు ఒప్పుకుంటావా?

మోహ—(నిరుత్తరుడై తలవొంచుకుంటాడు)

ము. ప్లీ—జూలై ఏడో తారీకు ఉదయం జరిగిన సంగతులు జ్ఞాపకం చేసుకు చెప్పు.

మోహ—ఆవిడ వొచ్చేసరికి భోజనందగ్గిర కూచున్నా. ఊపిరి తిన్నగా తియ్యలేక ఆయాసపడు తోంది. చీర చిరిగిపోయింది. కంఠంమీద అతనివేళ్ల ఆనమాళ్లుకూడా కనిపించాయి. చెయ్యి కొట్టుకు పోయింది. కళ్లు నిప్పుకణాల్లా ఎఱ్ఱబడ్డాయి. జరిగిన సంగతి చెప్పినప్పుడు కోపం ఆపుకోలేకపోయాను. నాకే చాలాభయమేసింది. (తీవితో అకస్మాత్తుగా) రక్తంలో వెచ్చదనమున్నవా రెవరూ సహించలేరు. నాలాగే మీరూ ప్రేమిస్తే, ఆస్థితిలో మీకూ నాకు కలిగిన భావాలే కలిగుండును. నాకు తెలుసు.

ము. ప్లీ—(ధోరణి తప్పిద్దామన్నట్టు) సరే. సరే. తరవాత?

మోహ—నేను ఆఫీసుకివెళ్లడంకోసం ఆవిడ నన్ను విడిచివెళ్లినతరవాత, కోపోద్రేకం పట్టలేక ఏ ఘాతకకృత్యం చేస్తానోనన్న భయంచేత మనస్థిమితం లేకపోయింది. పైగా యింటిదగ్గర మొగుడు మళ్లీ ఏమిబాధలు పెడుతున్నాడో నన్న ఆందోళనకూడా నన్ను పీకేసింది. నేను ఏంచెయ్యాలి, ఏమిచెయ్యగలను అన్న ఆలోచనలతో పనిముట్టుకోలేకపోయాను. అయిదునిమిషాలు ఒకచోట కూచోలేకపోయాను. సుబ్బారావు, మార్చుకురావడానికి చెక్కు చేతిలో పెడుతూ "కొంతదూరం నడిచొస్తే, నీ మనసు కుదుట పడేలా' వుంది. ఈరోజంతా కాలుగాలిన పిల్లిలా వున్నావు" అన్నాడు. నాచేతిలో చెక్కుచూడగానే ఒక్కక్షణకాలం తళుక్కుమని తట్టింది, ఆతొమ్మిది తరవాత సున్నా చేర్చి, తొమ్మిదిని తొంభైకిందదిద్దేస్తే ఈనరకంలోనించి నా స్నేహితురాలిని తప్పించడానికి సరిపోయిన సొమ్ము లభిస్తుందిగదా అని. ఈభావన ఎలాకలిగిందో నాకు తెలీదు. ఈ ఆలోచన ఒక్క మాటుతట్టి ఊరుకుంది. తరవాత దీన్నిగురించి ఆలోచించనేలేదు. ప్రయత్నంకూడా ఏమీ చెయ్యలేదు. తరవాత ఏమిజరిగిందో నాకసలు గుర్తులేదు. గుమాస్తా "అన్నీనోట్లేకావాలా?" అనడం మాత్రమే జ్ఞాపక ముంది. అప్పుడు నిద్రలోనించి మెలుకువొచ్చినట్టయింది. చేసిన కార్యం అప్పుడుబోధపడింది. బయట కొచ్చిన తరవాత ఏబస్సుకిందయినా పడి చచ్చిపోదామా అనిపించింది. సొమ్మైనా పారేద్దామనుకున్నా ! కాని ఎలాగూ నేరం జరగనే జరిగింది కనక ఆవిడని రక్షించడమే మంచిదని తోచింది. టిక్కట్ల కోసం ఖర్చుపెట్టినదీ, ఆవిడకి యిచ్చినదీ, అంతా వృథా అయిపోయింది. నే కర్చుపెట్టిన చిల్లరతప్ప అంతా తిరిగి ఇచ్చేశాను. ఇంతకార్యం ఎలాచేశానా అన్న ఆలోచనలు నన్ను విడవడంలేదు. కాని చేసిన పని ఇప్పుడు తుడిచి వెయ్యలేను. ఇంకోవిధంగా జరిగితే ఎంత బాగుండి పోను !

(ఒక్కనిమిషం అంతా నిశ్శబ్దం)

ము. ప్లీ—కోర్టుకీ బాంకుకీ ఎంతదూరం ?

మోహ—యాభయి గజాలుండదు.

ము. ప్లీ—నీకు సుబ్బారావు చెక్కు ఇచ్చినది మొదలు సొమ్ము తీసుకున్నదాకా ఎంత టైము పట్టుంటుంది ?

మోహ—నాలుగు నిమిషాలైనా వుండదు. అంతదూరమూ పరిగెత్తా!

ము. ప్లీ—ఆ నాలుగు నిమిషాల్లోనూ జరిగిన దేమీ జ్ఞాపకం లేదూ?

మోహ—ఊహు. ఒక్కపరుగెత్తడం తప్ప.

ము. ప్లీ—చెక్కుమార్చడం నీకు జ్ఞాపకమే లేదు?

మోహ—లేదు. నిజంగా లేదు.

(ము. ప్లీడరు కూచుంటాడు. ఫిర్యాది తరఫు ప్లీడరు లేచి)

ఫి. ప్లీ—పరుగెత్తడంమాత్రం జ్ఞాపకముందీ?

మోహ—ఆయాసంచేత ఊపిరి ఆడలేదు బాంకుకి చేరేటప్పటికి!

ఫి. ప్లీ—చెక్కుమార్చడం జ్ఞాపకం లేదూ?

మోహ—(వినిపించీ వినిపించనట్లు, హీనస్వరంతో) లేదు.

ఫి. ప్లీ—ఇదుగో. ఇలా చూడూ! మీప్లీడరు గారు ప్రవేశపెట్టిన శృంగారమంతా మరిచిపో. నిజం చెప్పు. ఈ కేసు సామాన్యమైన ఫోర్జరీకంటె ఏమైనా భిన్నమయినదంటావా? నువ్వేచెప్పు!

మోహ—ఆపొద్దున్నంతా సహం పిచ్చెక్కి తిరిగాను.

ఫి. ప్లీ—టట్. టట్. చెక్కులో తొమ్మిది తొంభైకింద దిద్దినప్పుడు, ఆచెక్కుమార్చినట్టు ఎవరికీ గుర్తుతెలియనంతనేర్పుతో అక్షరాలు వ్రాశానా లేదా?

మోహ—ఏదో. అది అలాకుదిరింది!

ఫి. ప్లీ—తమాషాగానే కుదిరింది కాదూ (అని చిరునవ్వు నవ్వుతాడు) పోనీ, అయితే కౌంటర్ ఫాయిల్ మార్చింది ఎప్పుడు?

మోహ—బుధవారం.

ఫి ప్లీ—అదికూడా తమాషాగానే కుదిరిందీ?

మోహ—(మాట్లాడడు.)

ఫి. ప్లీ—కౌంటర్ ఫాయిల్ మార్చడానికి తగిన సమయంకోసం వేచిఉండవలసొచ్చిందనుకుంటాను. అవునా?

మోహ—(హీనస్వరంతో) అవును.

ఫి. ప్లీ—అది చేసినప్పుడుకూడా చాలా ఉద్రేకంలో వున్నానవుకదా!

మోహ—మనస్సు చాలా పీకుతూనేవుంది.

ఫి. ప్లీ—పట్టుబడిపోతావేమోనన్న భయంచేతా?

మోహ—(చితికిపోయి) అవును!

జడ్జీ—చేసిన నేరాన్ని ఒప్పుకుని యజమానికి సొమ్ము ఇచ్చెయ్యడం ఒకటే ఘరానామార్గమన్నమాట తట్టలేదూ?

మోహ—ధైర్యంచాలిందికాదు.

ఫి. ప్లీ—పైగా ఈ స్త్రీని లేవదీసుకుపోడం అట్టే వుండిపోయిందిగా!

మోహ—ఇంత పనీ జరిగిన తరవాత ఊరుకోడం చాలా అసందర్భంగా కనిపించింది. ప్రయోజనం లేకుండా అలాటి పని చెయ్యడమా? ఆత్మహత్య చేసుకున్నా ఒకటే!

ఫి. ప్లీ—సుబ్బారావు వెళ్లిపోతున్నాడని తెలుసు. ఈ అనుమానం అతనిమీద పడుతుందని తట్టలేదూ?

మోహ—నాకు తెలియకుండా అంతా గడియలో జరిగిపోయింది. తరవాత తట్టింది.

ప్లీ.—అప్పుడైనా నేరం ఒప్పుకుందామని బుద్ధిపుట్టలేదూ?

మోహ—అక్కడికి వెళ్లి రాద్దామనుకున్నా! సొమ్ము ఎలాగూ తీర్చివేద్దును.

ఫి. ప్లీ—ఈ లోగా అతన్ని పట్టుకు కేసు పెట్టినా?—

మోహ—అతను చాలా దూరాన్న వున్నాడని తెలుసు. వ్యవధి వుందనుకున్నా. ఇంత త్వరలో పట్టుబడుతుందనుకోలేదు!

ము. ప్లీ—(లేచి) చెక్కుబుక్కు రాజారావు టేబులులోనే ఉండిపోడంవల్ల, ఒక్కరోజు ఆలస్యంగా

పట్టుబడితే, మోహనరావూ వెళ్లిపోయి ఉండును. ఈ సంగతి కోర్టువారికి జ్ఞాపకంచేస్తున్నా.

జడ్జీ—సుబ్బారావుమీదకాక, తన మీదే అనుమానం కలుగుతుంది అన్న సంగతి ముద్దాయికి దృష్టిలో వుందా అన్నదే ఇప్పుడు మనం ఆలోచించవలసిన విషయం. సుబ్బారావు వెళ్లిపోయినదాకా, చెక్కుబుక్కు రాజారావు జేబులోవున్న సంగతి నీకు తెలుసా ?

మోహ—నేను...అనుకున్నా...అతను.

జడ్జీ—(కోపంగా) నిజంచెప్పు. తెలుసా? తెలీదా ?

మోహ—(చాలా సన్నని గొంతుకతో) తెలీదు. తెలీడానికి అవకాశంలేదు.

జడ్జీ—(డి. ప్లీ తో) మీ సందేహ నివృత్తి అయిందా ?

ఫి. ప్లీ—ఇలాటిజాడ్యం నీకు ఇదివరకెప్పుడైనా పట్టిందా ?

మోహ—లేదు.

ఫి. ప్లీ.—మధ్యాహ్నం మళ్లీ పనిలోకి వెళ్లడానికి మన నిమిత్తం కలిగిందీ?

మోహ—ఆ. సొమ్ము తీసుకువెళ్లవలసొచ్చింది.

ఫి. ప్లీ.—తొమ్మిదిరూపాయలూ కాదూ? అది మాత్రం జ్ఞాపకముండేటంత తీక్షణంగా వుందేం బుద్ధి? చెక్కు మార్చడం నిజంగా తెలియదే అంటావు ఇంకా!

(అని దిగ్విజయంగా కూచుంటాడు)

మోహ—నాకు నిజంగా పిచ్చెక్కకుండా వుంటే ఇలాటిపని చెయ్యడానికి ధైర్యం చాలకపోను.

ము. ప్లీ.—(లేచి) తిరిగి ఆఫీసుకి వెళ్లకపూర్వం టిఫిను తీసుకున్నావా?

మోహ—ఆరోజంతా పస్తే. రాత్రి నిద్దర పట్టలేదు.

ము. —సరే. ఇప్పుడూ, ఆ నాలుగునిమిషాల్లోనూ జరిగిన సంగతులేమీ జ్ఞాపకంలేదంటావూ?

మోహ—(ఒక్కనిమిషం ఆలోచించి)రామయ్యగారి మొహాన్ని గురించి ఆలోచించినట్టు జ్ఞాపకం!

ము. ప్లీ.—రామయ్యగారి మొహమా? దానికీ, నీ నేరానికీ సంబంధ మేమిటి?

మోహ—ఏమీ లేదు!

ము. ప్లీ.—ఈ ఆలోచన ఎప్పుడు తట్టింది? పరుగు ప్రారంభించకపూర్వం ఆఫీసులో వుండగానేనా?

మోహ—అవును. పరుగెత్తుతూవుండగాకూడా అదే ఆలోచన!

ము. ప్లీ.—"నోట్లు కావాలా?" అని అడిగేదాకా అలాగే వుందేం?

మోహ—అవును. ఆమాటతో తిరిగి మనుష్యలోకంలో పడ్డాను. కాని అప్పటి కంతా మించిపోయింది.

ము. ప్లీ.—సరే. (జడ్జీవైపు తిరిగి) ముద్దాయి తరఫు సాక్ష్యం పూర్తయింది.

(జడ్జీ తల ఊపుతాడు. మోహనరావు బోను దిగి పోతాడు)

ము. ప్లీ.—(తను రాసుకున్న నోట్సు చేత్తో పట్టుకుని) ప్రాసిక్యూషన్ ప్లీడరుగారు నావాదాన్ని ఎగతాళి చెయ్యడానికి ప్రయత్నిస్తున్నట్టు క్రాస్ఎగ్జామినేషన్‌లో సూచనలు చూపించారు. ఈ పాటికే, నేను కోర్టువారి యెదుటపెట్టిన సాక్ష్యంవల్ల "ఈ ముద్దాయి నిజముగా తన చేష్టలకి తాను బాధ్యుడుకాడు. ఉద్రేకాతిశయంవల్ల కలిగిన మానసిక ఆందోళన చిత్తభ్రమ కలగజేసి, అతనికి తాత్కాలికోన్మాదావస్థను కలిగించింది" అన్న విషయం నిస్సందేహంగా రుజువయినట్టు మీకు తోచకపోతే నేను ఇప్పుడు ఏంచెప్పినా లాభం లేదు. నా వాక్చాతురితో మీ హృదయాలని ద్రవింపజేసి జాలి కలిగించాలని నా ప్రయత్నమూకాదు; ఉద్దేశమూకాదు. శృంగారపుగాథతో ఈకేసు మూలవిషయాన్ని మరుగుపరుస్తున్నానని మా స్నేహితుడు నిందించాడు. అలాటికార్యం నే నేమీ చెయ్యలేదు. నేను చేసినపని, ఒక్కమారు తెర తొలగించి, నిందు

ప్రాణంతో కొట్టుకుంటున్న జీవితపుస్వరూపాన్ని మీ యెదుట పెట్టడంమాత్రమే. ప్రతినేరానికీ కారణభూతంగా జీవితపుసంఘర్షణ ఒకటి వుండితీరుతుంది. మనం ఇప్పుడు ఒక మహానాగరికసంఘంలో, కాలంలో జీవిస్తున్నాము. మోటుతనం, కరకుతనం, బాధ, హింస-వీటికి గురియైన వ్యక్తితో మనకి ప్రత్యేకబాంధవ్యం లేకపోయినా, మనని పూర్తిగా కలతపెట్టేస్తాయి. అదే ఒకస్త్రీ హింసింపబడుతోంది అనండి. అందులో మనం గాఢంగా ప్రేమించిన స్త్రీ. మీకు అటువంటి పరిస్థితుల్లో కలిగేభావాలు ఊహించుకోండి ఒక్కమాటు. ముద్దాయి వయస్సులో మన భావాలు ఎంత ఉద్రేకంలో వుంటాయో జ్ఞాపకం తెచ్చుకోండి. జ్ఞాపకం తెచ్చుకుని,ఒక్కమాటు ముద్దాయిని చూడండి. తాను ప్రాణాధిక్యంగా ప్రేమిస్తున్న స్త్రీ హింసింపబడుతూవుంటే గాభరాపడకుండా చూసి ఊరుకోగలిగిన రాతిగుండెవాడు కాదు. కనక కర్తవ్యాకర్తవ్యనిర్ణయశక్తి ఒక్క తృటికాలం అతనిని త్యజించింది. ఒక్కనిమిషం అంధకారం ఆవరించింది. దుఃఖంలో, ఆవేదనలో ఆత్మహత్య చేసుకుంటున్న వ్యక్తులని మనం ఎరుగుదుము. వారు నీచులనికాని, నేరస్థులని కాని మన అభిప్రాయంకాదు. ఆ పరిస్థితుల్లో మనుష్యులు ఇతర నేరాలుకూడా చెయ్యడానికి అవకాశముందనీ, సాధారణంగా చేస్తారనీకూడా మనం గుర్తించాలి. తప్పుచేసినంతమాత్రాన్ని నేరస్థుడని యెంచి శిక్ష విధించడం కానిపని. ఆతనికి "నేరం చెయ్యాలి" అనే దురుద్దేశం లేదు కనక, "తన అవయవాలు స్వాధీనం తప్పిన ఒక రోగి" అని చికిత్స చేయవలసిందే కాని, నేరస్థుడని పరిగణించి శిక్షించడం అనుచితం. దురుద్దేశంతో చెయ్యనిది నిజంగా నేరంకాదు. దురుద్దేశం లేశమయినా ఈ ముద్దాయికి లేదని సాక్ష్యం ద్వారా నేను నిరూపించాను. కనక ఈ ముద్దాయి "నిర్దోషి" అని మీరు నిర్ధారణకి రావాలి. చేసినది ఒక్కతప్పు. అది ఒక్క తృటికాలంలో జరిగిపోయింది. జరిగిపోయిన కార్యాన్ని మార్చడానికి మనం అసమర్థులము! అశక్తులం!! ఒక్కమాటు చెక్కుదిద్దీ, సొమ్ము కోసం అందిచ్చినతరవాత ఎంత పశ్చాత్తాపపడినా, అతను చెయ్యగల కార్యం లేదు. "న్యాయ" మన్న బోనులో చిక్కుకున్న ప్రాణి బయటపడడానికి వీలు లేదు. ఇతను ఆనాలుగు నిమిషాల్లోనూ కాలుజారి బోనులో పడ్డాడు. మన శాసనాల్లో జీవం లేకపోడం చేత, న్యాయపరిపాలనలో మానవహృదయాన్ని అర్థం చేసుకోగల ప్రజ్ఞకి తావు లేదుకనక, మన ముద్దాయి వంటివారు అనేకమంది ప్రతిరోజూ నశించిపోతున్నారు. ఇతన్ని నేరస్థుడు అని వాత పెట్టగద్దు. నేరం చేసే రకపుమనిషి అని శిక్షించి ముద్రవేస్తే కొద్ది కాలంలో ఆవిధంగానే మారడానికి అవకాశ మెక్కువ. "న్యాయం" అనేది ఒక మహారథం. కదిలినతరవాత ఆపడానికి శక్తి ఎవరికీ లేదు. అడ్డుతగిలిన దురదృష్టవంతుల మీదినించి రథచక్రాలు పోవలసినదే. ఇతను "కొంచెం తప్పుదోవని పట్టిన వ్యక్తి" అని పరిగణించి, మంచిమార్గానికి తిరిగి రావడానికి తగిన పరిస్థితులు కల్పించి, అతనికి మరో అవకాశం ఇవ్వవలసిన విధి మనది; సంఘానిది. నేరస్థుడని ఖైదుచెయ్యండి; జీవితం ధ్వంసంచేసినట్టే! అతను చేసిన నేరాన్ని, పడిన పశ్చాత్తాప ఆవేదనలనీ పోల్చిచూడండి. ఈనాటికి రెండు నెలలనించీ విచారణకోసం జైలులో వున్నాడు. ఈ లోపల అతను పడిన ఆవేదన ఊహించుకోండి. శిక్షకి ప్రయోజనం కసితీర్చుకోడంకాదు. కసితీర్చుకునేకాంక్ష పశుత్వం. నేరం తిరిగి జరక్కుండా చెయ్యడమే శిక్షకి పరమావధి. తాను జైలులో గడిపిన రెండు నెలలూ ఎన్నడైనా యితను మరిచిపోగలడా? తగిన శిక్ష అప్పుడే జరిగింది. న్యాయరథచక్రాలు కొంత ఇతనిమీదికి ఎక్కనేఎక్కాయి. ఇంకా వెళ్లనిస్తే, (చిటికేసి) ఇందుకు పనికిరాడు......

(అని కూచుంటాడు. ఒక్కనిమిషం నిశ్శబ్దం. ఫిర్యాదితరఫు ప్లీడరు నెమ్మదిగాలేచి తాపీగా తన ఉపన్యాసం ప్రారంభిస్తాడు)

ఫి. ప్లీ|— ఈకేసులో జరిగిన విషయాలని గురించి వివాదంలేదు. తప్పుడుకేసు పెట్టామని వారి వాదంకాదు. నేరం ఏకారణంచేత జరిగింది అన్న సంగతి అనవసరం. అప్రస్తుతం. కోర్టులో దాని ప్రశంస అసలు రాకూడదు. అయినా ఈ ముద్దాయి

నేరంచెయ్యడానికి గల కారణాన్ని మీ అందరికీ విశదంచేసి, ప్లీడరుగారు చర్చించారు. శృంగారపు తళుకు ప్ర పెట్టారు...లేదని అంటేమటుకేం...ఈ కిటుకు మీరు తెలుసుకున్నట్టయితే కేసంతా మీకు అర్థమయిందన్నమాటే! సావధానంగా చిత్తగించాలి: "తాత్కాలికోన్మాదం కలిగింది" అన్న వాదం ఒక్కసారి పరిశీలిద్దాం. మీరు సుందరమ్మ చెప్పిన సాక్ష్యం విన్నారు. ఆరోజు ఉదయం ఆమె ఇల్లు వొదిలివెళ్లినప్పటికి అతనికి మతి చలించలేదని ఆవిడ సాక్ష్యం చెప్పింది. ప్లీడరుగారు అన్నట్టు దుఃఖాతిశయంచేత మతి చలించాలే అనండి! ఆసమయంలోనే కదా, అది న్యాయంగా జరగవలసింది!! సరే. హెడ్ గుమాస్తా రామయ్యగారి సాక్ష్యంవిన్నారు. "ముద్దాయిమనసు మనసులో ఉన్నట్టు తోచదు" అన్నారు. ఆమాటకి నాకు అర్థం బోధపడలేదు. ఆయనమాత్రం ఇది మీకు బోధపడుతుందనుకుంటున్నాడు. ఈ మాటకి అర్థం ఏమయినా, "మతిచలించడం" మాత్రం కాదన్నమాట స్పష్టమేగా! ఇక సుబ్బారావు చెక్కు ఇతని చేతికిచ్చినప్పుడు—సుబ్బారావు ఇప్పుడిక్కడ లేకపోవడం మనదౌర్భాగ్యమే—కాని చెక్కు చేతులో పెడుతూ సుబ్బారావు అన్నమాటలు ముద్దాయి మన అందరికీ చెప్పాడు. అంటే అప్పటికి మతి చలించలేదన్నమాట. లేకపోతే ఆ మాటలు జ్ఞాపకముండకపోను. అతను సొమ్ము పుచ్చుకున్నప్పుడు మతి స్థిరంగానే వుందని గుమాస్తా చెప్పాడు. అంటే ఒంటిగంటా పదినిమిషాలకి బాగావుండి, ఒంటిగంటాపదిహేను నిమిషాలకి బాగావుండి, నేరంతప్పించుకోడానికి మాత్రం "ఆ నాలుగు నిమిషాలూ మతి చలించింది" అనుకోవచ్చునన్న వాదంమాత్రం మనకి మిగులుతుంది. నాకు ఈ వాదంవింటే నవ్వొస్తోంది. ఇంత అసందర్భపువాదాన్ని పరీక్షించి, దానిలోని అవకతవకలు మీకు విశదపరుస్తూ మీకాలం పాడుచెయ్యవలసిన అవసరమే లేదని నా అభిప్రాయం. ఈ చొప్పదంటువాదంలో ఎంతబలముందో ఈ పాటికే మీకు తెలిసిపోయివుంటుంది. ఇతను మన ధర్మశాస్త్రాల్లో పేర్కొన్న మహానేరాల్లో ఒక నేరం చేశాడు. పైగా నేరాన్ని మరోవ్యక్తిమీదికి తోసెయ్యాలని ప్రయత్నించాడు. అదీగాక, సంసారం చేస్తున్న స్త్రీని లేవదీసుకుపోదామని ఈ నేరంచేశాడు. ఈ పరిస్థితుల్లో ముద్దాయి దోషి అని నిర్ధారణకి రాకతప్పదు. అది మీకర్తవ్యం. మీవిధి మీరు నెరవేర్చుకోవాలని మాత్రమే నే చెప్పేది......

(అని కూర్చుంటాడు. అంతా నిశ్శబ్దం ఒక్క అరక్షణం)

జడ్జీ—(జూరీవైపు కొంచెం ముందుకు వొంగి) మీరు సాక్ష్యాన్నీ, దానిపైన జరిగిన వ్యాఖ్యానాలనీ విన్నారు. మీరు ఏవిషయాలమీద మీ అభిప్రాయం ఇవ్వాలో చెప్పటంమటుకే ఇప్పుడు నాకర్తవ్యం. విషయాలు అన్నీ ముద్దాయిపక్షంవారు ఒప్పుకున్నారు. కొంతరుఘాయిలు మార్పుచంతో సహా. డిఫెన్సువాదం ఇది: "ఈనేరం జరిగినప్పుడు ముద్దాయి తాత్కాలికోన్మాదస్థితిలో ఉండడంవల్ల అతని చేష్టలకి అతను బాధ్యుడుకాడు" అని. మీకు సాక్ష్యంవల్ల ఉన్మాదస్థితిలోనే ముద్దాయి ఈ నేరంచేశాడని తోచినట్టయితే "నేరం చేశాడు; కాని మతి స్థిరంలేదు" అన్న నిర్ధారణకి రావాలి. లేకపోతే "నేరస్థుడు" అనాలి. ఉన్మాదావస్థనిగురించి మీరు ఆలోచిస్తున్నప్పుడు, నేరం జరగడానికి ముందు వెనకల ముద్దాయి ప్రవర్తనని ఉమ్మడిగా విచారించాలి. సాక్ష్యం మీరు పూర్తిగా జ్ఞాపకముంచుకోండి. కాని ముద్దాయి వయస్సు, అతనికి కలిగిన దుఃఖము, బాధ మీరు లెక్కలోకి తీసుకోకూడదు. "నేరంచేశాడు. కాని మతి స్థిరంలేదు" అన్న నిర్ధారణకి రావడానికి, ఆనిమిషాన, "పిచ్చి ఆసుపత్రిలో చేర్పించదగినంత ఉన్మాదం అతనికి కలిగిందని రుజువయి"నట్టు మీకు తోచాలి. మీరువెళ్లి, విషయంచర్చించి, నిర్ధారణకు రావచ్చును.

(జూరీ మెంబర్లు బయటికి లేచి వెళతారు. స్టేజిమీద ఏమీ చైతన్యముండదు. ఓ నిమిషంలో జూరీ మెంబర్లు తిరిగొచ్చేసి, తమ స్థానాలు ఆక్రమించుకుంటారు).

జడ్జీ—మీరు ఏకగ్రీవంగా ఒకే నిర్ధారణ కొచ్చారా?

జూ. నాయకుడు—ఆ.

జడ్జీ—"నేరస్థుడు" అనా; "నేరంచేశాడు. కాని మతి స్థిరంలేదు" అనా?

జూ. నాయకుడు—"నేరస్థుడు" అని.

ము. ప్లీ—(లేచి) కోర్టువారు కరుణించి శెలవిస్తే శిక్ష కొంచెం తగ్గించవలసిందని రెండుముక్కలు మనవి చేసుకుంటాను. లోగడ చెప్పినదానికంటె ఇప్పుడు ఎక్కువేమీ చెప్పగలనని కాదు కాని...

జడ్జీ—అవును. ఎక్కువ చెప్పేందుకేమీ లేదు!

ము.ప్లీ—కోర్టువారలా శెలవిస్తే మరి చెప్పేందుకేముంది? అంతా తమదయ!

జడ్జీ—(ముద్దాయి నుద్దేశించి) నీకు న్యాయ శాస్త్రప్రకారం విచారణ జరిగింది. నువ్వు నేరం చేశావని నిర్ధారణ అయింది. నా వుద్దేశంలో, జూరీ సరియైన నిర్ధారణకే వొచ్చారు. "నీచేష్టలకి నువ్వు బాధ్యతవు కావు" అని డిఫెన్సువాదం. విచారణ జరుగుతున్నంతసేపూ ఈ వాదాన్ని పురస్కరించుకుని, నీ మీద దయదలచమని మీ ప్లీడరుగారు కోరుతూనే వున్నారు. నిన్ను ఒక రోగిగానే కాని ఒక నేరస్థునిగా పరిగణించకూడదని ఆయనవాదం. ఉద్రేకంలో, యుక్తాయుక్తాలు మరిచి, ఆయన న్యాయశాస్త్రాన్నీ, ఇప్పటి విధానాలనీ కూడా నిందించాడు. పైగా ఇప్పటివిధానంవల్ల నేరాలు ఎక్కువవుతున్నట్టు కూడా తేల్చారు! నీకు నేరం చెయ్యాలన్న దురుద్దేశం లేదనీ, భావోద్రేకంలో అసహాయుడివై కొట్టుకుపోతూ ఈ పనిచేశావనీ చెప్పారు. దీనికి ఆధారంగా నీకూ సుందరమ్మకీ వున్న సంబంధం పైన బెట్టారు. ఆ స్త్రీ సద్గతిలో వుండడంవల్ల, చేసినపని అంత శోచనీయం కాదని మీ ప్లీడరుగారి వాదన! కాపురం చేస్తున్న స్త్రీని లేవదీసుకుపోయే అభిప్రాయంతో నేరంచేశావు. పైగా నేరం మరొకరిమీద తప్పించడానికి ప్రయత్నించావు. ఇది దురుద్దేశం కాక మరేమిటి? ఈ పరిస్థితుల్లో, ఎంత ప్రయత్నించినా, నీమీద జాలిపుట్టడంలేదు. నీ నడతవల్ల ఒక నిర్దోషికి ప్రమాదం ఏర్పడింది. ఇది నువ్వు నీబుద్ధికుశలత వినియోగించి, కావాలని చేసినపని. ఇతరులు నీ మార్గం అనుసరించకుండా కాపాడవలసిన బాధ్యత, విధి నామీదవుంది. నీకు శిక్షవిధించడమే అన్యాయమని వాదించారు మీప్లీడరుగారు. అతని ఉపన్యాసధోరణి నాకు అర్థం కానే లేదు. న్యాయమన్నది ఒక పెద్దసౌధం. మన అందరికీ తలదాచుకోడానికి ఆశ్రయమిచ్చిన మహాసౌధం. సౌధనిర్మాణం కాదు నావిధి దానిని వినియోగించడమే. నువ్వు చాలా హీనమయిన నేరం చేశావు. సంఘక్షేమంకోసం, నాకిచ్చిన అధికారాన్ని దుర్వినియోగంచేసి, నీకు దయచూపించలేను. కనక, నీకు మూడేళ్లు కఠినశిక్ష విధిస్తున్నాను...

(జడ్జీగారు తీర్పు చెబుతున్నంతసేపూ మోహనరావు నిస్తబ్ధుడై వింటాడు. పూర్తి అవగానే తల వాలిపోతుంది. పోలీసులు అతన్ని తీసుకుపోతూంటే సుందరమ్మ మూర్ఛపోతుంది; కోర్టులో గొడవ. ఆవిడని మెల్లిగా పైకి, పట్టుకు తీసుకుపోతారు)

జడ్జీ—(గుమాస్తాతో) తరవాత కేసు పిలు.

గుమా—౩౮ of ౧౯౫౮. వెంకయ్యగారు.

['వెంకయ్యగారూ, వెంకయ్యగారూ' అని కేకలు. తెర]

[సశేషము]



# గాంధీ-రవీంద్రులు

= శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వరరావు =

["*Tagore is the Plato of our own times; Gandhi is the St. Paul*"

—*C. F. Andrews*]

భారతమాత అనాదినుంచీ మహాపురుషులను ప్రసవిస్తూనే వచ్చింది. ప్రపంచ నాగరికతకి మెరుగులు దిద్దిన ఎందరినో మత ప్రవక్తల్నీ, మహాకవుల్నీ, సార్వభౌముల్నీ, యోధాగ్రణుల్నీ ఆమె ప్రపంచానికి సమర్పించింది. ప్రపంచ మహా వ్యక్తులలో ఒకడుగా కీర్తింపబడే గాంధీజీని ప్రసవించి ఈ రోజునకూడా భరతమాత తన ఖ్యాతిని కాపాడుకొన్నది. ఇటీవలివరకూ మనమధ్య మసలిన రవీంద్రుడు ప్రపంచ మహా కళా నిర్మాతలలో ఒకడుగా గుర్తించబడ్డాడు. దేశదేశాలవారినీ ఆయన గీతాలు ఉర్రూత లూగించినై.

ఆధునికయుగ భావజగత్తులో గొప్ప విప్లవం తెచ్చినవారు గాంధీ రవీంద్రులు. మన నాగరికతకి వారు క్రొత్తక్రొత్త పుంతలు తీశారు. భారతీయ జీవనపథంలో ముసురుకున్న విషాదాంధకారాన్ని పటాపంచలు చేసిన జ్యోతిర్మూర్తులు. మన జాతిని ఇతఃపూర్వం అజ్ఞాతమైన ఒక మహోన్నత లక్ష్యం వైపుకి మరలించిన నాయకమణులు వారు. భారత దేశం సాంఘికంగా పతనం చెందిపోయి, దాస్యయుగం పరిపక్వ స్థితికి వచ్చిన రోజులలో వీరుభయులూ భారతదేశ



గాంధీజీ




రవీంద్రుడు

గౌరవాన్ని బాహ్యప్రపంచంలో ప్రతిష్ఠించ టానికి ఎంతో కృషిచేశారు. భారత దేశ పునరుద్ధరణ అనే మహత్తరమైన కార్యంలో వారు పుష్టికరమైన ఆధ్యాత్మిక సంజీవిలాగ పనిచేశారు.

తన దేశీయులైన కోటానుకోట్ల ప్రజల చేత 'మహాత్ముడు' (గొప్ప ఆత్మ కలవాడు) అని కీర్తింపబడుతున్నాడు గాంధీజీ. వివాద గ్రస్తులైన వివిధమతాలవారి నందరినీ ఒక్క త్రాటిమీద నడిపించి, ఏకజాతిగా అనుసంధిస్తూన్న అసామాన్య ప్రతిభాశాలి ఆయన. అహింసా, సాత్త్వికనిరోధసిద్ధాంతాలు ప్రపంచవిజ్ఞానానికి ఆయన సమర్పించిన అమూల్యాభరణాలు. షేక్స్పియర్ కవి బ్రూటస్ పాత్రని వర్ణిస్తూ ఇలా అంటాడు: "అతడు అచ్ఛమైన సాధువు. ప్రకృతి అతనిని చూసి 'ఇతడే నిజమైన మానవుడు' అని చెప్పదగినంతగా ప్రాకృతిక శక్తులన్నీ అతనిలో సామరస్యమును పొందినై." ఇదే వర్ణన గాంధీజీకికూడా వర్తిస్తుంది. రాజకీయ వేత్తలలో ఋషిత్వం పొందిన రాజకీయవేత్త గాంధీజీ. ఆయన ప్రేమ సిద్ధాంతం మన దేశానికే కాదు - ప్రపంచానికే చాలా అవసరం. దురాశతో, రుధిరతృష్ణతో పంకిలమైన నేటి ప్రపంచానికి ఆయనసిద్ధాంతం ఎడారిలో నీటిబుగ్గలాంటిది. పునరుజ్జీవనం పొందుతూన్న భారత దేశపు కంఠస్వరమే ఆయన కంఠస్వరం. ఆ కంఠం ప్రపంచజాతులన్నిటినీ "దేవునియెడలా, మానవునియెడలా మీమీ విధులు నెరవేర్చి, ఇంతకన్నా ఉత్తమమైన, సంపన్నమైన, పరిపూర్ణమైన జీవితంలోనికి రండి" అని ఆహ్వానిస్తోంది.

రవీంద్రుడు మన జాతీయ కవి. మన జాతీయ వాంఛలకీ, ఆశయాలకీ అద్దముల లాంటివి ఆయనగీతాలు. ఆయన భారత దేశానికీ, తద్వారా ప్రపంచానికీ, వైదిక యుగంనాడు మన మహర్షులు లక్షించిన పరిపూర్ణ జీవనదృశ్యాన్ని ప్రసాదించాడు. వ్యక్తిగత జీవితంలోనే కాక జాతీయ జీవితంలో కూడా ప్రేమ, సత్యము, సౌందర్యము-వీటి పారమ్యాన్ని చాటటమే ఆయన ఏకైక జీవిత లక్ష్యం. ప్రాచ్యనాగరికతా సంరక్షకుడు రవీంద్రుడు. కవి, వేదాంతి, ప్రవక్త, శిల్పి, ఆచార్యుడు-వీరందరియొక్క చిత్రమైన సమ్మేళనమును మనం రవీంద్రునిలో చూడగలం.

రవీంద్రుడు 'ప్లాటో' ని గుర్తుకి తెస్తాడు. కళా విజ్ఞానాలకి ప్రసిద్ధికెక్కిన వంగరాష్ట్రపు వైలక్షణ్యాలు రవీంద్రునిలో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. ఆయన ఆదర్శవాది. పరిశుద్ధమైనఆత్మతేజస్సుతో జీవించాలని తాపత్రయపడ్డాడు. 'ధూళులు సుళ్లుతిరిగే ఒక పెద్ద గాలిదుమారంలో ఒక గోడచాటున తల దాచుకున్న బాటసారిలాంటివాడు రవీంద్రుడు.'

గాంధీ రవీంద్రులలో క్రైస్తవ, గ్రీకు జీవన దృక్పథాలకు ప్రాతినిధ్యం కనిపిస్తుంది. గాంధీజీ ప్రజాస్వామ్యవాది. జన్మతః ప్రజానాయకుడు. దివ్యమైన తన ప్రేమ సిద్ధాంతంతో భారత జాతీయ జీవితాన్ని పూర్తిగా శాసించ గలిగాడు. తరిగిపోని ఓరిమి, సాటిలేని సౌజన్యం, అపూర్వమైన స్వార్థత్యాగం, న్యాయము కొరకు, సత్యముకొరకు ఆత్మార్పణ చేయగల అచంచల దీక్ష - ఇలాంటి ఆదర్శ మానవలక్షణాలను గాంధీజీలో చూస్తాం.

ఆయనలాంటి వ్యక్తిత్వం మానవ చరిత్రలో ఒక అపరూపమైనవిషయం. ఆయనఊహాలో భారత జాతీయత అంటే 'నన్ను ముట్టుకోకు నామాల కాకీ !' అన్నట్టు దూరంగా ఉండటంగాని, ఇతర రాజ్యాలను దురాక్రమణ చేయటంగాని, విధ్వంసంచేయటంగాని కాదు. మానవజాతికోసం ఆత్మార్పణ చేయగలగటానికే భారతదేశం అభ్యున్నతి పొందాలి నిజానికి గాంధీ అచ్చమైన అంతర్జాతీయ వాది. మానవకోటియొక్క గొప్ప నిర్మాణాత్మక శక్తులలో ఆయన ఒకడు. భారత జాతీయ చైతన్యానికి ఆయన చిహ్నం.

గాంధీ రవీంద్రులు ఆదర్శానుగుణంగా జీవితాలు గడిపారు. పాశ్చాత్యనాగరికతకి గాంధీజీ సంపూర్ణ ప్రతికూలుడు. భారత దేశాభ్యుదయం యంత్రశక్తిమీద ఆధార పడివున్న దనే విశ్వాసం గాంధీజీదృష్టిలో వంచనాత్మకమైన ఆశావాదం. యాంత్రిక నాగరికత అనే ఘోరరాక్షసుని బారినించి మానవాత్మ విమోచనం పొందాలని ఆయన కోరుతాడు. సాంఘిక సంస్థలు ముఖ్యంగా సంస్కరింపబడాలనీ, మానవుని మనః కేంద్రం ఆరోగ్యవంతంగా ఉంటే యాంత్రిక శక్తిని లక్ష్యం చేయనవసరములేదనీ రవీంద్రుని వాదం. బూజుపట్టిన సంప్రదాయమన్నా, అవధిలేని ఆత్మోత్కర్ష అన్నా ఆయన కమిత ద్వేషం. ఈమహావ్యక్తు లిద్దరూ భిన్న భిన్న కోణాలనుంచి జీవితసమస్యల్ని చూస్తారు. ఆనందమయ జీవితమూ, ఆత్మవిమోచనమూ వీటిని గురించి గానంచేస్తాడు రవీంద్రుడు. బాధాపరిణామమైన జీవితాన్ని క్రమశిక్షణ చేత తపించి వేయాలని ప్రబోధిస్తాడు గాంధీజీ. ప్రకృతిసిద్ధమైన స్వచ్ఛత రవీంద్రుని కిష్టం. ప్రపంచాన్ని ప్రేమించి ఆనందించే కళాశీలికన్న ధన్యుడు లేడంటా డాయన. లౌకికమైన మంచిచెడ్డలను తూచి విలువలు కట్టడం నేర్పుతాడు గాంధీజీ. దారిద్ర్యాన్నీ, పౌశీల్యాన్నీ ఆయన ఆరాధిస్తాడు. ఈ విధంగా పూర్తిగా విరుద్ధాశయాలు కలవారే అయినా గాంధీ రవీంద్రులు ప్రాచీన భారత విజ్ఞాన మనే ఏకసాధనాన్నే ఆధారంగా తీసుకొనితమతమవ్యక్తిత్వాలునిర్మించుకున్నారు.

జీవితంలోని ఉత్కృష్టానందాన్ని వ్యక్త పరుస్తుంది రవీంద్రుని కవిత్వం. ఆ ఆనందంలో సర్వసాధారణమైన పదార్థాలుకూడా గొప్ప గొప్ప విలువలతో మిలమిల లాడిపోతై. గాఢమైన తన ఆధ్యాత్మికదృక్పథంతో ఆయన పారలౌకిక సౌందర్యాలను సందర్శించి, నిశితమైన, నిర్దిష్టమైన శబ్దజాలంలో పొదివి మన కందిస్తాడు. ఇక వాస్తవికతా సిద్ధాంతి (Realist) గాంధీజీ మనం మన ఆధ్యాత్మిక గమ్యస్థలాన్ని చేరేలోపుగా వేదనతోను, నిరాశతోను కూడిన ఎన్నో ఎడారులను గడువవలసిఉందని హెచ్చరిస్తాడు. బాధా సహనంలోనే ముక్తి ఉన్నదంటాడు. రవీంద్రుడు ఈ బాధాసహనముయొక్క ఫలితము ముక్తి అంటాడు. ఇంద్రియ సంయమనం వలన ఆత్మ స్వతంత్ర మవుతుం దంటాడు గాంధీజీ. రవీంద్రుని ఊహాలో నిజమైన స్వాతంత్ర్యమంటే 'త్వమేవ శరణం మమ' అని సర్వభారమూ భగవదర్పణం చేయటం. స్వయంగా కళాశీలి అయిన రవీంద్రుడు దైనికజీవితంలో సౌందర్యంయొక్క స్థానాన్ని గూర్చిన్నీ, మానవుని ఆత్మ పరిణతి చెందే ప్రక్రియలో సౌందర్యం నిర్వహించే ప్రముఖ పాత్రను గురించిన్నీ చెబుతాడు.

ఇటీవలి చరిత్రలో కోటానుకోట్ల జనం చేత ఒక ప్రక్క మహర్షిగా ఆరాధింప బడుతూ, మరొక ప్రక్క సమర్థుడైన రాజకీయ వేత్తగా ప్రఖ్యాతుడైన వ్యక్తి గాంధీజీ ఒక్కడే. ప్రపంచ చరిత్రలోని మిక్కిలి సమర్థులైన కొద్దిమంది ప్రజా నాయకులలో గాంధీజీ ఒకడని ఈరోజున సర్వేసర్వత్ర అంగీకరించారు. ఆధునిక చరిత్రలో గాంధీజీ అంతగా సమకాలీనులమీద ప్రభావం కలిగి ఉన్న ప్రజానాయకుడు లేడు. అంత అనుచర వర్గంకూడా మరెవ్వరికీ లేదు. పాశ్చాత్య లోకానికి గాంధీజీ బాధాసహిష్ణుతకు చిహ్నమైన సిలువను అర్పిస్తే రవీంద్రుడు విజ్ఞాన కమలాన్ని అంజలి పట్టాడు. "సౌందర్యారాధనకి అంకితం చేసిన స్వీయజీవితంలో రవీంద్రుడు సౌందర్య సౌరభాలను వెదజల్లే ఒక మహాజ్యోతిస్సును కుదించుకుని ఇమిడించుకున్నాడు. పాటలలోను, పద్యాలలోను, కథలలోను, నాటకాలలోను అదే జ్యోతిస్సు యొక్క అనేక కిరణాలను ఆయన మనకు ప్రసాదించాడు. సత్యాన్వేషణానిరతి గాంధీజీజీవితాన్ని ఏ విధంగా ఆవరించుకుని పోయిందో, అదేవిధంగా రవీంద్రుని జీవితాన్ని సౌందర్య పిపాస పరిపాలించింది. ఆ పిపాసయొక్క బాహిరస్వరూపమే శాంతినికేతనం. గాంధీ రవీంద్రులు సూర్య చంద్రుల వలె భారత జీవితాకాశాన్ని జ్యోతిర్మయం చేశారు."

ఒకే హృదయంయొక్క రెండు స్పందనాలు గాంధీ రవీంద్రులు. ఆ హృదయం సనాతనమైన భారతమాత హృదయం. సృష్టి సంతతినీ భగవన్మయంగా దర్శించిన మహత్తరమైన ఉపనిషద్విజ్ఞానానికి ఈ ఇరువురూ సమానంగా ఔరసులు. జీవితాన్నే కళామయం చేసుకున్నాడు గాంధీజీ. కళామూర్తికి జీవం పోశాడు రవీంద్రుడు. గాఢమైన మత విశ్వాసం, దృఢమైన దేశభక్తీ, ప్రవక్తృత్వం -ఈ విషయాలలో ఇద్దరూ సమానులే. ఆచరణలో ఒకరూ, గానంలో మరొకరూ ధర్మసాధన చేశారు. ఒకరు విశేష్యమైతే మరొకరు విశేషణం. ఋగ్వేదయుగం నాటి నుంచీ భారతాత్మలోని ఔత్కృష్ట్య మంతా కరుడు గట్టిన జ్యోతిస్స్వరూపులు గాంధీ రవీంద్రులు.





# వ్యక్తావ్యక్తంలో యుద్ధం



[కథానిక]



= శ్రీ వై. వి. రమణమూర్తి

మాలతికీ, భాస్కరానికీ మొట్టమొదట ఎలా పరిచయమైందో ఎవరికీ జ్ఞాపకంలేదు. పరిచయమైన మొట్టమొదటి రోజుల్లో ఇద్దరూ అనేకవిషయాల్లో భిన్నాభిప్రాయాలు కలిగివుండి తెగవాదించుకునేవారు. అతనికీ పనేమీ లేదు. డబ్బు కావలసినంత వుంది తిని కూర్చోడానికి. మాలతిభర్త ఆఫీసుకి పోగానే దానికీ కావలసినంత తీరిక.

తనకూ నిజంగా మనస్సు వుందనీ, దానికి స్వతంత్రంగా ఆలోచించే శక్తి వుందనీ ఇప్పటివరకూ తెలుసుకోలేని మనుష్యుల్లో భాస్కరం ఒకడు. అతనికెప్పుడూ తన అభిప్రాయాలమీద నమ్మకం లేదు. రాజకీయ విషయాలనుగురించి ఆలోచించడాని కూర్చుని చివరికి గాంధీగారి పటందగ్గిరికెళ్లి ఆయనమీద ఆ భారం వదిలేసి వచ్చి పడుకుంటాడు సుఖంగా. మాలతి అంచేతనే ఇతన్ని వేళాకోళం చేస్తుంది.

మాలతి చదువుకున్న పడుచు. భర్త ఈశ్వర్రావు ఒక ఫరమ్‌లో ఉద్యోగిగా వుంటున్నాడు. ఆస్తికూడా వుంది. భాస్కరం వీళ్ళింటికి వచ్చి పోతూవుండడంతో భాషాప్రయుక్తరాష్ట్రసమస్యదగ్గిర ప్రారంభమైన వీళ్ల యుద్ధంలో కొన్నాళ్ళకు సంధి కుదిరింది. భాస్కరం వాళ్లింటి కొచ్చేటప్పటికి తన నల్లని విశాల నయనాలతో ఆమె స్వాగతం ఇస్తుంది. ఆమెభర్త చిరునవ్వుతో ఆహ్వానిస్తాడు. అందరూ కలిసి కుసాగా కాలాన్ని మరిచిపోయి గడుపుతారు. భాస్కరానికి వాళ్ళ యింట్లోనూ, వాళ్ళ హృదయాల్లోనూ కూడా కావలసినంత చోటు దొరికింది. వాళ్ళ దగ్గిరున్నంతసేపూ స్వర్గధామంలో వున్నట్టు భావిస్తాడు భాస్కరం. అతను మంచి చిత్రకారుడుకూడాను. అతను మాలతిని చూడకుండా ఒక్కక్షణం వుండలేడు. తనకు పనేం లేదుకనక పగలంతా ఈశ్వర్రావు గారింట్లోనే గడుపుతాడు. ఈశ్వర్రావుకూడా భాస్కరాన్నెంతో వెఱ్ఱిగా ప్రేమించాడు. భాస్కరం అంటే అతనికి ప్రాణం. ఒక్కమాటలో చెప్పాలంటే — ఆ ముగ్గురి శరీరాలు మాత్రమే వేరు. మనస్సు ఒకటే.

మాలతంటే తన కెందుకో అంత ప్రేమ. భాస్కరానికి అర్థంకాలేదు. అసలా ప్రేమస్వరూపం ఎలాంటిదో కూడా అతను అవగతం చేసుకోనూలేదు. అందుకు ప్రయత్నించనూ లేదు. మాలతి తనను విపరీతంగా ఆకర్షిస్తుందనిమాత్రమే అతనికి తెలుసు. అది ఎలాంటి ఆకర్షణో అతనికి తెలీదు.

బాగా బారెడు పొద్దెక్కింది. మాలతికి ఇంటి పనుల అడావిడిలో ఇంతవరకూ తలదువ్వుకోడం పడలేదు. ఇప్పుడు తలదువ్వుకుని నీళ్ళుపోసుకుని, చీరకట్టుకుని బీరువాఅద్దంలో తన ప్రతిబింబం చూసుకుంది. మాలతి నిజంగా జగదేకసుందరి. ఆమెప్రతిఅంగంలోనూ తరుణయౌవనం తొణికిసలాడుతోంది. తన అందానికి తనే ముగ్ధురాలైపోయింది. అద్దంలో ప్రతిబింబం చూసుకోగానే ఆమె కొకవిధమైన ఉత్సాహం,

* వ్యక్తావ్యక్తం—Sub-consciousness.

మనోబలం వచ్చినట్టయింది. వదనం ఆనందంతో మెరిసిపోయింది. ఆనందరేఖ లింకా ఆమె పెదవులమీద నాట్యంఆడుతూనేవున్నాయి. "మాలతీ" అన్న పిలుపు విని వెనక్కు తిరిగిచూసింది.

అప్పుడే లేచి కళ్ళు నులుముకొంటూ వచ్చినట్టున్నాడు భాస్కరం! కేర్‌లెస్ (అజాగ్రత్త) గా వదిలేసిన జుట్టూ, అతనూ! తిన్నగా వాళ్ళు పడుకునే పందిరిమంచంమీద కూర్చున్నాడు వెళ్ళి. ఎవరి నోటి నించీ మాటలేదు. ఆమె ఆశ్చర్యంతో మాట్లాడలేకపోతోంది. ఏమంటే ఇంతవరకూ అత నెప్పుడూ ఆ పందిరిమంచంమీద కూర్చోలేదు. ఎన్నోమాట్లు ఈశ్వర్రావు కూర్చోమన్నా కూర్చోనన్నాడు. "వాళ్ళు పడుకునే మంచంమీద నేను కూర్చోకూడదు. తప్పు" అని అతని అభిప్రాయం. అలాంటివా డివేళ ఇలా ప్రవర్తించాడేమిటీ అని ఆమెసందేహం.

"నువ్వు చాలా అందంగా వున్నావు మాలతీ. ఈ గది అంతా బంగారపుగీరానినట్టు ఎలా వుందో చూడు! అలాగే నుంచో ఒక్క క్షణం—" అని తన స్కెచ్చిపుస్తకం తీసి పెన్సిలుతో బొమ్మ రాయడం మొదలెట్టాడు. మాలతికి అతని ప్రవర్తన ఏమీ అర్థం కాలేదు. కాని అక్కణ్ణుంచి కదల్లేకపోయింది. అలాగే నిలబడింది. బొమ్మ గియ్యడం పూర్తయ్యాక భాస్కరం తలెత్తిచూశాడు. మాలతి ధైర్యంచేసిఅడిగింది. "ఏమిటి పొద్దున్నే వచ్చావు?"

"ఏమో. నే వచ్చినపని మరిచిపోయాను......" అంటూనే చెప్పడం ఆపేసి బొమ్మకేసి పరీక్షగా చూడడం ప్రారంభించాడు మళ్ళీ

చేతిలో వున్న రవిక కుర్చీచేతికి వేసికొట్టి చిరాకుగా వున్నట్టు "ష్, అబ్బ! ఎందు కొచ్చావ్ చెప్పుదూ చంపక" అంది మాలతి.

అతను తలెత్తి చూశాడు. "కోపం వచ్చిందా? ఏం చేసినా చెయ్యి. జ్ఞాపకంరావడం లేదు—కాని చూశావా. ఇంతవరకూ ఎప్పుడూ నీ బొమ్మలు గియ్యనే లేదు. చూడు, ఇది నీకు ప్రెజెంట్ చేసా.

"అయితే నీతో కూచోడానికి దొడ్లో పనుంది. జ్ఞాపకంవచ్చినప్పుడు అక్కడికి వచ్చి చెప్పు. నే వెడుతున్నా."

"మాలతీ!"

వెనక్కు తిరిగిచూసింది. భాస్కరం దగ్గరగా వస్తూ అంటున్నాడు. "ఏం లేదు. నిన్ను చూడాలనిపించింది, వచ్చేశాను—మంచిఫలితం ఈస్కెచ్ వేసుకున్నాన........"

మామూలుగానే అనేస్తున్నాడు. "కాని నువ్వు నన్నంతగా ఆకర్షిస్తా వేం మాలతీ? నువ్వంటే ఏమిటో—..."

తన మనస్సులో ఆందోళనంతా కళ్లల్లో చూపిస్తూ మాలతి ఏమీ మాట్లాడలేక నుంచునిపోయింది. వచ్చిన పని మరిచిపోయానంటే ఆమె అంత ఆశ్చర్యపోలేదు. అది అతనికి మామూలే. కాని ఈ ప్రశ్న అతనేవుద్దేశంతో అడుగుతున్నాడు?

"మరీ చిన్నపిల్లాడివై పోతున్నావ్, ఏమి టామాటలు భాస్కరం?" అని గదిమింది. భాస్కరం సూటిగా దాని కళ్లల్లోకి చూశాడు. "నీకలా తోచిందికదూ. సరేలే" అన్నట్టున్నాయి ఆ చూపులు.

"క్షమించు భాస్కరం" అనా లనుకుంది. నోటి చివరికి వచ్చిందికూడాను. ఇంతట్లోకే భాస్కరం గబగబా గుమ్మం దాటిపోయాడు. అతని కళ్లల్లో బాధ కనుపించింది.

"భాస్కరం!" అని కేక వేసింది.

కాని అప్పటికే అతను గుమ్మం దాటిపోయాడు.

ఆ వేళ అతను మళ్లీ వాళ్లింటికి రాలేదు. ఈశ్వర్రావు రెండుమూడుసార్లు ఆఫీసునించి కబురంపేడు "మాలతి కేం తోచదు. కాస్త మా యింటి కెళ్లి కబుర్లు చెప్పకోండి" అని. అయినా అతను రాలేదు.

మర్నాడు పొద్దున్న ఇంకా పెందరాళే భాస్కరం మాలతిగదిలోక్కివచ్చాడు. మాలతి ఇంకా పక్కమీదే పడుకునివుంది, బద్ధకంగా, తలుపు తీసేవుంచి. అతను రావడం చూసి లేచి బీరువాఅద్దంలో చూసుకుని

బొట్టు దిద్దుకుంది. అతను ఆశ్చర్యంతో దానివంక చూస్తో అడిగాడు.

"ఈశ్వరం ఊళ్లో లేడా? ఇంత ఇల్లూ నువ్వొక్కర్తివే కాపలా కాశావా రాత్రంతా?"

"అవును. నిన్న సాయంత్రం వెళ్లారు" అంది వెనక్కి తిరక్కుండానే.

"అరె! నాకు కబురంపకపోయావా? సాయం పడుకుందుకు వచ్చేవాణ్ణే!"

మాలతి వెనక్కి తిరిగింది. దాని పెదవులు వణికిపోతున్నాయి. అతను నిన్న అలా వెళ్లిపోడానికీ అర్థం తెలియలేదు. ఇవేళటి ఈ అకారణదయకూ అర్థం తెలియలేదు దానికి. భాస్కరంముఖంలోమాత్రం ఏమార్పూ లేదు. మాలతిమెదడులో ఏన్నెన్నో ఆలోచనలు పరుగులుతీశాయి. ఒక వందసమాధానా లాలోచించింది. "నీ సహాయం అవసరంలేదు" అందా మనుకుంది. కాని వెంటనే నిన్నటి అతని ముఖం జ్ఞాపకంవచ్చి ఇంత చిన్నవిషయానికే నొప్పించడం ఎందుకనుకుంది. అంచేత తేలిగ్గా, "నాకేం భయమా? ఊరికేనే—ఎందుకని కబురంపలేదు" అనేసింది.

"సరేకాని, ఇవేళకూడా ఇంకోస్కెచ్ వేసుకోడాని కొచ్చాను. ఇంకోపోజులో కొంచెంసేపు నిలబడు."

ఆ అధికారస్వరానికి దానికి కోపం వచ్చి ముఖం కందిపోయింది.

"భాస్కరం, నాకింకేమీ పనుల్లేవనుకున్నావా?"

"అది కాదమ్మా చెల్లాయి—కోపంవస్తే నేనేం చెప్పను? ఎప్పుడూ నీతో మాట్లాడాలనీ, నీదగ్గరే వుండాలనీ వుంటుంది. ఇలాంటి పనేదో చేస్తూ నీదగ్గిరే చాలాసేపు కూచోవాలనిపిస్తుంది, నీ కిష్టంలేదుకదూ. నే వెళ్ళిపోతాలే..." అంటూ లేచాడు. మాలతేమీ మాట్లాళ్లేదు. వెళ్లిపోతున్నాడు. అయినా అదేమీ మాట్లాళ్లేదు.

"చెల్లాయి!" అని అతను చేసిన సంబోధనమీదే వుంది దాని దృష్టంతా. అత నెప్పుడూ దాన్నలా పిలవలేదు—ఆశ్చర్యంకాదూ?

ఇలా ఆలోచించుకుంటూ నూతివగ్గిరికి వెళ్లిపోయింది. కాని చేసే ఏ పనిమీదా దృష్టి నిలవడంలేదు. భాస్కరంరాకకూ మాటకూ అర్థం ఏమిటి? అత నొకరకం పిచ్చిమనిషి అని దానికి తెలుసు. కాని అతని మాటల్లో అర్థంలేకపోలేదని దాని నమ్మకం. తనను అత నెలా ప్రేమిస్తున్నాడు? చెల్లెలిగానా—లేక.

బహుశా తనమీద అతనికి మరోభావమే వుందేమో. తనంత అందకత్తె ఎక్కడా వుండదని చూసినవాళ్లంతా వప్పుకుతీరతారు—తన అందం చూసి అతను కామించడం లేదుగదా— చూసే దానికి జాలి పుట్టుకొస్తోంది.

"అబ్బ! ఎంత గడిబిడి చేశావు పదిరోజులు—నాలుగురోజులు నువ్వసలు బతకవనుకున్నాం. ఎంతపని చేశావు! జరం వొచ్చినసంగతి నాదగ్గిర దాచాలనుకున్నావా? కబురుచెయ్యకూడదేం?" అని కళ్లంట నీళ్లెట్టుకుంది మాలతి.

భాస్కరం ఇంకా నీరసంగానే వున్నాడు. తన మంచంమీదే కూచునివున్న మాలతిముఖం చూసి అతనికీ ఏడుపు పాగిందికాదు.

"మాలతీ, నేనంటే నీకు కోపం వొచ్చింది కామూ?"

మాలతి బావురుమని ఏడవకపోయినా అంతపనీ చేసింది. భాస్కరాని కెవరూ లేరని అది ఈమధ్యనే తెలుసుకుంది. భాస్కరం జ్వరంతో పడిపోయిన రెండురోజులకు ఆసంగతి తెలిసి ఈశ్వరం తీసుకొచ్చాడు. ఈ పదిరోజులూ మాలతే అతనికి సేవచేసి, చెల్లెల్లాగ కాపాడింది. వాడి నిస్సహాయత్వం చూసి దానికి జాలేసింది. వాడి జుట్టు సవరిస్తో "ఎందుకొప్పడతాను? నువ్వంటే నాకు ఎంత ప్రేమో తెలుసా" అంది కన్నీరు తుడుచుకుంటూ.

వాళ్లిద్దరూ తన కంఠగా సేవచేసినందుకు కృతజ్ఞత తెల్పాడు భాస్కరం.

ఒకనాడు మాలతి ఒంటరిగా నూతిదగ్గర నీళ్లు తోడుతోంది. భాస్కరం వచ్చాడు. ఇద్దరూ ఏవేవో మాట్లాడుకున్నారు.

“నీ కీఒంటరితనం దుర్భరమనిపించడం లేదూ భాస్కరం ?” అంది.

“ఏం చెయ్యమంటావు మాలతీ......” అతను మరి మాట్లాళ్లేదు.

ఈ ఎదురుప్రశ్నలో ఎంతో హృదయవేదన వుందనీ, ఎంతో బాధాయుతమైన అతని జీవితగాథ నిక్షిప్తమైవుందనీ మాలతి గ్రహించింది. జాలిగా నిట్టూర్చింది.

“నాగొడవ కేంగాని, మాలతీ, మా డు-నీబొమ్మలు పూర్తిచేసి తెచ్చా. చూడు ఎంత అందంగా వున్నాయో ఈపోజుల్లో—ఇవి నీకు ఇస్తున్నా. పుచ్చుకుంటావు కాదూ వద్దనకండా. ?”

“ఎందుకు వద్దంటాను భాస్కరం ?”

*

చాలా రాత్రయింది. శరత్కాలచంద్రుడి కిరణాలు డాబామెట్లపక్క అనుకునివున్న రాధామనోహరపుతీగల సందుల్లోంచి మెట్లమీద పడుతున్నాయి. భాస్కరం డాబా ఎక్కబోతూ ఆ వెన్నెల్లో పాలగచ్చులా మెరిసే ఆ మెట్లదగ్గర ఒక్క క్షణం నుంచునిపోయాడు. అతను కళారాధకుడు. అందమైన ప్రతీ విషయం అతణ్ణి ఆకర్షిస్తుంది. ఇంతలో “భాస్కరం!” అన్న కేక.

ఎదురుగా గుమ్మం దిగి మెట్లదగ్గిరికి శరల్లక్ష్మిలా వస్తున్న మాలతి! అతను ఆశ్చర్యపోయాడు. “మాలతి ...ఇంతరాత్రివేళ...ఇక్కడికా !” అనుకున్నాడు.

ఆ సమయంలో మాలతి అతని కళ్లకు ఎంతో అందంగా కనుపించింది. ఆమె కట్టుకున్న చీరా, తొడిగిన రవికా, అలంకరించుకున్న విధానం—ఆ రంగుల వివరాలు—అతని కంఠగా గుర్తులేవు. కాని సమగ్రమైన సౌందర్యదేవత అతని ముందు నుంచున్నట్టు భావించాడు. మాలతి ఉత్సాహంతో ఒక్కపరుగులో వచ్చేసింది మెట్లదగ్గరకి. భాస్కరంచేతులు పట్టుకుని “నీకోసమే వచ్చా” అంది.

“మాలతీ...నువ్వు...ఇంతరాత్రివేళ...”

“ఆ! నేనే—రేపు నా పుట్టినరోజు. డిన్నర్ పార్టీకి రావాలి నువ్వు—రేపు స్వయంగా పిలవడానికి తీరిక కాదని ఇప్పుడే వచ్చాను. రేపు నా స్నేహితురాళ్లు కొందరు వస్తారు. వాళ్లతో మాటల్లో ఓడిపోవడానికి సిద్ధంగా వుండాలి నువ్వు...”

“ఇప్పుడు ఈశ్వరం నిన్నెలా రానిచ్చాడు ?... రానిచ్చాడా ?”

“వెళ్లొద్దనే అన్నారు. కాని నేనే వచ్చేశాను”

ఒక్కసారిగా ఆలోచనలో పడిపోయి—

“వెళ్లొద్దన్నాడా-అలాగా-అయితే నువ్వెందుకొచ్చావు ?”

“అబ్బ! దాని కేంగాని, నువ్వొస్తావుకదూ.” విలాసంగా అతని చేతులు పట్టుకు లాక్కెడుతోంది. మెట్లదగ్గర్నుంచి అయిదారుగజాలు నడిచాడు పరధ్యాన్నంగానే. హఠాత్తుగా ఆగిపోయి మాలతి రెండు చేతులూ పట్టుకున్నాడు ఉద్వేగంతో వణికిపోతూ...

“మాలతీ—నిన్ను ప్రేమిస్తున్నాను.”అన్నాడు.

భాస్కరానికూడా ప్రేమంటే తెలుసా ? మాలతి తన చేతులు విడిపించుకోబోయింది. అతను దీనంగా అడిగాడు.

“మాలతీ, నన్ను ప్రేమించడం లేదా ?

“ఛీ! నన్ను వొదులు...” విడిపించుకుని మాలతి గబగబా వీథిలోకి వచ్చేసింది. ఆమెహృదయం సంక్షుభితమైపోయివుంది. భయంతో వణికిపోతూ ఇంటివైపు పరుగెత్తింది. ఆ సమయంలో భాస్కరం అన్న మాటల్ని ఆది మరిచిపోలేదు.

“ఎందుకలా భయపడతావ్? నేనేం రాక్షసుణ్ణా—అయితే వెళ్లవచ్చు. వెళ్లు.”

తిన్నగా తన పడకగదిలో మంచంమీద కళ్లిబోర్లా పడుకుని ఏడవడం మొదలెట్టింది. అవతలగదిలో

బ్రిటన్‌లోని ఆంగ్లేయులు తేనీటిని మొదటిసారి రుచి చూచినది 17-వ శతాబ్దములో. అప్పటినుండి ప్రపంచమం దెల్ల చోట్ల నుండు ఆంగ్లేయులు తేనీటిని తమకు ప్రియమైన పానీయముగా భావించుచున్నారు. బ్రూక్ బాండ్ టీ తాజాగా కమ్మని వాసనగలిగి యుండుటచే భారతదేశములో చాల మట్టుకు అందరి ఇండ్లలో ఉపయోగింపబడుచున్నది.






# బ్రూక్ బాండ్

రెండాకులు ఒక మొగ్గ.




"తాత్కాలికంగా ఉపశమనము కలిగించే మందులను వాడడం చాలా వెఱ్ఱితనం."

అప్పటికప్పుడు వెంటనే గుణ మిచ్చుటయే గాక, ఉబ్బస వ్యాధియొక్క మూలకారణములను రూపుమాపి శాశ్వతంగా నయము చేయునది పురోహిత్ వారి శ్వాసహరి మాత్రమే. శ్వాసహరిని వాడుట ప్రారంభించిన వెంటనే, దగ్గుపోయి, శ్వాస ధారాళమగుటయే గాక, జీర్ణకోశము, ఊపిరితిత్తులు క్రమేణ బలపడి, ఉబ్బసము పూర్తిగా తగ్గిపోవును.

ఉబ్బసము, ఊపిరి సలుపకుండుట, నడుమునొప్పి, గొంతుకలో నసకలిగించు దగ్గు, మొదలగు గుండెజబ్బులకు శ్వాసహరి (నీలిరంగుప్యాకెట్టు)ను వాడుడు. మలబద్ధకము, పులితేపులు, వీటితో బాధపడు ఉబ్బస వ్యాధిగ్రస్తులగువారు శ్వాసహరి కాంపౌండు (ఎరుపు రంగు ప్యాకెట్టు)ను వాడుడు.

అందరు కెమిస్టులవద్దను, 3, 6, 12 ఔన్సులు సైజులలో 3-6-0, 5-12-0, 10-0-0లు ధరలుగలిగినవి లభించును

మద్రాసు స్టాకిస్టులు:
మెస్సర్సు: అప్పా & కో, చైనా బజార్ రోడ్,
శ్రీ క్రిష్ణన్ బ్రదర్స్, తంబుచెట్టివీధి,
,, అమృత రత్నాకర ఫార్మసీ, గోవిందప్ప నాయక్ వీధి.
,, పండాలిక్ & కో, హైదరాబాదు, సికిందరాబాదు.

తయారుచేయువారు
పురోహిత్ ఫార్మసీ
కొల్హాపూరు.

**SHWAS-HARI**

స్వర్ణోత్సవ - ఆగమనసందర్భంలో

VAIDYARATNA PANDIT D. GOPALACHARLU'S
JEEVAMRUTHAM
THE BEST NERVINE TONIC

పండిత డి. గోపాలాచార్యులవారి
# జీవామృతము

ఏబదియేండ్లుగా ప్రజాలోకమునకు అమూల్య సేవజేయుచు, ప్రజల ఆరోగ్యమును పెంపొందించుచు, ఆనంద సంతృప్తులను కల్గించి, ప్రజానురంజకమైనదని వెల్లడించుటకు గర్వించుచున్నాము.

ఆయుర్వేదాశ్రమం, లిమిటెడ్
టి-నగర్... మద్రాసు.

ఈశ్వరం ఇంకా ఏదో రాసుకుంటూనే వున్నాడు. దాని కన్నీళ్లతో దిండు అంతా తడిసిపోయింది. ఓదార్చేవా రెవరూ లేకపోవడంచేత కొంత ఉద్వేగం తగ్గి కాస్సేపటికి మాలతి తలెత్తిచూసింది. రేగిపోయిన జుట్టు; చెమటకి చెరిగిపోయినబొట్టు! తనదేనా అద్దంలో ప్రతిబింబం? భాస్కరం తనకు అవమానం చేశా డనుకుంది కొంతసేపు. కాని ఎంత వెఱ్ఱివాడైనా అతనికిమాత్రం హృదయం లేదా? ఇతరమానవుల ప్రేమని కోరడా? మానవహృదయాలను మథించివేసే మహత్తరకార్యాల నిలాంటివాళ్లే ఒకొక్కసారి చేస్తారు—అనుకుంది.

;రం వచ్చి పలకరించాడు.

"ఏడుస్తా వేం మాలతీ..."

ఏం చెప్తుంది? కన్నీళ్లు తుడుచుకుంది...తడబడుతూ...ఈశ్వరంకూడా నుచ్చి అడగనూలేదు. ఇది కొంత విచిత్రంగానే వుంది.

మర్నాడు తెల్లారకట్ల లేచి మేడకిటికీతలుపు తెరిచేసరికి ఆ మసకచీకట్లో భాస్కరం ఇంటిముందు బండీ, అందులో సామాను వేస్తోన్న నౌకరూ కనిపించారు. మాలతిప్రాణం తల్లడిల్లిపోయింది. భాస్కరం ఎక్కడికో వెళ్లిపోతున్నాడు. నిన్నరాత్రి తనకూ వచ్చేసింది—భాస్కరాన్ని విడిచి ఒకరో జుండలేదు అది ఈ ఏడాదినించీ.

"సంగతేమిటో కనుక్కొనివస్తారా?" అని ఈశ్వరా న్నడిగింది. "ఏముంది, ఎక్కడికో వెళ్తున్నట్టున్నాడు. వాడే తిరిగొస్తాడు" అన్నాడు తనపని చూసుకుంటూనే ముభావంగా.

"అయితే నేనే వెడతాలెండి"

"మాలతీ, ఆగు, వీల్లేదు. నువ్వెళ్లడానికి వల్ల కాదు."

ఈశ్వరం రుద్రరూపం దాల్చి ఇలా ఆదేశించాడు. మాలతి కొంచెం భయపడింది. అప్రయత్నంగా దానికి ఏడుపొచ్చేసింది. భాస్కరాన్ని ఇంక చూడననీ, భర్తకోపం చూసీ, తలొంచుకు నిలబడింది. రెండు నిమిషా లెవరూ మాట్లాళ్లేదు.

"నీ కన్నీళ్లు అందరి కన్నీళ్లలాంటివి కావు—వెళ్లు మాలతీ—వెళ్లు—నేనడ్డగించను...నీ పుట్టినరోజునాడు నీకు కష్టం కల్గించను. వెళ్ళు మాలతీ..." అన్నాడు మళ్లీ ఈశ్వరం.

బెదురుతోన్న కళ్ళతో, సందేహంతో అతని కళ్లల్లోకి చూస్తూ కదలకుండా నుంచుంది మాలతి. అది చూసి అత నన్నాడు:

"వెళ్ళు మాలతీ. ఆలస్యంచేస్తే వాడు వెళ్ళిపోతాడు—ఒకమాట—వాడు నీకిచ్చిన పటాలు తిరిగి ఇచ్చెయ్యి. పట్టుకెళ్లు—ఊఁ. నిన్నరాత్రి జరిగిందంతా నేను చూశాను. అయినా ఆ పటాలు అట్టేపెట్టుకోడం మంచిదికాదు."

అంటూ అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు ఈశ్వరం.

మాలతి భాస్కరంగదిలో కాలుపెట్టేసరికి—అతను ఈశ్వరంఫోటోను కిందపారేసి ఒద్దులుకొట్టి కాళ్ళతో తొక్కుతూండడం చూసేసరికి దానికి ఎదురురొమ్ముమీద కుంపటిపెట్టిన ట్టయింది. ఏడవడం మొదలెట్టింది. ప్రాణస్నేహితుణ్ణి కాళ్ళతో గౌరవిస్తున్నాడు!!!

"భాస్కరం, ఆఫోటోకాదు. ఇలా రా. ఇదిగో నా మంగళసూత్రం నీకాళ్ళకింద నలిపిపారెయ్యి. నీకసి తీరుతుందేమో."

ఏడుపు దిగమింగి, శాంతంగా-గద్గదస్వరంతో ఈమాటలంది. తేజస్వంతం, గంభీరం అయిన ఆముఖం కేసి అతను చూడలేకపోయాడు.

"క్షమించు మాలతీ......

"మాలతీ, మళ్లీ వచ్చావేం? ఎలా వచ్చావు?"

మాలతి తన రెండుచేతుల్లోనూ ముఖం దాచుకుని ఏడవడం మొదలెట్టింది. "నిన్ను చూడకుండా ఒక్కరో జుండలేను భాస్కరం. నువ్వెళ్లిపోతే ఎలా-నిన్నరాత్రి నాప్రవర్తనవల్లేనా నువ్వీవూరు విడిచి పోతూంట?- వెళ్ళకు, ఇక్కడికి వస్తోంటే ఆయన సెలాకేకలేశారనుకున్నావు! నిన్నరాత్రి నువు చేసినపని ఆయన చూశారు. నావెనకాలే వచ్చి. అమ్మో!"

అని ఏడ్వడం మొదలెట్టింది. మాలతి ఏడిస్తే కూడా అందంగానే వుంటుంది. "నన్ను పెళ్ళొద్దనా నీకోరిక? నే నెక్కడవున్నా నీక్షేమం తెలుసుకుంటూనే వుంటాను మాలతీ— నిన్ను ప్రేమిస్తూనేవుంటాను—"

"అక్కర్లేదు. నా కేం చెప్పక్కర్లేదు. నన్ను గురించి మళ్ళీ తలచకుండానే వుండు. అదే మంచిది. ఏమంటే, నీసన్నిధిసుఖం కోల్పోయిన నేను— ఆ సుఖాన్ని గురించిన జ్ఞాపకాలతో తృప్తిపడమంటే పడలేను." అంది నిరాశగా.

గెడ్డం పట్టుకుని బుజ్జగిస్తూ అన్నాడు. "ఈశ్వరం ఈర్ష్యపడుతున్నాడు కాదూ—కోపం తెచ్చుకున్నాడేం? అయితే నే నెందుకీవూరు విడిచిపోవాలి? నే పోనే పోను— నువ్వింటి కెళ్ళు మాలతీ......"

ఈ మాట లనేటప్పు డతని ముఖంలో ఈర్ష్య, కుటిలత్వం ప్రస్ఫుటంఅవుతున్నాయి. మాలతి వాటిని గ్రహించింది. ఉత్తరక్షణంలో అవి ఆముఖంలో లేక పోవడంకూడా చూసింది. కాని భాస్కరంమన స్సేలాగ పనిచేస్తోందో ఏమీ తెలుసుకోలేకపోయింది. భాస్కరంలో ఈ మార్పుకు కారణం తను ఈశ్వరంసంగతి చెప్పడమే. "ఎంత తెలివితక్కువగా ఏడుస్తూ అదంతా చెప్పేశాను!" అనుకుంది.

"నిన్నటి నాప్రవర్తనకు క్షమించు భాస్కరం. నాహృదయం కలిగిపోయివుంది—
చేసుకోనీ. అయితే నువ్వు వెళ్ళవుకదూ—

"వెళ్ళను. కాని మాలతీ, ఒక్కటి మాత్రం జ్ఞాపకం పెట్టుకో. నేను నీపాదాలదగ్గిర ప్రేమభిక్షార్థినై వుండను. నిజానికి నిన్ను నేను ప్రేమించడం లేదు. కాని ఏదో నే నెరగని నాలోని కోరిక నవ్వంటే అభిమానించేటట్టు చేస్తుంది. విన్నావా మాలతీ" రోషంతో అన్నాడీమాటలు.

మాలతి జాలిగా, స్నేహంగా అడిగింది: "అయితే పాపం నన్ను ప్రేమించడం లేదన్నమాట ?"

"అవును. కాని నువ్వెందుకు వచ్చావిప్పుడు?" అన్నాడు ప్రశాంతముఖంతో.

"ఏం లేదు. వెళ్ళిపోతున్నావంటేను—"

"వద్దని చెప్పడానికే వచ్చావా ?"

ఎంత అహంభావం? మాలతి ఆశ్చర్యపోయింది.

"కాదు- సాగనంపడానికే వచ్చాను. నిన్ను చూస్తే జాలేస్తుంది భాస్కరం. వెఱ్ఱివెఱ్ఱివేషా లెయ్యక ఉండు— రా మా యింటికి—"

ఈమాటలు అని మాలతి తిరిగి వెళ్ళిపోయింది. దాని కాళ్లు తడబడుతూండడం భాస్కరం గ్రహించాడు. అది వెళ్ళేటప్పు డతనిలా అన్నాడు:

"నన్ను గురించి జాలిపడొద్దు మాలతీ. కాని ఎన్నడూ నేనంటే నీకు కోపం రాకుండావుండాలని ప్రార్థిస్తాను. చాలా తప్పులు చేసివుంటాను. వాటిని క్షమించే విశాలహృదయం నీది...."

ఇవన్నీ మాలతికి బహుశా వినపడివుండవు.

నౌకరు బండిలోసామాను తెచ్చి ఇంట్లో పెట్టాడు.

మాలతిమాత్రం భాస్కరంప్రవర్తనకు అర్థం ఆలోచిస్తూనే కాళ్లుతడబడుతూ వెళ్ళింది.

ఈశ్వరం రావే వెళ్లి భాస్కరాన్ని భోజనానికి తీసుకొచ్చాడు బలవంతం చేసి. మాలతి ఇవేళ ఇరవై ఒకటోఏట పాదంపెట్టింది. మధ్యాహ్నం తాను ఊరికి వెడుతూ భాస్కరాన్ని రాత్రికి అక్కడే పడుకోమని చెప్పిపోయాడు ఈశ్వరం. ఆవేళ పగలల్లా మాలతిని పలకరించడానికూడా ప్రయత్నించలేదు భాస్కరం. రాత్రి భోజనందగ్గిర మాలతి అంది:

"అన్నంకూడా సరిగ్గా తినవేం? నిన్నుచూస్తే జాలేస్తుంది."

"అలాంటిది అనవసరం"అన్నాడు కరుగ్గా.

మాలతి నవ్వింది కిలకిలా.

"నువ్వు నన్ను ప్రేమిస్తున్నా ననుకుంటున్నావేమో—నీఅభిప్రాయం ఎప్పుడూ సరైన పాపాన పోలేదు...".

"నాస్థితి నీకు వేళాకోళంగా కనిపిస్తోందికదూ మాలతీ."

మాలతికి కళ్లనీళ్ల పర్యంతం అయింది. ఒక్కొక్క సారి ఒక చిన్నమాట చాలు మనస్సుకు సూటిగా తగిలి ఏడ్పు తెప్పించడానికి.

"క్షమించు భాస్కరం, నాకు మాత్రం హృదయం లేదా?"

*    *    *

మాలతి ఆరాత్రి నిర్మలంగా ఆలోచించడం మొదలెట్టింది. తను ఈ పరిస్థితుల్లో ఏం చెయ్యాలి—దానికి భాస్కరంమీద వున్న ప్రేమ స్వచ్ఛమైన సోదరీప్రేమ. తనను ప్రేమించే హృదయం, తనను గురించి జాగ్రత్తతీసుకునే మనిషీ లేకుండా భాస్కరం ఎలా జీవితం గడుపుతాడు? తను కోపగిస్తే—అతను పాపం అమాయకుడు—ఇంతకూ తన్నెలాగ ప్రేమిస్తున్నాడు? తనను చెల్లాయిలా చూడ్డంలేదా? తనను కామిస్తున్నాడా?

ఈ ఆలోచన కలిగేసరికల్లా—అసహ్యంతో, భయంతో, ఇంకా ఎన్నిటితోనో దాని వొళ్లు జలదరించింది. "ఛీ—భాస్కరం నాఅన్నయ్య" అనుకుంది.

"తమని అందరూ ప్రేమించాలి అని స్త్రీలు ఉబలాట పడతారు. తీరా ఇలాంటి సమస్యల్లోనో—లేక విసుగులోనో—పడతారు. నా కీస్థితి తప్పించవా భగవాన్—"

బోర్లా పడుకుని ఏడవడం ప్రారంభించింది.

"మాలతీ, ఏడుస్తున్నావా?"

మాలతి వెంటనే మంచంమీద లేచి కూర్చుంది. ఆ కూర్చోడంలోకూడా కళారాధకుడైన అతను విలాసాన్నే చూడగలిగాడు.

గదిగోడలకు నీలిరంగు. గదిలో బల్బు నీలిరంగుది—ఆరంగులో ఆమె తెల్లనిశరీరం, తెల్లనిదుస్తులు, అందం, నవతారుణ్యం — ఎవరినైనా మోహపరవశులను చేసి మత్తెక్కించితీరతాయి.

"నువ్వు చాలా అందంగా వున్నావు మాలతీ. నీ నవ్వువెలుగులో నే నీప్రపంచాన్నే మరిచిపోతాను. నీఅందాన్ని నాకళ్లతో తాగేస్తాను. నిత్యం ఈ నీ రూపం నాకళ్లముందు నాట్యం చేస్తూంటే ఎంత హాయి!" అంటున్నాడు భాస్కరం.

మాలతిముఖంలో నిశ్చలత్వం అధిష్ఠించింది. నిశ్చలంగా, నెమ్మదిగా నిశ్చయించుకుని, ఆ నిశ్శబ్ద వాతావరణాన్ని భంగపరుస్తూ ఇలా అంది:

"భాస్కరం! నేనూ నిన్ను ప్రేమిస్తున్నాను."

ఆమెకంఠంలో గద్గదిక ఇంకా పోలేదు.

మరొకరైతే—ఆ అర్ధరాత్రివేళలో ఒంటరిగా వున్న మాలతిఅంతటిసౌందర్యఖని "నిన్ను ప్రేమిస్తున్నా"నంటే దగ్గరికి ఒక్కదూకు దూకి దాని గులాబీ పెదవులమీద ముద్దులవర్షం కురిపించేవారే—

కాని భాస్కరం మాట్లాడకుండా తన గదిలోకి తిరిగివెళ్లిపోయాడు...మాలతి ఆశ్చర్యంతో అలాగే కూచుంది.

!"

ఆ అర్ధరాత్రివేళ నాగొంతుక అలా వినిపిస్తుందని అది కల్లోకూడా వూహించివుండదు—తలుపు తీసి దుఃఖం పట్టలేక నన్ను గట్టిగా కౌగిలించుకుని ఏడవడం మొదలెట్టింది. ఎంత సున్నితహృదయం దానిది! జీవితంలో దానికింకా ప్రేమించతగ్గవాళ్లెవరేనా వుంటే అది నేనే. తన కష్టాలు, సమస్యలు, జీవితంలో ఒడుదుడుకులు నాతోకాక ఎవరితో చెప్పుకుంటుంది? పురుషు లెవ్వరికీ దానర్థంచేసుకునే శక్తి లేదు. ఉండదు. ఈసంగతంతా పూసగుచ్చినట్టు చెప్పింది.

"నీ సలహా ఏమిటి చెల్లీ? నాకంటే నువ్వేంతో జ్ఞానం కలదానవు. బోలెడు చదివావు. ఈవిషయంలో మీఅక్కయ్యకు కొంచెం సహాయం చెయ్యవూ?"

"నిజంగా చదువుకున్నవాళ్లంత హృదయవిహీనులూ, ఆకారహితులూ లేరు జీవితంలో. మానవ విజ్ఞానంలో ఉన్నతపథాల నందుకుందామని ఎవరికీ ఉండదు కుట్రచేద్దామనేకాని. వాళ్లనిండా కుళ్లు, ఈర్ష్య ఉంటాయి. మానవత్వం ఉండదు వాళ్లల్లో. అక్కయ్యకు వున్న విశాలహృదయం నాకు లేక పోయింది. వెంటనే "భాస్కరాన్ని మన గదిలో

తొక్కనివ్వకు" అని నా అమూల్యమైన సలహా యిచ్చాను.

"నిజంగా అలా చేసి నీఅక్కయ్య ఇంకా బతికుంటుందిటే పిచ్చిపిల్లా?"

ఆమాటల్లో, అది అనేటప్పుడు దాని కళల కంపులో ఎంత దృఢనిశ్చితాభిప్రాయం వుంది!!!

"తనని ప్రేమించే ప్రాణి లేక నిత్యం అతని హృదయం పడే బాధను నేనుమాత్రమే వూహించగలను. నీ కెలా తెలుస్తుందే చెల్లాయి?"

నిజమే. నా కెలా తెలుస్తుంది? చెప్పినా అర్థం చేసుకోలేనేమోకూడా.

మర్నాడు పొద్దున్నే మాబావొచ్చాడు. భాస్కరం అలా వీధులో కెళ్లి పదిగంటలకల్లా తిరిగి వచ్చేసరికి—వాళ్లు కలిసి తీయించుకున్న ఫొటోలని ఫ్రేముల్లోంచి తీసేస్తూ కూర్చున్నాడు మాబావ. అక్కయ్య చూసిం దది.

"అంతబాధగా వుంటే పగలగొట్టరాదూ" అంది.

"పగలగొట్టడంకూడా ఎందుకూ, అద్దంకూడా పాడు." గంభీరంగా, వెనక్కి తిరగకుండానే జవాబిచ్చాడు మాబావ.

"పిచ్చాళ్లు చేస్తా రాపని—కోపం తీర్చుకోడాని కది మార్గం కానేకాదు" అనికూడా అన్నాడు. అప్పుడే వచ్చి గుమ్మందగ్గిర నిలబడ్డ భాస్కరాన్ని బావ చూడకుండానే ఈమాట లన్నాడు. భాస్కరం బుర్ర తిరిగిపోయింది. తల రెండుచేతుల్తోనూ పట్టుకుని వెళ్లిమంచంమీద తెలివితప్పి పడిపోయాడు.

నేనూ, అక్కయ్యా ఎన్నో ఉపచారాలు చేశాక అతనికి తెలివొచ్చింది. సాయంత్రం భాస్కరం ఎక్కడికో వెళ్లిపోతానని ప్రయాణం కట్టేడు. వెంటనే మాబావ—"మాలతీ, ఆ నీపటాలు అతని కిచ్చెయ్యి" అన్నాడు. మాలతి దీనంగా చూసింది. బావకూడా ఆశ్చే బలవంతం చెయ్యలేదు. భాస్కరం వెళ్లిపోయాడు.

నాలుగురోజులు పోయాక అక్కయ్యకు వచ్చిన కవరొకటి బావ విప్పి చదివాడు. చదివేకొద్దీ అతని ముఖం వికృతాకారం చెందడం ప్రక్కనే వున్న నేను గ్రహించాను. అది నాచేతి కిచ్చి చెప్పాడు.

"పద్మా, మీఅక్కయ్య కియ్యి ఈవుత్తరం. చింపి చదివినందుకు క్షమాపణ అడిగాననికూడా అడుగేం." ఇలా అని, ఒక్కక్షణం నంచోకుండా డ్రాయింగురూముకు వెళ్లిపోయాడు.

చదివీచదవడంతోనే మాలతి నిలువునా కూలబడిపోయింది.

"ప్రియమైన మాలతీ,

ఈశ్వరానికి తెలియకుండా మనం కలకత్తా వెళ్లిపోదాం. అక్కడ ఏర్పాట్లన్నీ చేస్తున్నా—వస్తాను—నాతో వస్తావుకదూ—నన్ను ప్రేమిస్తావుకదూ!

నీభాస్కరం."

అప్పటినుంచీ బావ దానితో ముభావంగా ఉంటూవచ్చాడు. మానసికవ్యథతో అది మంచం ఎక్కింది. అంచేత నాప్రయాణం వాయిదాపడింది.

సాయంత్రం తలంటి నీళ్ళుపోసుకుని జుట్టు ఆరబెట్టుకుంటున్నాను, డాబామీద ఇటూఅటూ తిరుగుతూ. పౌర్ణమిచంద్రుడు మెల్లిమెల్లిగా పైకి లేస్తున్నాడు. నామెదడునిండా ఎన్నో ఆలోచన లున్నాయేమో, రెండుమాట్లు పిలిచినా పలకకపోవడంవల్ల బావ మెల్లిగా దగ్గరకు వచ్చి బుజంమీద చెయ్యేశాడు.

"మాట్లాడవేం పద్మా. అక్కయ్యకు మళ్లీ జ్వరం వచ్చేసింది. చూశావా?"

"అగ! ఇవేళేగా పత్యం పెట్టాం—అందుకనే తీరిక దొరికి కాస్త తలంటి నీళ్ళుపోసుకున్నానా యె—

"ఏం బావా. అక్కయ్యను క్షమించవూ. అ దేమీ ఎరగదు బావా. అనవసరంగా వ్యథపడుతోంది. అలా దాని మనస్సు కష్టపెట్టడం నీకుమాత్రం మంచిదా బావా?"—దీనంగా బతిమాలినట్లు అడిగాను.

"దానిమీద నాకేం కోపం లేదు పద్మా. దాన్ని నే ప్రేమించినంతగా ఎవరూ ప్రేమించరు. కాని భాస్కరాన్ని గురించే......దాని సుఖంకోసం ఏదైనా త్యాగం చేస్తా పద్మా."

"పద్మా" అన్న అక్కయ్యపిలుపు వినపడే దాకా ఇద్దరం అలాగే నిలబడివున్నాం. గబగబా మేడ దిగి వెళ్ళాను......

మర్నాడు అక్కయ్యకు జబ్బు మరీ ఎక్కువైంది. బతకదేమో అన్నంతవరకూ వచ్చింది.

ఆ సమయంలో భాస్కరం ఊడిపడ్డాడెక్కణ్ణుంచో. సంగతి విని కళ్ళనీళ్లు పెట్టుకున్నాడు. వెంటనే వెళ్లి మంచంమీద కూర్చుని కన్నీళ్ళతో "మాలతీ—నే వచ్చాను—ఇలా చూడు..."

భాస్కరాన్ని డాబామీదికి తీసుకెళ్లాను. నాకు ఏడుపు, కోపం ఆగడంలేదు.

"ఛీ! నీముఖం చూడకూడదు. నీవల్లే ఇదంతా జరిగింది. మా అక్కయ్య చచ్చిపోతే నీకు సంతోషం కాబోలేం?" అన్నాను.

భాస్కరం ఏమీ సమాధానం చెప్పలేదుకాని ఏడుస్తున్నాడు—అదే సమాధానం నాప్రశ్నకు అన్నట్టు.

"పండంటి కాపరంలో నిప్పులుపోశావేం—మాబావ అలా అనుమానపడ్డాడంతే, ఇది ఇలా మంచం ఎక్కింది! నీకు దయలేదూ— నువ్వు మళ్లీ మాయింటికి రాకుండా వెళ్లిపో—" ఇంకా ఏమేమో అనేస్తున్నాను కోపంలో ఏడుస్తూ.

భాస్కరంకళ్లల్లో నీళ్లు ఇగిరిపోయాయి. మార్పు ముఖంలో స్పష్టంగా కనిపించింది. మర్నాడు అక్కయ్య బతుకుతుందని మాకెవ్వరికీ నమ్మకంలేదు. అంత్యసందేశా లివ్వడం మొదలెట్టింది. చావు తెలివన్నారు అందరూ. నన్ను 'చెల్లీ' అని కౌగిలించుకుని ఏడిచింది.

"నే నెలాగా చచ్చిపోతాను. చచ్చిపోయే ముందు ఒక్క సందేహం తీర్చుకు మరీ పోతాను" అని-

"భాస్కరం! నీమాలతి ఇక వుండదు—ఆఖరుసారిగా నన్నొకసారి—నా నుదురు ముద్దు పెట్టుకుంటావా? మనశ్శాంతితో చచ్చిపోతాను." అంది.

ఈ వింతకోర్కకు అందరం ఆశ్చర్యపోయాం. భాస్కరం మాఅందరి ముఖాలకేసీ పరీక్షగా చూశాడు. తల దించేసుకుని ఏడుస్తూ అక్కణ్ణుంచి లేచి వెడుతున్నాడు.

"ఆరు, భాస్కరం — మాలతి ఆఖరు కోర్క తీర్చకుండానే వెళ్తున్నావా?" మాబావే అన్నాడిలాగ—అవును బావే—

భాస్కరం ఆగలేదు. బావకూడా ఆ గది లోంచి లేచి అవతలికి వెళ్లిపోయాడు. బావ చాలా కలవరపడినట్టు కన్పించాడు—చాలా కలవరపడ్డాడు.

ఒకవంక చావుబతుకులమీద వున్న అక్కయ్య-మరొకవైపు బావ కోపం. నేను దుఃఖం ఆపుకోలేకపోయాను. అరగంట అలాగే కూచున్నాను. గట్టిగా ఏడ్చెయ్యాలని వుంది. కాని ఇంట్లో అన్నింటికీ పెద్దని నేనే అయిపోయాను. భాస్కరంకూడా వచ్చి మంచం దగ్గిరే కూర్చున్నాడు. అక్కయ్యకు కొద్దిగా కునుకు పట్టింది. ఇంజక్షనుచేసి డాక్టరు మళ్లీ కొంచెం ఆశ కల్పించాడు.

తిన్నగా డాబామీదికి నడిచివెళ్లాను. వెనకాలే భాస్కరం వచ్చాడు. "మీరు అక్కయ్యకు చాలా మనస్తాపం కలిగిస్తున్నారు. మాబావ మీలాంటి నీచుడు కాడు. అతనిలాంటి విశాలహృదయు లీప్రపంచంలో లేరు. మీపనులు చూసి అతనేమీ ఈర్ష్యపడ్డంలేదు మాలతిప్రేమకు మీ రెక్కువగా పాత్రులయ్యేరే అని. కాని మీ నీచత్వం చూసిమాత్రం అసహ్యించుకుంటున్నాడు. మాఅక్కయ్యకు మీమీద ఉన్న ప్రేమలో సగమేనా మీకు దానిమీద ఉందా? ఉంటే తక్షణం వెళ్లిపోతారు మీరు."

"ఈశ్వరం ఈర్ష్యపడ్డం లేదూ—అవును పడడం లేదు" తనలో తనిలా అనుకున్నాడు వెర్రిగా. అయిదు నిముషాలు మాట్లాడకుండా నుంచుని తరవాత నా రెండుచేతులూ పట్టుకుని చాలా సీరియస్‌గా అన్నాడు: "నన్ను ముందు నువ్వు క్షమించాలి పద్మా. నే వెళ్లిపోతాను. మళ్లీ మీఎవ్వరికంటా పడనుకూడాను. కాని నే చనిపోయేవేళకుమాత్రం

మాలతిదర్శనం నే కోరుకుంటున్నాను. భగవంతుడి దయవల్ల మాలతి సుఖంగా వుంటుంది—జరం తగ్గిపోతుంది. తప్పులేవన్నా చేస్తే క్షమించమని అడిగానని ఈశ్వరాన్ని నామాటగా అడుగు—మాలతిని నన్ను మరిచిపొమ్మను."

ఈమాట లంటూంటే అతని కళ్లవెంట నీళ్లు వచ్చాయి. ఎంత కొద్దిరోజుల పరిచయం అయినా నాకూ బాధ అనిపించింది. అలా శూన్యంగా చూస్తూ నిలబడిపోయాను. ప్రకృతిలో పడేసరికి భాస్కరం నాపక్కని లేడు. అక్కయ్యదగ్గరికి వెడుతూంటే— నిద్రపోతోన్న అక్కయ్యకాళ్లకు దణ్ణంపెడుతోన్న భాస్కరం కనిపించాడు.

"ఏం చేస్తున్నావ్ భాస్కరం ?"

"చెల్లాయిదగ్గర సెలవు తీసుకుంటున్నాను పద్మా"

'మాలతి' అనడం మాని 'చెల్లాయి' అనడం ఇది అతని జీవితంలో రెండోసారి."చిన్నవాళ్లకు దణ్ణంపెట్ట వచ్చా" అన్నాను.

"చెలాయివిషయంలో తప్పులేదు పదా" అన్నాడు.

తర్వాత భాస్కరం వెళ్లిపోయాడు.

బావ ఒంటరిగా మేడమీద పచార్లు చేస్తున్నాడు. అతనిదగ్గిరికి వెళ్లాను. చాలా కోపంగా వున్నట్లూ, వ్యగ్రుడైపోయినట్టూ వున్నాడు.

"బావా, అక్కయ్య చేసిన పనికి కోపం వచ్చిందికదూ. తప్పుగా అర్థంచేసుకోకు బావా— స్త్రీహృదయం నువ్వర్థం చేసుకోలేవు—మీమొగాళ్లు మిమ్మల్నే మీ రర్థంచేసుకోలే రసలు. స్త్రీలో ఎన్నో మార్పులు వాళ్లకే తెలీకుండా వస్తాయి బావా. వాటిని మీరు—మొగాళ్లు— మీ అభిప్రాయాల కనుగుణంగా అర్థంచేసుకుని గుణదోషవిచారణ చేస్తారు. అక్కయ్య విషయంలో నువ్వలాగే ప్రవర్తిస్తున్నావు బావా. అదే నీకు తగదు. స్త్రీలో ఊహించుకోలేని మార్పుల్ని తెచ్చిపెడుతుంది ప్రేమ. వాటి పరిమాణాన్ని అసలు ఊహించలేరు. భాస్కరం అంటే మాలతికి అలాంటి ప్రేమే. అది అతన్ని అన్నయ్యలాగే ప్రేమించింది. చిన్నదాన్ని, నీకు చెప్పతగ్గదాన్ని కాను— అయినా ఆలోచించవూ ?"

" నా కెవరిమీదా కోపం లేదు పద్మా......" అన్నాడు బావ.

అక్కయ్యకు వ్యాధి తిరుగుముఖం పట్టింది. తగ్గిపోయాక ఒకనాడు భాస్కరం తనకిచ్చిన పటాలను చింపిపారేసింది. బావ అదిచూశాడు. ఎంతబాధతో అవి చింపగలిగిందో గమనించాడు. అతని హృదయం నీరైపోయింది. అతనిచేత ఎన్నితిట్లు తిన్నా ఆ పటాన్ని ఇంతవరకూ పదిలంగా దాచుకుంటూవచ్చింది. కాని ఇవేళ ఆఖరుకు చింపిపారేసింది.

"మాలతీ"అన్నాడు.

"వస్తున్నా"అని దగ్గర వచ్చింది. దాన్ని తన కౌగిలిలోకి తీసుకుని—

"నువ్వంటే నాకేం కోపం లేదు మాలతీ—మీ అన్నయ్యిచ్చిన పటా లలా చింపేశావేం ? నిన్ను నే నర్థంచేసుకున్నా మాలతీ-

అతని కళ్లలోకి చూసి మళ్లీ తల దించేసింది మాలతి.

౫

రెండేళ్లు గడిచిపోయాయి. అక్కయ్యకు కొడుకు. నాక్కస్తమానం వాణ్ణే ఎత్తుకో బుద్ధిఅవుతుంది. ముగ్గురం యౌవనంలో వున్నాం. ఏ విచారాలూ లేక కాలం గడిపేస్తున్న దినా లవి. హఠాత్తుగా ఓనాడు "చెల్లాయిని చూడాలి"అని భాస్కరందగ్గర్నుంచి టెలిగ్రాం వచ్చింది. అందరం వెళ్లాం. భాస్కరం టి. బి.తో బాధపడుతున్నాడు. అతన్ని చూడగానే అక్కయ్య ఒకటే ఏడుపు—"ఇలా అశ్రద్ధ చేశావేం" అంటూ.

"నాకు బతకాలని లేదు. నాకెవరూ లేరు. దానికేంగాని నా వెనకటితప్పులు క్షమించవా చెల్లాయి! ఆవేళ నిద్రపోతోంటే నే నీ దగ్గిర సెలవుతీసుకున్నా.

ఇవేళ మళ్లీ చూశాను నిన్ను. శాశ్వతంగా సెలవు తీసుకుంటూ చెల్లాయి. నన్ను మరిచిపోవమ్మా......"

తరవాత నాకేసి తిరిగి "నువ్వు దేవతవు పద్మా. మాఅందరి జీవితాలూ దుఃఖమయాలు కాకుండా రక్షించావు. ఆవేళ నన్ను వెళ్లిపొమ్మన్నావు. ఇవేళ లోకం ఎదుటనుంచే వెళ్లిపోతున్నాను. తప్పులుంటే క్షమించు చెల్లాయి. మీరిద్దరే నాకు చెల్లాయిలు."

భాస్కరంహృదయంమీద తలపెట్టి ఏడుస్తూ అన్నాను: "నిన్నెంతో అగౌరవపరిచాను. నీచు డన్నాను. ఇంకా ఎన్నో అన్నాను. క్షమించమని వగడానికి కూడా నా కర్హత లేదన్నయ్యా" ఆ పైన ఇక చెప్పలేకపోయాను.

చనిపోయేముందు మాపాపని దీవించాడు. అందరి కేసీ చూశాడు.

చెల్లాయీ!
పద్మా!
ఈశ్వరం!
సెలవు!

అక్కయ్య తెలివితప్పి పడిపోయింది. బావ కళ్ల నీళ్లు గుక్కుకున్నాడు.

మరొక రెండేళ్ళు గడిచాయి. అక్కయ్యకూడా భాస్కరం అన్నయ్యను కలుసుకుంది. చనిపోయేసరికి అక్కయ్యకు ఇరవైఅయిదేళ్లుమాత్రం. లోకంలో సౌందర్యవతుల్లో ఒక్కర్తె లోపించింది. చనిపోయే ముందు అది నాకు వప్పగించి వెళ్లినవి మూడే వస్తువులు— దాని డైరీ, పాపడు, బావ!

కన్నీళ్లతో స్వీకరించాను. 'అమ్మా' అని ఏడ్చే బాబీని గుండెకు అదుముకున్నాను.

"మీఅమ్మను నేనే బాబీ" అని వాడి కెలా నచ్చచెప్పను

బావ పాపం నెత్తీవాడు. "పద్మా, ఇక్కడే వుండి యిల్లు దిద్దుతోంటావా"

ఎందుకు వొప్పుకోను? అక్కయ్యస్మృతి చిహ్నం బాబీయేగా? ఆమాత్రానికే ఎంతో కృతజ్ఞత చూపాడతను.

"నీఅందం చూస్తే మీఅక్కయ్య జ్ఞాపకం వస్తుంది, పద్మా" అంటాడు.

అక్కయ్యఅందంలో నాఅందం ఎన్నోవొంతు?

ఒకనాడు అక్కయ్యడైరీ చదువుతున్నాను. భాస్కరాన్ని గురించిన చర్చ కన్పించింది. అక్కయ్య ఇలా రాసింది:

"భాస్కరానిది చాలా వింతైన మనస్తత్వం. అతనిలో నన్ను చూస్తే subconscious(వ్యక్తావ్యక్తం)గా కామంప్రజ్వరిల్లే దనుకుంటాను. ఈశ్వరం ఈర్ష్య పడుతున్నా డనేసరికి అది మరీ ప్రజ్వరిల్లేది. కాని ఎప్పుడూ అతనికి నేనంటే సోదరీప్రేమే ఉండేది. కాకపోతే ఆనాటిరాత్రి అలా వెళ్లిపోతాడా? అతని మనస్తత్వం గ్రహించడానికే ప్రయత్నించా. "నిన్ను ప్రేమించా" నన్నాను. "నానుదుటిమీద ముద్దెట్టుకో" మన్నాను. పర్యవసానం అతను నన్ను సోదరిలాగానే ప్రేమిస్తున్నాడని తేలింది.

వరం ఈర్ష్యపడ్డం లేదని తెలిసేసరికి— అతనికి తెలియకుండానే ఆ subconsciousnessలోని కోరికకు దెబ్బతగిలింది. అతని మనస్సులో అతనికి తెలీకుండానే ఎంత ఘోరయుద్ధం జరిగిందీ?" ఇలా రాసింది.

అక్కయ్యముఖంలో ఎంతగా అందాలు ఒలికేవో దాని ప్రేమలోకూడా అంత అందం ఉంది; పవిత్రత వుంది.

అక్కయ్యది స్త్రీహృదయం— చాలామంది స్త్రీలకు మగహృదయాలుంటుంటాయి.

"పిన్నీ" అంటూ బాబీ వచ్చాడు. ఎత్తుకుని ముద్దెట్టుకున్నాను.

తెనాలిలో గతమాసాదిని జరిగిన సాహితీసమితి సమావేశం



ఎడమనుంచి కుడికి-కూర్చున్నవారిలో మొదటివారు పిలకా గణపతిశాస్త్రిగారు. కుర్చీలలో కూర్చున్నవారిలో రెండవవారినుంచి వరుసగా: త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి, కురుగంటి సీతారామయ్య, తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి, మారేమండ రామారావు, మొక్కపాటి నరసింహశాస్త్రి, నోరి నరసింహశాస్త్రిగార్లు. నిల్చినవారిలో ఆచివరా ఈచివరా ఉన్నవారు వావిలాల సోమయాజులు, పెనుమర్తి కామేశ్వరరావుగార్లు. మధ్యనున్న ముగ్గురు పిల్లలమర్రి హనుమంతరావు, మునిమాణిక్యం నరసింహారావు, బాబూరావుగార్లు.

# నా రెండవ భార్య



= శ్రీ న్యా. లక్ష్మణప్ప =

ప్రతిమనుష్యుని బీరువాలోను ఒక అస్థిపంజరము దాగియే యుండును అని ఇంగ్లీషులో సామెత ఒకటి కలదు. అల్లే యెంత ప్రవరాఖ్యు డని పేరందిన వ్యక్తిజీవితము నందును పరామర్శించి చూచినట్లయితే ఏదో దాగియుండిన గుట్టొక్కటి బయలుపడగలదు. కాబట్టి నా రెండవభార్యను గూర్చి నేను మీతో చెప్పుకొనుటకు సంకోచపడవలసిన అవసరము లేదు.

ఆమెసందర్శనము నాకు మొట్టమొదట ౧౯౪౪ నవంబరులో బస్సులో సమకూడినది. ఆ రోజు కొంచెము వర్షము కురిసినది. ఇంకను సన్నతూర పడుచునేఉండినది. సాయంత్రము అయిదుకొట్టినతరువాత ఆఫీసునుంచి బయలు దేరినాము - నేనున్ను, నాతోడిఉద్యోగస్థులు కొందరున్ను, ఇంటికి పోవుటకు. రోడ్లన్నియు వర్షమువలన బురదమయమై నడవడమునకు యోగ్యముకాకపోయినవి. ఆగర్భశ్రీమంతుడనై పుట్టియుండిననో, లేక విస్తారము జీతము గల పనిలేని పెద్దయుద్యోగము నేయుచుండిననో ఆఫీసుపెట్టె నెత్తుకొని ముందర జవాను నడచుచుండగా బూడ్సుల టక్‌టక్‌శబ్దమాఫీసువరాండాలలో మారుమ్రోగుచుండ మెల్లమెల్లగ నడచివచ్చి షాఫరు తలుపు తీయ నిలిచియుండు బండినెక్కి ఇంటికిపోయియుండువాడను. అట్టి నోము నోచియుండక పోవుటచేత నా ద్విపాదశకటమును స్వయముగ నడపుకొని పోవలసివచ్చెను. విక్టోరియాహాస్టలురోడ్డు కునితిరిగేవఱకు వీటి తాత సొత్తంతయు కంపులువెదచల్లే బక్కింఘాంకాలువలోని దుర్గంధపు నీటిలో మునిగిపోవుచున్నదని యేమూల నుంచియో అకస్మాత్తుగ మీదబడినవి ఉసిరికకాయలంత వానచినుకులు. కట్టుకొనియుండిన గుడ్డలన్నియు తడిసి ఖరాబైనవి. ఈ యవస్థయందు మేము నిమగ్నులమైయుండగా వినబడినది వెనుకప్రక్కనుండి 'బొఇంయ్, బొఇంయ్' అను మోటారుకారుగర్జన. అబ్బ! ఈ మోటారుకారుల కేమి పొగరండి! ఈ చెన్నపట్టములోని రోడ్లన్ని తమ పిత్రార్జితము లనియు, వానిమీద రాకపోకలు సాగించుటకు తమకుదక్క అన్యులకు హక్కు లేదనియు వీని అభిప్రాయము. కాలినడక వారిని చూచిన వీనికి అలక్ష్యమును, చెల్లాటమును! కారుగారు వచ్చుచున్నా రని తెలుసుకొని భయభక్తులతో ఒకమూలకు ఒదిగితిమా సరేసరి; అట్లుగాక మర్యాదకు భంగముగా రోడ్డువెంబడే నడచుచుంటిమా, కోపోన్మత్తుడైన రెడ్డి బక్కచిక్కిన రైతుపై బడినట్లు, మీదబడి యొడలెల్ల నజ్జునజ్జుగావించి రోడ్డునందు రక్తప్రవాహమును బఱపి ప్రాణము నెడబాపును. ఖులాసా హెచ్చినప్పుడు, ఒకయోర కొదిగి నడచుచుండినను రస్తాపైని చలపలయందలి బురదనీటిని పైజల్లి, పరిహాసముజేసి నవ్వునట్లు కూతలువేయుచు బోవును. ఆ రోజు ఆ వెనుక వచ్చుచుండిన మోటార్కారు రోడ్డు కట్టుబాట్ల ననుసరించియే మేము నడచుచుండినను మా యెడ నక్రమముగ ప్రవర్తించిన కారణమున దాని దౌర్జన్యవిషయమై మీతో మొరపెట్టుకొనవలసివచ్చినది.

ఈ స్థితిలో బస్సుదగ్గరకు వచ్చిచేరితిమి. నాతోగూడ వచ్చిన ఆఫీసుస్నేహితులు ఎవ్వరిదారిని వారు పోయిరి. నా యిల్లు పాతమాంబళంలో ఉన్నది. బస్సు అప్పటికే నిండిపోయియుండినది; కూర్చొనుటకు తావు లేనేలేదుసరికదా, నిలుచుకొనుటకుగూడ వీలుపడనట్లు తోచినది. ఎట్లో సందు చేసుకొని, "ఎడమిల్లేసార్ ఏరాదుంగో సార్" అని కండక్టరు ఆక్రందించుచుండినను జొరబడి హేంగరును పట్టుకొని నిలబడినాను; బస్సు కదలినది. ఎడమచేతియందు ఆఫీసుఫైలొకటి యుండుటచేత ఒకకుడిచేతితోనే హేంగరును పట్టుకొని నిలువవలసివచ్చినది. అది సామాన్యమైన విషయమని తలతురేమో. అది అరువదియైదవ విద్య! చెన్నపట్టణముబస్సులలో తరచుగ ప్రయాణముచేసి సాధనచేసినవారికే యది సిద్ధించును. బయటివారి కది యలవడదు. బస్సుడ్రైవరుకు షోకు పుట్టి ప్రయాణీకులకు దన నేర్పు చూపుటకై యకస్మాత్తుగ బ్రేకువేసినప్పుడుగాని, మూలతిరుగుడులయందుగాని హేం

గరుల నూతగొని నిలుచుకొనియుండు ప్రయాణీకులు భరత నాట్యమున దమ ప్రావీణ్యమును జూపవలసియుండును: రాయపేట పోలీసుస్టేషనుకు వచ్చి చేరగనే యొక ముసలా యన దిగిపోగా ఆయనతావులో కూర్చుండినాను. మరల బస్సు బయలుదేరినది. ఇంతలో బస్సులో నొక కలకలము పుట్టినది. దాని కారణ మిది: ఒక యౌవని యచట బస్సె క్కినది. కూర్చొనుటకు స్థలమెచ్చటను లేదు. హేంగరులను బట్టికొని నిర్ణీతసంఖ్యకంటె నెక్కుడుమంది నిలుచుకొని యుండిరి. బస్సు నాల్గుమూలలకును ఆమె దృష్టులు బఱపినది. కూర్చునియుండిన మగవారెవ్వరైనను లేచి తన్ను మర్యాద జేసి కూర్చుండబెట్టుదురని తలచినదేమో. ఎవ్వరును ఇంకను కదలలేదు. ఇంతలోనే యొక యరవబ్రాహ్మణేతరయువ కుడు తనతో గూడ వచ్చుచుండిన మిత్రునితో "ఇంద పాపార్ సోదాపయ్యంగో. లేడీసు వందు నిన్నుఇరుందాలుం గూడా యెడం కుడుకమాటాంగో. నాం యెందు నిన్ను ఇం దమ్మాకు ఎడం విడలాం" (ఈబాపనవాండ్లు సోదాకుఱ్ఱ వాండ్లు. లేడీసు వచ్చి నిలుచుకొనియున్నను లేచి చోటి వ్వరు. మనం లేచి నిలచుకొని ఈ యమ్మకు చోటువిడు తాము) అని చెప్పి మిత్రునితోగూడ లేచి నిలచుకొనెను. ఆయువతియు గూర్చొనెను. కాని విషయ మంతటితో ముగి యలేదు. నాప్రక్క కూర్చుండియుండిన పెద్ద నామాల అయ్యంగారు ఆ బ్రాహ్మణేతరయువకు డాడిన నిందావాక్య ములు తన్నుద్దేశించి పలికినవే యని నిశ్చయించి యతనితో తర్కముసేయ నారంభించెను. దానికి బదు లతడు బ్రాహ్మణ జాతిహైన్యమునుగూర్చియు, బ్రాహ్మణుల దౌష్ట్యమును గూర్చియు, పెరియారుమొదలు చిన్నారువరకు గల బ్రాహ్మ ణేతరనాయకుల సూక్తిరత్నముల నుదాహరించుచు నొక చక్కని యుపన్యాసమును దొరలించెను. అతని వాగ్ధాటిని బట్టి చూడగా నది యతనికి గంఠస్థమైనట్లు తోచెను. అతనిని మందలించుటకు పలువురు ప్రయత్నపడిరి. బస్సులో కళవళ మతిశయించెనుగాని లాభము గలుగదాయెను, ఇంత వఱకు ఆవాగ్యుద్ధమున పాలుగొనక మిన్నకుండిన యొక ముసలామె-జాతిచే నాదిద్రావిడకులమునకు జెందినది-కదన రంగమును బ్రవేశించి, బస్సులోని ప్రయాణీకులకందఱికిని జవాబుజెప్పుచుండిన బ్రాహ్మణేతర యువకునిని ఆటంబాంబు కంటె తీక్ష్ణతరమైన యొక ప్రశ్నచే నిరుత్తరుని గావించి నోరుమూయించినది. ఆ ప్రశ్న ఇది: "ఎన్నాతంబి! నీ కుత్తం శొల్రదు ? పొంబళ్ వందు బస్సుయేరి నిన్నా పాపార్ అవంగళకు తాంగళ్ వుక్కొందు ఇరున్ద ఎడం గాలీసెయిదు కుడుకల్లే అన్ను దానే? నీ శొల్ర పేశు సరితాణా, అనా పొంగళం పెరివాళం యెల్లారుం పొంబళ్దానే. నాణ జాంబ జారుకిట్ట బస్సు ఏరినణ. అదుమొదలు ఇదివరక్కుం తళ్లాదుకళవి నాణ ఇంద తోల్పట్టయే పుడిచ్చికొండు వాం మున్నెయే తొంగికొండు ఇరిక్కేణ. పొంబళకు మర్యాద కొట్టణుం యెన్ను శంద్దైపుడిక్కిర నీయ్ యెన్నె కండ వుడనే నిన్ను ఎనక్కేణ ఉక్కోట్టతక్కు ఎడం విడలే? అళగా చీరై కట్టికొండు కాదులె సల్లైదైకళ తొంగవుట్టు కొండు పాది పిన్నె లె కైనాలె ముఁరిక్కికొండు అనావస్యమా పల్లెకాట్ర చిఱువయసుపొంబళమాత్రం పొంబళన్ను ఒన్నొది నెనెవా?" (ఏమి తమ్ముడా! నీవు తప్పుపట్టునది? స్త్రీలు వచ్చి బస్సుయెక్కి నిలుచుకొనినను బాపలు వారికి తాము కూర్చునియుండిన తావును ఖాళీచేసి వారికి యివ్వలేదనికదా. నీవు చెప్పుమాట సరియైనదే. అయితే యౌవనవంతులును ముసలివాండ్రును అందఱు స్త్రీలేకదా. నేను జాంబజారు దగ్గిర బస్సు యెక్కినాను; అప్పటినుండి ఇప్పటి దాక లేవ లేని ముసలిదానను నేను ఈ తోలుపట్టను పట్టుకొని నీముందు గనే వేలాడుచున్నాను-స్త్రీలకు మర్యాద చేయలేదని జగడము వేయుచుండు నీవు, నన్ను చూచినంతటనే లేచి నిలచి నాకు కూర్చొనుట కేల తావియ్యలేదు: సొంపుగా చీర కట్టుకొని, జల్లెడలను రెంటిని చెవుల కంటించుకొని, సగము జడను చేతితో మెలివేయుచు, అనావశ్యముగ పండ్లిగిలించు చిన్నవయస్సు పడుచులుమాత్రమే స్త్రీలని నీతలంపా) యని యడిగినది. ఆబ్రాహ్మణేతరయువకుడు జవా బేమి యు తోచక గుటకలు మ్రింగ నారంభించెను. బస్సులోనివారంద ఱును నేకీభవించి యతని పరిభవమున కానందించి గొల్లున నవ్విరి. అటుతరువాత బస్సులో నుండుట కతనికి కష్టమా యెను. ఇంతటనే బస్సు సఖాథియేటరుదగ్గర నాగినది. అతడు మిత్రునితోగూడ దిగిపోయెను; అతని ననుకరించి యా యాదిద్రావిడవృద్ధసతియు లేచిపోయినది,

ఇంత యడావుడికి కారణభూతురాలైన యా యౌవన వతి యెవ్వరని తలచుచున్నారు? ఆమెయే నా రెండవభార్య. ఇదియే మా ప్రథమసందర్శనమని ఇంతకుముందే చెప్పి యున్నాను. ఆమెను చూడగనే నామనస్సున వైరస్యము పొడమినది. దీనికి గారణ మామె సౌందర్యవతి కాక పోవుట చేత గాదు. అన్ని యంశములను పరిశీలించి చక్కగా పరామర్శించి చూచిన ఆమె అందకత్తె యనియే చెప్పవలసి వచ్చును. ఐదుఐదున్నర అడుగుల పొడవైన శరీరము- పండిన నిమ్మపండును స్మరణకుదెచ్చు దేహచ్ఛాయ-బక్క పలచని మనిషి. సృష్టిచేయునపుడు తనయొద్ద నున్న సామగ్రియంతయు ఖర్చయి యే కొంచెమో మిగిలియు

డగా దినసరి కార్యమును ఎట్లో నెరవేర్చినానని చెప్పుటకు బ్రహ్మదేవు డామెయస్థిపంజరముమీద చర్మమును పలచగ పూసినట్లు తోచినది. కాని యామెవైశిష్ట్యత కన్నులయందు గానవచ్చును. విశాలములైన ఆమెతెలిసోగకన్నులనుండి నైజముగ వెలువడు శోభ చంద్రిక నభస్థలమునువలె వెలుగొందజేయుచున్నది. అమె సుందరియైనను నా కామె యెడ వైగస్యము గలుగుటకు కారణము లేకపోలేదు. బస్సుప్రయాణము చేసే స్త్రీలయందు సామాన్యముగా కనబడు దుర్గుణ మొకటి. బస్సులు ఉదయం ౬ గంటలమొదలు రాత్రి ౯ గంటలవరకు పోవుచునే యుండునుగదా, ఈ మధ్యకాలములో వీరెప్పుడు సాగించుకోగూడదు ? త్యాజ్యము, వారశూల, రాహుకాలము అంతా చూచుకొని ముహూర్తముచేసుకొని బయలుదేరడానికి. 'కాలే కడుపుకు మండే గంజి'యన్నట్లు ఉడికెడిమెతుకు నోట అవసర అవసరముగా క్రుక్కుకొని మొగవాం డ్రాఫీసులకు వెళ్లే సమయమునకో, లేకపోయిన దినమంతయు నాఫీసులలో నరపచాకిరీ చేసి ఇంటికి తిరిగిపోవుసమయమునకో కాని వీరికి పయణము నేయుటకు చక్కని సుముహూర్తము కుదురదు. పయణమైవచ్చువారు ఊరక రారు. ఇంట్లో వుండే పాత నూనెడబ్బాలు, చింపిరిగోనెసంచులు, ఓటిచెంబులు, తపేలాలు, వేణ్ణీళ్ల హండాలు మొదలైనవాని నన్నిటిని కూడ వేసుకొని, యీ సరంజామంతయు చాలనట్లు, చెవులు తూట్లు పడునట్లు గింగురుమని యేడ్చెడు ముక్కుచీమిడి పిల్లకాయల నొకరిద్దరిని జాగ్రత్తపెట్టుకొని బస్సారోహణకై వచ్చి చేరుదురు. వీరికి బస్సులో చోటియ్యకపోయినట్లాయెనా, కండక్టరుయొక్క గుణవిశేషములను, వాని పెద్దల నడవడిక తీరును మార్గమున పోవువారి కందఱకు విశదమగునట్లు ప్రకటింతురు. బస్సులోని కెక్కిరా, అంతకుపూర్వ మందుండు మగవారి యవస్థ చెప్పవలసినది లేదు. ఎంత యలసి కూర్చునియుండు మగవాడుకూడ వీరికి అర్ఘ్యపాద్యముల నిచ్చి 'ఆసనం సమర్పయామి' అని లేచి చెప్పి మ్రొక్కుకొనవలయునట ! అట్లు చేయక ప్రాలుమాలితిమేని ఏ బ్రాహ్మణేతరకుఱ్ఱవాడో 'పాపార్ పైల్ సోదాపయ్యంగో' అని నిందించును. ఈ వింతపరిస్థితికే మగవాని యొడలు రగులుకొనిపోవును. మఱియొక కారణ మామెకృతఘ్నత. ఆ బ్రాహ్మణేతరకుఱ్ఱవాడు ఈమెకు గూర్చొనుటకు దన తావిచ్చి,—వాని వాక్పారుష్యమువల్లనే యనుకొందము— నలుగురి నోట నానెనుకదా! వాని పక్ష మవలంబించి వానికి ఒత్తాసిగ ఒకమాటయైన చెప్పలేదు, అది యట్లుండనిండు. ఆ యాదిద్రావిడవృద్ధాంగనవల్ల నాతడు పరాభూతుడు కాగా నాతని జూచి యందరిని గూడి ఈమెయు నవ్వినది, ఇంతకు మించిన కృతఘ్నత వేరేమి కలదు ? నా మనస్సున నిట్లామె యెడ వైరస్యము గలిగినను అంతర్బుద్ధియందు మాత్ర మానందము బుగ్గటిల్లుచునేయుండినది. కారణము సువ్యక్తము గాకపోయినను, ఆమెయెడ నాయెదయందే మారుమూలనో యనురాగలేశము పొడమినట్లు తలచవలసి యున్నది.

* * *

తరువాత నా రెండవభార్య సమ్మేళనమప్పుడప్పుడు బస్సునందే తటస్థపడుచువచ్చినది. ఆమె యెవ్వరో నాకు తెలియకపోయినను 'రాణిగారితో నా వివాహము నిశ్చయమైన' దను న్యాయము ననుసరించి మాకు సఖ్యము కుదిరినది. ఇతర స్త్రీలు బస్సెక్కినప్పుడు వారిని శపించు నా మనసు రాయపేట పోలీసుస్టేషనును బస్సు సమీపించునప్పటి కామెరాకకనుదినము నిరీక్షింపసాగినది. ఇది నా మనస్సునకు తగని పని. నేను స్త్రీమోహ మెఱుగని యువకుడను గాను ; గృహస్థుడను, కుటుంబవంతుడను. ఇంగ్లీషు చదువుకొనినవారందఱివలె స్నానసంధ్యాదులను విసర్జించి మన కులధర్మాదులను 'సూపరిస్టిషన్' అని నేనును ఒకప్పుడు నిరసించుచుంటిని, కాని యా నవీనాభిప్రాయము లన్నియు నెట్లో ఇటీవల మాయమైపోయినవి. ప్రాతమార్గముననే మరల పడి నిత్యమును స్నానము, సంధ్య, జపము, ఏదో కొంచెము రామాయణము, గీత మొదలగు మతగ్రంథపారాయణము కుదిరినవి. ఆఫీసులోనేమి, నా యిరుగుపొరుగుననేమి 'పెద్దమనిషి' యని నలుగురిచేతను అనిపించుకొన్నాను. నాకు పరువుమీద ఆదరము బలిష్ఠము. ఇటువంటివాడనగు నా మనస్సు ఎవ్వతెయోయొకతె—అనుదినము నాతోగూడ బస్సుపయణము సాగించునదియే యనుకొనుడు. ఎఱ్ఱగా పుల్లగా కన్నులపండువైనదే యనుకొనుడు— దానియెడ నా యంతస్తునకు తగినట్లుగాక విరుద్ధపుపోకడలు బోవడ మెంతయు శోచనీయము, ఈ విషయమై నా మనస్సునకును, నాకును ఎన్నియో వాగ్యుద్ధములు నడచినవి. ఎంత సహేతుకముగ దాని చర్య నింద్యార్హమని నిరూపించి ఖండించినను, అది కొంద ఱాధునిక యువతీయువజనుల పద్ధతి ననుసరించి, ఫ్రీలవ్‌ను ప్రతిపాదించుచు యథేష్టముగ ప్రవర్తింపదొడగుటచే బలుమారు నాకే యపజయము గలుగుచు వచ్చినది. మా యిరువురి మధ్య గలిగిన ఈ వివాద మింకను తీర్మానముగాలేదు. ఇంతలోనే గోరుచుట్టుపై రోకటిపోటు వలె నొక పెనువిపత్తు వచ్చి పైబడినది.

దక్షిణభారతహిందీ ప్రచారసంఘమువారు గంధితిరు నాళ్లను చాటించిరి. సత్యనారాయణగారు ధ్వజారోహణము గావించి బ్రహ్మోత్సవమును కొట్టికోలాహలముగ చేయుటకు చరామనీగ పనులు సాగించనారంభించిరి. కాలానుగుణ్యముగ నొక్కొక్క స్థలమునకు శుక్రదశ పట్టుచుండును. మాంబళంవంతు ౧౯౪౫ డిసంబరులో వచ్చినది. సంతత నిద్రాపారవశ్యస్థైయుండు మదరాసుకార్పొరేషన్ వారికి అశ్రుతపూర్వమైన ప్రబోధము గలిగినది; ఎప్పుడును కంకర మొహ మెఱుగని రోడ్లు, వీధులు, గొందులు అన్నియు కంకరచే చవినయి, తాను బూయించుకొని నడమంత్రపుసిరిచే మిట్టిపడు నాగరాంగనలవలె నిక్కసాగినవి. ఎన్నడు దర్శనమీయని కార్పొరేషన్ ఆరోగ్యశాఖాధికారులు లేనిపోని శ్రద్ధ వహించి, మహాపరిశుద్ధిగ పెంటయూడ్చి క్రొత్తచీపురు కట్టవలె, పెంటయున్న చోట్లకంటె లేనితావులయందు కడు పట్టువలతో చిమ్మసాగిరి. దోమపాళెములను ధ్వంసము చేయుటకు దోమప్రపంచకాలరుద్రుడు మాసీలోమణి మొదలియారను దళవాయి దండును గూర్చి దుర్గంధతైల బక్కెట్లతోడను, వలసంచికట్టలతోడను ఎత్తివచ్చి వీధుల వెంబడి నుండు నూతులలోను, పడియలలోను తండ్రితాత ముత్తాతలకాలమునుండియు తరతరములుగ గృహారామాదులను నిర్మించుకొనియుండిన మశకప్రజపై హఠాత్తుగ నురవణించి రూపుమాపెను. ఏ రిక్షాస్టాండుచెంతనో సవారికై వేచియుండు రిక్షావాలాలతో లేనిపోని నేరములు గల్పించి యనావశ్యకమైన తర్కములను పెంచి లంచములు గొట్టుచుండు పోలీసుజవానులు సచేతనములై నడయాడు నేప్టీనిప్పుపుల్లలవలె సర్వత్ర సంచరింపదొడగిరి. ఎవ్వరి యొడలిపై జూచినను ఖద్దరుజుబ్బాలే! ఎవ్వరి నెత్తిపై జూచినను గంధీటోపీలే! ఎటు వైపు చెవియొగ్గి వినినను వచ్చీరాని హిందీ పలుకులే! గాంధీగారి మాహాత్మ్యమెట్టిదోకాని మా త్యాగరాయనగరు సూక్ష్మీకృతభారతావనియై పరిణామము నందినది. గుజరాతీలు, మార్వాడీలు, హిందూస్థానీలు, బంగాళీలు, దఖనీలు, తెలుగలు, అరవలు, కన్నడిగలు, కొంకణీలు, మళయాళీలు మొదలైన సకలజాతులవారును ఎచ్చటెచ్చటి నుండియో కొట్టుకొనివచ్చి మాంబళంనడివీధులలో తేలిరి. తెల్ల, పుల్ల, నల్ల సిపాయీలకని సర్కారువారు కేటాయించి ముద్రవేసి మీదెత్తియుంచియుండిన బండ్లు పోను తక్కిన బండ్ల పొట్టలు పిక్కటిల్లునట్లు జనము నెక్కించుకొని పొగబండ్లు పెనుపరుగుమీద మద్రాసుకు వచ్చి, భరించజాలక వాంతిజేసుకొనుచుండినవి.

* * * *

గాంధీమహాత్ముని బ్రహ్మోత్సవసందర్భమున నడచిన వేడుకలలో ప్రధానమైనది నిత్యప్రార్థనసమావేశము. అది నా జన్మమున మరవరానిది. ఏలనగా నాకును, నా రెండవ భార్యకును దాంపత్యము కుదిరిన దీప్రార్థనసమావేశములయందే. మొదటి మూడునాల్గురోజులయందు ప్రార్థన హిందీ ప్రచార, బోగురోడ్డుల మధ్యనుండు నొక మైదానమున జరిగినది. ఈ మైదానమునకు ఉత్తరపు అంచున కట్టబడిన ఒక యున్నతవేదికపై గాంధిగారు వారి పరివారముతోగూడ ప్రతిసాయంత్రము వచ్చి కూర్చొని ప్రార్థనను సాగించెడివారు. మహాత్ముని దర్శనమును గోరి వేలకొలది పామరజనులను దినమును చుట్టుపట్టుగ్రామాదులనుండి వచ్చి మూగువారు. పంద్రెండుగంటలకే మైదాన మంతయు నిండిపోయెడిది. ఆలస్యముగ వచ్చిన మహాత్ముని దర్శనము ఫర్లాంగుఫర్లాంగున్నరదూరమునుండి చేసుకొనవలసినదే. ధనవంతులు, విద్యావంతులు తమతమ వ్యాపారములను వదలుకొని రాజాలనివారు దూరమునుండియేనియు దర్శనభాగ్యము లభించిన చాలునని బైనాకులసులలో తయారై వచ్చెడివారు.

నాకు కాంగ్రెసుప్రచారములో ఎక్కువ నమ్మకము లేదు; గాంధిగారి సందేశములో ముఖ్యాంశమైన అహింస దేశాభివృద్ధికి తోడ్పడదని నాయభిప్రాయము. హిందూ మహమ్మదీయసఖ్యము అసంగతమని నా తలపు. మద్యపాననిషేధము మనదేశమునం దావశ్యకమైన సంస్కారము గాదు. కాని భరతఖండమునం దెల్లయెడలను నపూర్వజాతీయోద్బోధమును గలిగించి యాత్మబలముచే సర్వమానవుల హృదయమును చూఱగొనిన మహనీయుడు భగవత్స్వరూపుడుగాని మానవమాత్రుడు గాడు. ఆయనసందర్శనమాత్రమున కల్మషములను బాసి యాత్మ పరిశుద్ధ మగునని నిశ్చయించి రెండుమూడు పర్యాయములు ప్రార్థనమైదానమునకు బోతిని; కాని బహుదూరమున నాయన యాసీనుడైయుండిన కారణమున మనసునకు తృప్తికలుగలేదు.

* * * *

ఆచార్య మహాదేవనుగారు నా చిరమిత్రులు. మేమిద్దరము మద్రాసుక్రైస్తవకళాశాలలో సహాధ్యాయులము. తరువాత కొన్నియేండ్ల పర్యంతము మే మిద్దరము నచట ఉద్యోగమున నుంటిమి. కాని ఇటీవల నాకు వారితోడి సంసర్గము సన్నగిల్లినది. నేను మదరాసులో, వారు మధురలో. హిందీప్రచారరోడ్డులో వారి స్వగృహము గలదు. దానికి వెనుకనే గాంధిగారనుదినమును ప్రార్థనసమయమున గొలువుండు వేదిక నిర్మింపబడిన దనియు, మహా

దేవనుగారి మేడపై నెక్కిన గాంధిగారిని సమీపమున నుండి దర్శనముచేసుకొనవచ్చుననియు గర్ణాకర్ణిగ విని యొక సాయంత్ర మటువైపు నడచితిని. వారి వాకిటి మొగాళమున నొక పెద్దగుంపు. స్త్రీలు పురుషులు కలగాపులగముగ గేటుతలుపులను నెట్టుకొని లోపలికి బ్రవేశించ బ్రయత్నపడుచుండిరి. వాకిటి కడ్డముగ తోటవాడు, వానితోగూడ ఒక పెద్దకుక్క ఎవ్వరిని లోనికి బోనీయక అడ్డపెట్టుచుండిరి. ఎట్లు దారిచేసికొని గేటువాకిటితోటవానిని, కుక్కను సమీపించి వారితో చెప్పుకొనడమా యని యోచనచేస్తూ కొన్నినిమిషము లచట నిలిచితిని. ఇంతలోపల నొక పెద్దమోటారుకారు ఒక అయ్యరువారి కుటుంబముతోసహా వచ్చి గేటును సమీపించినది. దానికి దారి విడుచుటకై యచ్చట మూగియుండిన ప్రజలు రెండుపాయలై వీడి వెనుకకు ఒదిగిరి. ఈ గడబిడలో నే సెట్లో ముందువడితిని. అయ్యరుగారిని ప్రవేశపెట్టుటకు తోటవాడు ప్రయత్నపడుచుండగనే ఇంటిలోపలినుండి వారికి స్వాగతమిచ్చుటకు ఆచార్యమహాదేవనుగారే స్వయముగా వచ్చిరి. వా రింకను మధురయందే యుండిరని తలచితిని. అది పొరపాటు. గాంధిగారిని దర్శించుటకు వారుగూడ మదరాసుకు వచ్చిరట. అయ్యరుగారిని లోపలి కంపినవెంటనే నే నాతని కంటబడితిని. "హల్లో ప్రొఫెసర్, ఇటీస్ ఏజస్ సిన్స్ వుయి మెట్, యు ఆర్ క్వైట్ వెల్కమ్, కం అలాంగ్"అనుచు ముందునకువచ్చి నాచేయి బట్టుకొని లోనికి నడువనారంభించిరి. తోటవాడు మరల గేటుమూయుటకు ప్రయత్నించగా, ఆచార్యగారు కోపించుకొని "ఏండా, స్టూపిడ్, ఒనెక్కు మూళై యిల్లియా? అయ్యావుం అమ్మావుంకూడ వందిర్కిరాఘళ్ - అమ్మా వుళ్లవరత్తుక్కు మున్నెయే ఏన్ గేట్ శాత్తురాయి"అని గర్జించినాడు. తోటవాడు 'ఇల్లేసామి'అని ఇంకయేమో చెప్పబోయి సమాళించుకొని యొకప్రక్క నిలిచెను. నేను ఒంటరిగనే వచ్చితిని గదా, మరి నాతో వచ్చిన అమ్మ యెవ్వరు అని సందేహపడి వెనుదిరిగి చూచితిని. ఆశ్చర్యముతో నిశ్చలుడనైతిని. నావెన్నంటి మునిమునినగవులు నగుచు వచ్చుచుండినది నా రెండవభార్య? ఏమని చెప్పుదును. నాకు మహత్తరమైన కోపము వచ్చినది. ఎంత బిడియము లేని స్త్రీ యామె! తాత్కాలికముగ నభిలషితార్థమును బొందుటకై ఎవ్వరో పరాయిమగవాని నొక్కని దన భర్తయని ప్రకటించుచుండగా, కాదని చెప్పకపోవుట యటుండనిచ్చి, యంగీకారసూచకమైన చిరునవ్వుతో వెనువెంట దగులుచున్నది. ఆమె ఇల్లాలా? ఈమె నాభార్య కాదని చెప్పదలచితిని; కాని మాట నాలుకకుడనే ఆగిపోయినది. నామనస్సులో ఆమెప్రవర్తననుగూర్చి నడచుచుండిన తర్కమును ఆమె గ్రహించినదేమో ఆమెచహర తక్షణమే మారిపోయినది. చిరునవ్వు మాసిపోయినది; కన్నులలో దొలకాడు తేజస్సు ముఖమున కొక నూతనవికాసమును గలిగించినది. అరుణోదయమప్పటి పూర్వదిశవలె మొగము జేవురించినది. నామనస్థితిని ఆమె గ్రహించి నా యాందోళనను గని నన్ను హేళనచేసి విహసించుచున్నట్లు తోచినది. నాకోపము చలారినది.

గాంధిగారి దర్శన మైనది. ప్రార్థన, రామ్‌ధున్‌ఉపన్యాసము ముగిసినవి. ఇక మహాదేవనుగారికి కృతజ్ఞతాపూర్వకవందనములను సమర్పించి వీడ్కొని బయలువెడల బ్రయత్నమొనర్చితిని. కాని వారు నా కనుజ్ఞ ఈయక ఆగమని చెప్పి ఇంటిలోగిలివైపు తిరిగి, వారి ధర్మపత్నినుద్దేశించి "ఏండీ! ప్రొఫెసర్ పోరార్ - అందమ్మాకు తాంబూలంకుడుత్తు శుడక్కా ముడియ్," అని గొంతెత్తి చెప్పి, నావైపు ముఖమై, "ఐసే, ఓల్డ్‌ఫెల్లో, యు మస్ట్ కం హియర్ ఆఫ్టర్"అని యాహ్వానించినాడు. నేను ఆయనకు జవాబుచెప్పుటకు నోరుతెరచితిని. ఇంతటనే నా రెండవభార్య సతాంబూలనారికేళకరద్వయయై బయల్పడినది. ఆచార్యగారి సతీమణి "అందమ్మావయంగూడ కూపుటువాంగో"అన్నది, అనాలోచితముగ 'సరిన్'అని పలికితిని. నాగుండెలలో రాయిపడినట్లయినది. నాకేమి ఇట్టి దుర్బుద్ధి పుట్టినది? ఆమె యెవ్వరో? మగనాలో కాదో నాకు తెలియదు. పేరు, ఊరు ఎఱుగను, కులము, గోత్రము మాట చెప్పవలయునా? ఆసంగతి నటుండనిండు. నేను మహాసత్పురుషుడను అనుకొనే నాఇంటావె, చాల పెద్దమనిషి నని తలచు నాబిడ్డలు ఈ విషయమును విన్నచో నేమనుకొనెదరు? ఇరుగుపొరుగువా రెఱిగిన తలవంపగునుగదా? అని వ్యాకులపడుచు గేటు దాటితిని. ఏమనుకొనిననేమి? నా రెండవభార్యకును, నాకును వివాహమునకు గంధిగారి పుణ్యమున నిట్లు నిశ్చితార్థమైనది "నొసటన్ వ్రాసిన వ్రాలు దుద్దవశమా నూతేండ్లు చింతించినన్," అన్నాడు ఒక అధునాతనఅజ్ఞాతాంధ్రాభ్యుదయకవిసామ్రాట్టొకడు-ఎంత సత్యము!

* * * *

నిద్ర పట్టలేదు-గాలివీచుట మానివేసినది - ఉక్క-దేహమంతయు చెమరించిపోయినది. సరిగమపదనిసలతోటి దోమల సంగీతము చెవుల గింగురుమని మ్రోగుచున్నది. ఈశ్రమ నెట్లో యోర్చుకొనినను మనోవ్యాకుల మోర్వరాక పోయినది. ఆ నా రెండవభార్యప్రవర్తన కంటినలుసువలె బాధింపదొడగినది. ఎంతసాహసురాలు! నే నెవ్వరు, తానెవ్వరు? బస్సులో నెందఱు స్త్రీలు ప్రయాణము నేయుట లేదు? అందఱు నీమెవలె ప్రవర్తించిన మగవారి గతి యేమి కావలయును? ఆమె పేరుగూడ నే నెఱుగనుగదా. ఆచార్య మహాదేవ నీమెను నా భార్య యని భ్రమపడి ప్రకటించుచుండ, ఇదమర్థమనక మునిముసిన వులతో తాంబూలము బుచ్చుకొన్నది. ఎంతటి సాహసురాలు! కాని తప్పంతయు నామెపై మోపుట న్యాయమా? నే నెంతటి పెద్దమనుష్యుడను? పరస్త్రీని ఆచార్యులవారు ప్రమాదవశమున నాకు భార్యయని యంటగట్టుచుండ నే నేల వారికి వాస్తవస్థితిని దెలియజేసియుండకూడదు? మౌన మేల వహించితిని, మౌన మంగీకారసూచనయేకదా! నిజ మాచార్యులవారి కెఱుకపడిన నాచారిత్రమునుగూర్చి వా రేమని తలతురు? నే నొక ఖుంఠననియేగదా వా రభిప్రాయపడుదురు? ఇంటిలో మాయావిడచెవి సోకిన-భార్యలు గల మహనీయులారా; ఆ యాపద యెంతటి ప్రాణోపద్రవకరమో, మీ కందఱికి స్వానుభవమువలన చక్కగ తెలిసియేయుండునుగావున వివరించివ్రాయ నవశ్యములేదు. ఇంకొక రహస్యము వినండి, ఎప్పుడో జరిగిన సంగతిని మీతో చెప్పుకొనవలయునని కాగితము, కలము చేతబట్టుకొనగా కాగితము తెల్లబోయినది; కలము ముఖముమాడ్చుకొని ధుమధుమలాడుచు నల్లగ వ్రాయదొడగినది. దోమకాట్లవంటి ఈ భావములచే నా యంతరాత్మ బాధపడి బాధపడి యెప్పుడో సొమ్మసిల్లిపోయినది.

* * *

సాయంత్రము మూడుఘంటలు కొట్టినవి. కాఫీసమయము. మామూలుప్రకారము మా యింటి పెద్దహాలులో కుంపటి-కుంపటి కొకప్రక్క నేను, నాయెదుట మా యింటావె, మా కిరుప్రక్కల మా పిల్లకాయలు. పాలు సలసల క్రాగినవి. డికాక్షను, చక్కెర కలిపి యొక టంబ్లరుకాఫీ మా యింటావె అందిచ్చినది, ఒకగ్రుక్క త్రాగితిని. అప్రయత్నముగ నా మొగము చిట్లించుకొనిపోయినది. అన్నది మా యింటావె—

"ఏం, ఎట్లావున్నది?"
"బాగానేవున్నది!"
"మొహంచిట్లించారే!"

"చిట్లించానా?"

"ఏమీ యెఱుగరు, పాపము-నిజంగా చెప్పండి, కాఫీ యెట్లా వున్నదో?"

"కాఫీ కాఫీవలెనే వున్నది."

"పెద్దవారవుతున్నప్పటికీ చాత్రీలకు తక్కువలేదు."

"వినలేదా, చెట్టు ముదిరే కొద్దీ చావముదురుతుంటుందని"

"అబ్బా! చెప్పుదురూ, యెట్లా వున్నదో కాఫీ?"

"ఏమీ లేదు. చక్కెర తక్కువ."

"ఈ రేషన్‌కాలంలోగూడ చక్కెరవేసుకోవడం తగ్గించరాదూ?"

ఈ సరససల్లాపములలో నిమగ్నుడనైయుండగా వాకిటితలుపు తెరచిన శబ్దము వినిపించినది. త్రాగుచుండిన కాఫీని అక్లే క్రిందబెట్టి ఎవ్వరో కనుగొనవలెనని ముందటి హాలు లోకి నడచినాను. ఎవ్వరో కాదు. సుబ్బులుశాస్త్రిలు! ఆయనతో గూడ మఱియొక వైదికబ్రాహ్మణుడుకూడ ప్రవేశించినాడు- ఎప్పుడైన మాయింట నేమైన విశేషము జరిగితే శాస్త్రులువారి యధ్వర్యముక్రిందనే జరిగెడిది. కాబట్టి ఆయననుచూడగనే అడిగితిని—"ఏమండీశాస్త్రులవారూ తాము విజయంచేయుటకు కారణము?" అని.

"ఏమీ లేదు" అని నవ్వినాడు.

"నవ్వుతున్నారేమి?"

"శుభకార్యంగదా!"

"శుభకార్యమా?"

"పెండ్లికి మీరు సిద్ధంకాండి, అమ్మగారుకూడా వస్తూవున్నారు."

"అమ్మగారు వస్తున్నారా?"

"అవును, వారుగో" అని వాకిటివైపు చూపినాడు,

అటు చూతునుగా, వచ్చుచున్నది బిరబిరమని నా రెండవభార్య. ఆమెను చూడగనే పోయిన ప్రాణము లేచి వచ్చిన ట్లయినది, మనుష్యుని మనస్సు కడువింతయైనది; క్షణక్షణము మారుతూవుంటుంది, గాలితాకునకు తునకలై యనునిమిషమును మాయుచుండు మబ్బుతునకల రూపునకేని నిలకడగలదుగాని, మనస్సున కుండదు. ఇన్నిదినముల నుండియు శ్రీరంగనీతులు దిద్దుతూ వచ్చిన నా మనస్సు ఆమె నన్ను పెండ్లాడుటకై వచ్చినదని వినినంతనే తన పూర్వప్రచారమును విస్మరించినది. ఇంతేకాదు. ఎదుట ఇంకను కాఫీకుంపటిచుట్టు తిష్ఠవడియుండు నా భార్యాబిడ్డ

వేటూరి—

సుందరశాస్త్రిగారి

సువర్ణ సుందరరసము

సర్వసవామేహములకుసంజీవి.

గుణము ప్రత్యక్షము

అనుభవసిద్ధము. ఇన్‌జెక్షన్లు అవసరం లేదు. ఎటువంటి సవామేహాలనైనా కుదుర్చును.

50 మాత్రలు రు. 5.

ఆర్షరసాయనశాల, ముక్త్యాల.

గాలియాత్ర గ్రంథకర్తగారి

దివ్యచూర్ణాలు

మొండి వ్యాధులను ఖండించును.

శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ, మౌలానా అబుల్‌కలాంఅజాద్, ప్రభృతుల యెదుట రాంఘుర కాంగ్రెసులో నీటిలో యీది నట్టు గాలిలోకూడా యీదవచ్చునని రుజువు చేసినట్టియు, సర్. రాధాకృష్ణ మొదలగు వారిచే కొనియాడబడిన "గాలియాత్ర" గ్రంథమును రచించిన యోగిగారిచే యోగ శాస్త్ర రీత్యా తయారుచేయబడినవి.

ప్రాచీన యోగీశ్వరులు వ్యాధి నివారణ మునకు, నిత్య యౌవనమునకు, పూర్ణా యుర్దాయమునకు వాడుచూ వచ్చినట్టివియు, మానవదేహమునకు అత్యవసరమైనట్టివియు, సులభముగా జీర్ణమగునట్టివియునైన, అత్యధిక పోషక పదార్థములతో నిండియున్న ఔషధ రాజములు.

యోగి, యస్. వి. ఆచార్య,

శింగరాయకొండ (నెల్లూరు జిల్లా).

M. S. M. Ry.

SUNDARI ELIXIR

గర్భాశయరోగాలకు

ప్రసిద్ధ బలవర్ధకౌషధము

సర్వవిధాలైన ... ష్టు చిక్కులకూ

అనుపమ నివారిణి

సుప్రసిద్ధ భిషగ్వరులచే

ప్రశంసింపబడినది.

K. S. MEHTA & CO., 250, CHINA BAZAAR, MADRAS.



డోంగ్రేగారి

బాలామృతము
బలహీనమైన బిడ్డలకు
పుష్టియున్ను, బలమున్ను
ఆరోగ్యము నిచ్చును



కాశ్మీర్

అన్ని విధములగు దగ్గులు, ఉబ్బసము, ఆయాసము మొదలగు శ్లేష్మవ్యాధులకు అమోఘమైనది. సీసా రు.1-12-0. అన్ని మందుల షాపులలో అమ్మబడును.

గిరిజా అండ్ కో,
దానవాయిపేట, రాజమండ్రి.

మద్రాసుస్టాకిస్టులు: జె. బాలాభాయి & కో,
చెనాబజార్ రోడ్.



లోధ్ర ★★★

ప్రతి వనితకు, గర్భకోశ సంబంధమైన వ్యాధులనుండి విముక్తి నొసగి ఆనందం చేకూర్చుతుంది.



కేసరికుటీరం లిమిటెడ్. రాయపేట,
మద్రాస్.

నైజామ్ రాష్ట్రానికి, ఆంధ్రజిల్లాలకు,
తమిళనాడుకు ఏజెంట్లు:

సీతారామ జనరల్ స్టోర్స్,
సికిందరాబాదు-బెజవాడ-మధుర.

ఆను చూచియైన జంకక ముందంజ వేసినది. "క్షణక్షణముల్ ముదివారి చిత్తముల్" అని వ్రాక్రుచ్చిన యాంధ్ర కవితాపితామహుని వాక్యము సత్యము, సత్యము, ముమ్మాటికిని సత్యము. ఈ శాఖాచంక్రమణాన్ని క్షమించండి. జరిగిన సంగతిని జరిగినట్లు దాపరికములేక చెప్పెదను. ఆమెకు నేను ఎదురునడిచితిని. నేను సమీపమునకు వచ్చినంతటనే ఆమె యాగినది. ఒకరివైపు ఒకరు చూచుకొంటిమి. మా కన్నుల దృష్టులు మధ్య కలసి మా హృదయసమ్మేళనమును సూచించినవి. సుబ్బులుశాస్త్రులును, వైదికబ్రాహ్మణుడును చేరవచ్చి చెరియొకప్రక్క నిలిచిరి. నోరు తెరువలేదు, ఆమె అంతవఱకు ఎక్కడ దాచియుంచినదో ఒక్క రోజా పూలదండ ఎత్తి నా మెడలో వేసినది. ఆమె కన్నులనుండి వెలువడు నుజ్వలదీప్తికిరణములు, కొండచిలువకంటిచూపులు మృగమునువలె నన్ను ప్రజ్ఞాహీనుని గావించినవి. చేతు లప్రయత్నముగ నామెవైపునకు చాగి యామెమృదు శరీరము నావరించుకొనిపోయినవి. నోరు ఆమెయెఱ్ఱనిపెదవులను, గండస్థలములను, నీలకచములను ముద్దుగొనినది. ఆమెయంగసంస్పర్శనమువలన తన్మయమందినది. 'ఆనందో బ్రహ్మ'యను సూక్తియందలి నత్య మప్పుడు గ్రహించినది. ఆమె మాట్లాడగడగినది—"రాండి, పోదాము" అని. ఆ మాటలు నన్ను స్వర్గమునుండి భూజగమునకు డింపినవి. నిట్టూర్పువిడుచుచు, "ఎచటికి ?" అని యడిగితిని. "మన యింటి" కనినది. ఆమెనోటనుండి యామాట వెలువడినదో లేదో వెనుకకు దిరిగియైన చూడక బయలుదేరితిని. చాల దూరము నడువవలసివచ్చినది. కొత్తఇల్లు నుంగంబాకంలో కట్టించుకొన్నదట. అచ్చటనట మా హనిమూను. వర్షము సన్నతూరపడ నారంభించినది. మేమిద్దరము తడువవలసి వచ్చినది. ఆమెముఖముమీద వర్షబిందువులు ముత్యములై మారనారంభించినవి. తడిసిపోవునని వ్యధ. నేను తొడుగుకొనియుండిన చెక్కాకోటును తీసి యామెభుజములపై కప్పి చేతిరుమాలుతో ముఖమున తడి యొత్తజొచ్చితిని. ఎచ్చటి నుండి వచ్చిన వబ్బా ఈ నునుప్రేమదొంతరలు !

*　　　*　　　*

ఏదోయొక యానందప్రపంచమున నిర్యాణము నంది యున్నాడు. ఇంద్రియాతీతమైనది ఆయవస్థ. సర్వసృష్టియు లయమై నాయాత్మ యొక్కటియే సచ్చిదానందపరబ్రహ్మమునం దైక్యమునందినట్లు తోచినది. కాని దూరము నుండి శ్రావ్యమైన నాద మొక్కటి చెవిసోకినది. మొదట నన్పుటమై పూలనడుమ గుసగుసియాడు నళిమధురగానమును స్మరింపకుదెచ్చినది. క్రమక్రమముగ స్థాయి హెచ్చి యుషఃకాలమున దలి పక్షుల కాకలీధ్వనిగ మారినది. కొంత తడవునకు నది యొక పాటగ పరిణామమునందినది. ఎవ్వరో, ఎక్కడనో—

"నన్ను జూచి నవ్వబోకురో, ఓ ప్రాణనాథా,
　　నన్ను జూచి నవ్వబోకురో
నల్లనల్లనిదాన నని నన్ను జూచి నవ్వాబోకూ
　　నల్లరేగడు దున్ని చల్లితె తెల్లజొన్నలు పండలేదా."

ఇట్లుండగా, నన్ను ఎవ్వరో తట్టిలేపినట్లయినది. కన్నులు విచ్చి చూచితిని. ఏమి ఆశ్చర్యము! రాత్రి నాదగ్గర నుండిన నా రెండవభార్య యేదీ ? ఎట్లో అంతర్ధానము నందినది. మా పెద్దబ్బాయి "ఏమండీ నాన్నగారూ, ఈవేళ ఇంకా నిద్రబోతున్నారు ? కాఫీ చల్లారిపోతున్నదని అమ్మ కేకలేస్తున్న"దన్నాడు. "ఆ పాడే దెవ్వర్రా ?" అన్నాను. "తాయి నాయనా, కనుపూడుస్తున్నది." ఈమాటలు విన్నంతటనే నామనస్సు చివుక్కన్నది. జగత్తు మిథ్య యని సెలవిచ్చిన యాచార్యదేవుల మహావాక్యము పొల్లగునా ?



# మన చరిత్రసామగ్రీ, చరిత్రాను

## శాసనాలలోని వింతవిశేషాలు



= శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ =

మన దేశచరిత్ర మనం కొత్తగా ఇప్పుడు రచించుకోబోతున్నాం. కొత్తగా రచించుకుంటున్నాం అనగానే మనకు ఇంతవరకు చరిత్ర లేదా అనే ప్రశ్న కలుగుతుంది. ఒకవిధంగా చూస్తే మనకు చరిత్ర ఉంటూనేవున్నది, లేనూలేదు. మనకున్న చరిత్ర ఆధునిక శాస్త్రీయపద్ధతులమీద, ఆధునిక దృష్టితో రచించిన నేటి దేశచరిత్రలవంటిది కాదు. మనకున్న వేదవేదాంగ ఇతిహాస పురాణాది విద్యలలో ఇతిహాసమనేది చరిత్రే. మనకు ప్రాచీన ఇతిహాసాలు అనేకము లున్నాయి; కాని అవి యిప్పటి చరిత్రలవలె సాధన సామగ్రిని సేకరించి పరిశోధించి శాస్త్రీయపద్ధతిని ఒక్కొక్క చారిత్రక పరిణామానికి గల ప్రామాణికతను నిర్ణయించి వ్రాసినవి కావు. అవన్నీ మనకు పరంపరగా మన పూర్వులనాటినుంచీ వస్తూవున్న గాథలు; కథలు, వేలాది సంవత్సరాలనుంచి మన దేశంలో ప్రచారంలో వుంటూవచ్చిన కథలు. ఇతిహాగత గాథ ఇతిహాసమే. మహాభారతమూ, రామాయణమూ ఇతిహాసాలు చరిత్రలే. ఇవన్నీ నిజమేనా అంటే నిజం కావచ్చు, కాకపోనూవచ్చు. ఆధునికచరిత్ర వలె శాస్త్రీయపద్ధతిని సప్రమాణముగా రచించినవి కాకపోవడంవల్ల ఆధునికచరిత్రకారులు వీటిని అంత ప్రామాణిక దృష్టితో చూడరు. పైగా ఈ గాథాకారుల దృష్టికీ, నేటి మన దృష్టికీ చాలా భేదం ఉంది. వారు మతాన్ని ప్రధానంగా గ్రహించి తమ కాలంనాటి ధర్మలక్ష్యంతో ఆ యితిహాసాలు రచించారు. మన ఇప్పటి దృష్టి, లక్ష్యమూ వేరు. మనది జాతీయమయిన దృష్టి; జాతీయ అభ్యుదయం మన లక్ష్యం. మన జాతి ఏయే కాలాలలో ఉత్థానపతనాలు పొందింది, మన జాతిలో మనం [illegible] గర్వించదగ్గ వీరు లెవరు, మహాపురుషు లెవరు, వారు చేసిన ఘనకార్యా లేమిటి, వారు మనజాత్యభ్యుదయానికి ఎట్లా పాటుపడ్డారు, మన జాతికి చేకూర్చిన ఘనత ఏమిటి, ఎప్పటివరకు మనజాతి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు అనుభవించింది, మన స్వాతంత్ర్యం ఎప్పుడు పోయింది, ఎట్లా పోయింది, పరపరిపాలనక్రిందికి ఎప్పుడు వచ్చాము, స్వపరిపాలనకాలంలోనూ, పరపరిపాలన కాలంలోను మన సంఘమూ, కళలూ ఏవిధమైన పరిణామాలు పొందినవి, ఆర్థికసాంఘికరాజకీయవిధానాలు ఎట్లా వుంటూవచ్చినవి—ఈమొదలైన విషయాలు తెలిపే జాతీయచరిత్రలు కావాలి; జాతీయ దృష్టితో మన జాతిపరిణామాన్ని వివరించే జాతీయాభ్యుదయకరములైన చరిత్రలు కావాలి. ఇట్టి చరిత్ర లింతవరకు లేవు కాబట్టి వీటిని మనం కొత్తగా రచించుకుంటున్నాము. ఇంకా ఇంతవరకు మనకు సమగ్రమైన దేశచరిత్ర—ఆంధ్రదేశచరిత్ర—రాలేదు; కాని ఆప్రయత్నం ఇప్పటికి ఏభైయేళ్ళనుంచి జరుగుతూవుంది. ఈ ప్రయత్నఫలితంగా మన దేశచరిత్ర క్రమక్రమంగా సంపూర్ణమవుతున్నది; పూర్వకాలచరిత్ర ఒక్కొక్కయేడు గడచినకొద్దీ సుస్పష్టంగా తెలియవస్తూ వున్నది.

### మన చరిత్రసామగ్రి

ఈ విధమైన దేశచరిత్రరచనకు చరిత్రపరిశోధకులు సాధనసామగ్రిని సేకరించి, ఆ చరిత్ర రచనా సామగ్రి ప్రామాణికతా అప్రామాణికతలూ, ఆ సాధనాలవల్ల తెలియవచ్చే చారిత్రక విశేషాలూ, వాటివల్ల పరిష్కారమవుతున్న ప్రాచీన సమస్యలూ, కొత్తగా పుట్టుతున్న నూతన సమస్యలూ చర్చించి వ్యాసరూపంగానూ, గ్రంథరూపంగానూ ప్రకటిస్తున్నారు. హిందూదేశంలో ఏరాష్ట్రాన్ని [illegible] అనేకులు చరిత్ర పరిశోధకులు తమతమ రాష్ట్రాల గురించీ, జాతులను గురించీ, కులములను గురించీ పరిశోధనలు జరుపుతున్నారు. మన జాతీయ జీవనము బహుముఖమైనది. ఈ విధమైన జాతీయ జీవనమునకు సంబంధించిన

వివిధ అంశములను గురించిన చరిత్రలు రచించుటకు ప్రయత్నము లనేకములు జరుగుచున్నవి. ప్రాచీన కాలములోని మన ఆటలు పాటలు, నగలు నాణెములు, వేషములు భూషణములు, వేడుకలు వినోదములు, పండుగలు పర్వములు, ఆచారములు అలవాటులు, మతములు వ్రతములు, వంటింటలు పరిశ్రమలు, కూలి నాలి, వృత్తి చేతన, వర్తక వ్యాపార స్థితి, రాకపోకలు, యాత్రలు, నీటిపారుదలలు, వ్యవసాయపు ఆదాయాలు, భూమి పన్నులు, జమీందారీలు, గుత్త, చిల్లర, పుంకర, పుల్లరి, పోలీసుపని, కాపలా, దుర్గనిర్మాణం, రాజ్యరక్షణ, రాజ్యాంగపద్ధతి, లెక్కడొక్క, చదువు సంధ్య — ఈ మొదలైన అనేక విషయాలను గురించి మనకు చరిత్రలు కావాలి; పూర్వం నుంచి ఇప్పటివరకు ఈ యా విషయాలలో మన దేశంలో స్వపరిపాలనకిందా, పరపరిపాలనకిందా ఎట్లెట్లా మార్పులు వచ్చి, ఈ యా విషయాలలో మనం ఎప్పుడెప్పుడు ఏయే కారణాలవల్ల తిరోగమనమూ పురోగమనమూ పొందుతూ వచ్చాము — ఈ మొదలయిన విషయాలు తెలిపే చరిత్రలు కావాలి. ఇట్టివే బహుముఖమైన మన జాతీయ జీవన పరిణామాన్ని వివరించే చరిత్రలు. చరిత్ర ఎవరికో ఇతరులకు సంబంధించినదీ కాదు, ఒకరిద్దరికి సంబంధించినదీ కాదు. ఒక్క రాజకీయానికి సంబంధించినదీ కాదు, ఒక్క వ్యాపారానికి సంబంధించినదీ కాదు. అది మన ప్రాచీన జీవన చరిత్ర. అది నీదీ, నాదీ, అందరిదీ; మన సమగ్రమైన జాతీయచరిత్ర.

ఇటువంటి చరిత్ర రచించడానికి మనకున్న సాధనసామగ్రి ఇది: ౧ శాసనములు. ౨. నాణెములు, 3. వాఙ్మయము, ౪ పురాతత్వ శాస్త్రము. ఈ నాలుగింటిలోనూ అత్యంత ప్రధానమైన చరిత్రసామగ్రి శాసనములు.

## శాసనములు

ముఖ్యంగా శాసనాలు రెండు రకాలు: (౧) లోహశాసనాలు, (౨) శిలాశాసనాలు. శాసనాలన్నీ అసలు మన చరిత్రరచనకు ఉపకరించుటకు ఉద్దేశింపబడి వ్రాసినవి కావు. ఈ శాసనములు నేటి శాసన నిర్మాణసభలలో చేసే శాసనములవంటివీ కావు. చరిత్ర సామగ్రిలోని వని చెప్పే ఈ శాసనాలకూ, శాసననిర్మాణసభలలో చేసే శాసనాలకూ ఏమీ పోలికలేదు. ఇవి వేరు, అవి వేరు. మన శాసనములు దానపత్రములు. మన పూర్వులు బ్రాహ్మణులకు కాని, దేవాలయములకుగాని, మఠములకు గాని, సన్యాసులకుగాని, యతులకు గాని భూమినైనా, ఒక గ్రామాన్నైనా పన్ను పన్యాగాలు తొలగించి దానం ఇచ్చినప్పుడు దానపత్రం వ్రాసేవారు. ఈ దానపత్రం వెండి, బంగారం, రాగి మొదలైన లోహపు రేకులమీద కాని, రాళ్ల మీదకాని చెక్కేవారు. ఇటువంటి దానపత్రాలు లోహపురేకులమీద చెక్కినవీ, రాతిమీద చెక్కినవీ కూడా అనేకములున్నవి. వీటికి శాసనములని పేరు. లోహపు శాసనాలలో బంగారపువీ, వెండివీ, రాగివీ కూడా వున్నప్పటికీ మనకు ఎక్కువ విశేషంగా కనిపించేవి రాగి శాసనాలే. బంగారపు శాసనాలు చాలా అరుదు. నూటికీ కోటికీ ఒకటైనా దొరుకుతుందో లేదో! వెండిశాసనాలుకూడా అరుదుగానే వున్నా బంగారపు రేకులమీద చెక్కిన శాసనాలకంటె ఎక్కువగానే వున్నవి. విజయనగర రాజయిన శ్రీ రంగరాయలు ఇచ్చిన వెండిశాసనాన్ని శ్రీ కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో ప్రకటించారు. మనకు చాలా సర్వసాధారణంగా కనిపించేవి తామ్రశాసనాలు.

భూమినిగాని, ఒక గ్రామాన్నికాని పన్ను పన్యాగాలు లేకుండా ఒకరికి దానమిచ్చే హక్కు వేయిరెండువేల సంవత్సరాల క్రితంవరకు ప్రధానంగా రాజుకు మాత్రమే ఉండేది. భూమి అంతా దేశాన్ని పరిపాలించే రాజుది. ఒకవేళ ఎవరైనా కొంతభూమిని తమ ఆశ్రితులైన బ్రాహ్మణులకు గాని, మరెవ్వరికి గాని దానం చేయదలచినట్లయితే రాజును వేడుకొని అట్లా చేయవలసిందేకాని తాము స్వయంగా ఇవ్వడానికి వీలు లేదు. ఫలానవారి ప్రార్థనమీద రాజు తాను ఫలాన వారికి భూమినో, గ్రామాన్నో దానమిచ్చినట్లు దానపత్రం రాగిరేకులమీద వ్రాయించి ఈ తామ్రశాసనాన్నీ, ఆ భూమినీ ప్రతిగ్రహీతకు ఇచ్చేవాడు. బ్రాహ్మణులకు రాజులు భూదాన, అగ్రహారదానాలు ఏయే సమయాలలో ఎప్పుడెప్పుడు చేయాలో, చేసిన తరువాత దానపత్రం ఏవిధంగా వ్రాయించాలో ఈ విషయమంతా మన ప్రాచీనధర్మశాస్త్రగ్రంథాలయిన ధర్మశాస్త్రాలలో వ్రాసే ఉంది. దానపత్రం వెండి, బంగారం, రాగి మొదలైన లోహపు రేకులమీద వ్రాయించాలనీ, అర్ధోదయ మహోదయ, ఉత్తరాయణ, దక్షిణాయన, సూర్యగ్రహణ, చంద్రగ్రహణ పుణ్యకాలాలలోను, ఇంకా యితరపర్వసమయాలలోను భూదాన, అగ్రహారదానాలు వేదవేదాంగేతి

సాలు చదివిన బ్రాహ్మణులకు దానంచేయవలెననీ, దాన శాసనములో దానమిచ్చిన ప్రభువు పేరూ, అతని తండ్రి తాతలపేర్లనూ, దానముపట్టిన ప్రతిగ్రహీత పేరూ, ఇతని తండ్రి తాతలపేరూ వ్రాయాలనీ, దాన కాలము (ఏ మాసములో ఏ పక్షములో ఏ తిథినాడు ఏ పర్వసమయంలో దానమిచ్చినదీ) తెలుపవలెననీ, దానమిచ్చిన భూమికి కాని, అగ్రహారమునకుగాని సీమాంతములు (సరిహద్దులు) పేర్కొనవలెననీ, దానఫలమును వివరించే వ్యాసప్రోక్తమయిన శ్లోకములు దాన పత్రముచివర వుదాహరించవలెననీ సూత్రగ్రంథాలలో చెప్పివున్నది. అతి ప్రాచీనములైన గౌతము, బోధాయన, ఆపస్తంబాది ధర్మసూత్రాలలో ఈ దానశాసన రచనావిధానం వివరింపబడివున్నది. ఈ నియమాలు తరువాత చాలాకాలానికి పుట్టిన ధర్మశాస్త్రాలలో కూడా వున్నవి. ఈవిధంగా అసలు తామ్రశాసనం పుట్టింది బ్రాహ్మణులకు పూర్వపురాజులు చేసిన భూదాన అగ్రహార దానములను తెలుపడానికే. సంపన్నులైన మహారాజులు ఒక్కొక్కప్పుడు ఈ శాసనాలను బంగారురేకులమీదా, వెండిరేకులమీదా కూడా చెక్కించి యిచ్చేవారు.

అసలు శాసనం ప్రధానంగా బ్రాహ్మణులకు చేసిన దానం తెలుపడానికే పుట్టినా ఇతర విషయాలకు సంబంధించిన శాసనాలు కూడా వున్నవి; కాని ఇవి చాలా అరుదు. బౌద్ధమతాభిమాని కనిష్కుడనే మహారాజు బౌద్ధధర్మసూత్రాలు వెండిరేకుల మీద చెక్కించి తాను కట్టించిన ఒక బౌద్ధస్తూపంగర్భంలో పూడ్చిపెట్టి పదిలపరిచాడు. ఇటువంటివే వరకొన్ని వెండిరేకులు బర్మాలోని కొన్ని పెగోడాలలో దొరికినవి. బౌద్ధుల ఆలయాన్ని మన దేశంలో చైత్యమనీ, స్తూపమనీ, సింహళములో దాగోబా అనీ, బర్మాలో పెగోడా అనీ వ్యవహరిస్తారు. ఇటువంటి ధర్మసూత్రాలే కాకుండా వర్తక వ్యాపారాలకు సంబంధించిన శాసనాలు కూడా వున్నవి. తంజావూరు ఆంధ్రనాయక రాజులలో ఒకడైన విజయరాఘవనాయకుడు తెను డచ్చి వర్తకులు నాగపట్నం రేవులో వర్తకవ్యాపారం నడుపుకోడానికి అనుమతియిస్తూ వారి కేయేషన్షుల మీద ఆరేవులో వర్తకం చేసుకోడానికి అనుమతించిందీ ఒక వెండిరేకుమీద వ్రాయించియిచ్చాడు. విజయరాఘవ నాయకుడు డచ్చివారి కిచ్చిన కౌలుపత్రపు వెండిశాసనం బటేవియా మ్యూజియములో ఇప్పటికీ పదిలంగా వున్నది. ఇటువంటి శాసనాలు ఏకొద్దిగానో అరుదుగా వున్నప్పటికీ అసలు రాగిశాసనం దొరికిందనగానే అది ఏబ్రాహ్మణుడికో పూర్వం ఈ దేశాన్ని పాలించిన రాజు చేసిన భూదానాన్నో, అగ్రహారదానాన్నో తెలుపుతుందని నిశ్చయంగా చెప్పవచ్చును.

తామ్రశాసనాలు మనకు క్రీస్తుశకం నాలుగవ శతాబ్దినాటినుంచి యిచ్చినవి దొరుకుతవి; మన దేశంలో దొరికిన అతిప్రాచీనమైన తామ్రశాసనాలు ఇప్పటికి రమారమి పదిహేను, పదహారువందల సంవత్సరాలనాటివి. మన కిప్పటికి దొరికిన తామ్రశాసనాలన్నీ బ్రాహ్మణులకు పూర్వపురాజులు చేసిన భూదాన, అగ్రహారదానములు తెలిపేవి కావడంవల్ల ఇవి అన్నీ సంస్కృతభాషలోనే వ్రాసివుంటవి. యజ్ఞయాగాదులకూ, బ్రాహ్మణునికీ ప్రాధాన్యము గల కాలము ఈ తామ్రశాసనయుగం. ఈ యుగంలో వేదవిద్యలకూ, వేదమతానికీ ఆదరం ఎక్కువగా ఉండేది; రాజపోషణక్రింద ఈవిద్యలూ, మతమూ, కళలూ అభివృద్ధిపొందినవి.

ఈ తామ్రశాసనాలు ఏకాలపువో చూచీ చూడడంతోనే చెప్పడానికి కొన్ని కొన్ని గుర్తులున్నవి. మొట్టమొదట పుట్టిన శాసనాలలో ఒక్కొక్క శాసనంలో మూడురేకులుమాత్రమే ఉండేవి. ఈరేకులు ఒక్కొక్కటి పలుచగానూ, పొడుగుతక్కువగానూ ఉండేవి. ఒక్కొక రేకు వెడల్పు అంగుళము, అంగుళంన్నర. రేకుమీద ఒక్కొక్క పెడను రెండేసి పంక్తుల వ్రాత ఉండేది. మన యిప్పటి అచ్చయిన పుస్తకాల పుటలమీదలాగే ఈ తామ్రశాసనగ్రంథంపుటలమీదకూడా అంకెలుంటవి. ఈవిధమైన లక్షణాలుగల తామ్రశాసనం అత్యంత ప్రాచీనమైనదని నిశ్చయించవచ్చు.

కాలం గడచినకొద్దీ రేకుల పొడుగువెడల్పులు పెరిగినవి. రేకులకు అంచులతీర్పు వచ్చింది. రేకు ఒక్కొక్కపెడను అయిదు, ఆరు, ఏడు, ఎనిమిది, తొమ్మిదేసి పంక్తులు వ్రాస్తూ వచ్చారు. రేకుల మందమూ, రేకుల సంఖ్యాకూడా క్రమక్రమాన ఎక్కువయింది. రమారమి ఏడెంగుళాల పొడుగూ, రెండంగుళాలూ, అంతకించుక తక్కువా వెడల్పూ గల రేకులలో పదహారువందల సంవత్సరాలక్రితం ఆరంభమైన తామ్రశాసనం విజయనగరరాజ్యసంస్థాపన కాలం, అనగా క్రీస్తుశకం ౧౩౩౬ నాటికి మహాఘనత గడించింది. రేకుల మందం పెరిగింది; రేకులు పొడుగెదిగి

ఈ కాలంనాటికి చిన్నపిల్లల పలకలంతటివయినవి. రేకుల కంచులు స్ఫుటంగానూ, దళసరిగానూ ఏర్పడ్డవి. ఇట్టి శాసనాలు తూకంవేస్తే, వీటిలో కొన్ని వీసెలు కాగు, మణుగులుకూడా తూగేవి ఉన్నవి. ఈ కారణం చేతనే ఈ శాసనాలు దొరికినవారు అనేకులు వీటి చారిత్రకమైన విలువ తెలియక ఇవి బంగారపురేకులు కావని తెలియగానే నీళ్ల కాగులూ, డేగిసాలూ, ఇతర పాత్రలూ చేయించుకోడానికి వీటిని కరిగించివేస్తు న్నారు. మన దేశచరిత్రమీద అభిమానం కలవారందరూ తామ్రశాసనాలకు ఈగతి పట్టకుండా కాపాడాలి.

విజయనగరసామ్రాజ్యాధీశులు తమ దానశాసనా లను పలకలవంటి రాగిరేకులమీద వ్రాయించేవారు. అంతవరకు రాగిరేకులు అడ్డముగా పెరుగుతూవస్తే ఇక్కడినుంచి అవి నిలువుగా పెరుగుతూవచ్చినవి. ఇటు వంటి రాగిపలకల శాసనం ఎక్కడయినా దొరికితే అది విజయనగరసామ్రాజ్యకాలంనాటిదనీ, ౧౩౩౫ తరు వాతిదనీ స్థూలంగా చెప్పవచ్చు. విజయనగరసామ్రా జ్యాన్ని పాలించిన రాజవంశాలు నాలుగు: అవి ఏవంటే, (౧) సంగమవంశం, (౨) సాళువవంశం, (౩) తుళువ వంశం, (౪) ఆరవీటివంశం. మొదటి రెండువంశాల వారూ ఇచ్చిన దానశాసనాలలో శాసనం ఒక్కంటికి మూడేసి రేకులుమాత్రమే ఉంటవి. అంతటినుంచి రేకుల సంఖ్య పెరుగుతుంది; రేకుల పరిమాణమూ క్రమంగా పెరుగుతుంది. తంజావూరుమధురనాయకరాజుల కాలా నికి, అంటే క్రీస్తుశకం పదిహేడు పద్దెనిమిది శతాబ్దుల నాటికి శాసనపురేకులు ఒకమాత్రపు నిలువైన కడప రాతిపలకల పరిమాణానికి వచ్చినవి.

ఈ శాసనపు రేకులను ఒక కడియములో గుచ్చి, ఆ కడియపుకొనలు రాజముద్రికదిగువభాగంలో తాపటం చేస్తారు. ఆ ముద్రికమీద దానమిచ్చిన రాజు బిరుదము కాని, ఇతర రాజలాంఛనములు కాని, లేక రెండూ కాని ఉంటవి. ఉబ్బెత్తుగ తీర్చి సూర్య, చంద్రుల ప్రతిమ లుంటవి; దాత శైవమతం అవలంబించినవాడయితే నందీ, వైష్ణవమతం అవలంబించినవాడైతే గరుడలాంఛ నమూ ఉంటుంది; లేదా ఇతరసంకేతా లుంటవి. రాజ ముద్రిక, కడియము, రేకులు—వీన్నిటితో కూడినది తామ్రశాసనము. రాజముద్రిక లేని శాసనము చెల్లదు. రిజిస్ట్రారుఆఫీసులోని స్టాంపువంటిది రాజముద్రిక. రిజి స్ట్రారు ఆఫీసుముద్ర లేని పత్రానికి ఎట్లా చెలామణీ లేదో అదేవిధంగానే రాజముద్రిక లేని దానశాసనమూ చెల్లదు. దాతసంతతిరాజులు ఎవరైనాకాని, వారిని జయించి దేశాన్ని ఆక్రమించుకొన్నరాజులు ఎవరైనా కాని ఈ భూమి, లేదా ఈ యగ్రహారము మాదికాదని అభియోగం తెస్తే ప్రతిగ్రహీతసంతతివారు ఈ తామ్ర శాసనం చూపి తమ కాభూమిమీద, లేదా అగ్రహారం మీద ఉండే హక్కు స్థిరపరుచుకొనేవారు. అందువల్ల ఈ తామ్రశాసనాలు పొందినవారు ఈ రేకులను ఒక కుండలో వుంచి భూమిలో పాతిపెట్టి జాగ్రతపరుచు కునేవారు. మన పూర్వులు సామాన్యంగా ధనంకాని, విలువైన వస్తువులుకాని దాచుకొనే పద్ధతి యిదే. ఈ కారణంచేతనే నేడు మనకు ఈ తామ్రశాసనాలు పాడుపడిన గ్రామాల పాటిదిబ్బలలోను, పొలముల లోను సాధారణంగా కుండలలో పెట్టి దొరుకుతూ వుంటవి.

ఈ తామ్రశాసనాలు దొరికిన స్థలాలు ఆ శాసన ప్రతిగ్రహీతలవే అనికాని, ఈ శాసనాలు దొరికినవారు కాని, కలిగినవారుకాని ఆ శాసనప్రతిగ్రహీతల వంశం వారే అనికాని చెప్పడానికి ఇపు డెంతమాత్రమూ వీలు లేదు. క్రీస్తుశకం నాలుగవశతాబ్దినుంచి క్రీస్తుశకం పద్దెనిమిదో శతాబ్దివరకూ మన దేశంలో ఎన్నెన్ని పరివర్తనాలూ, విప్లవాలూ వచ్చినవి. ప్రాచీన రాజ వంశాల వారిలో ఒండొరులకు భయంకరయుద్ధాలు జరుగుతూవచ్చినవి; దేశాధిపత్యం ఒక వంశాన్నుంచి ఇంకొక వంశానికి మారుతూవచ్చింది. ఇంతేకాదు, దేశీయప్రభువుల పరిపాలనం పోయి విదేశీయుల పరి పాలనం వచ్చింది. శత్రురాజుల దండయాత్రలు; విమత స్థుల దండయాత్రలు—ఈదేశానర్థకరాలైన సంక్షోభాలు ఒకటా రెండా, ఒకమాదిరివా ఒక విధమైనవా ?— ఈ సంక్షోభాలలో, ఈ విప్లవాలలో పూర్వపు రాజు లిచ్చిన భూములూ, అగ్రహారాలూ ప్రతిగ్రహీతల వం శాలవారు అనేకకారణాలవల్ల కోల్పోతూవచ్చారు. అందువల్ల నేడు మనకు దొరికే తామ్రశాసనాలు పొందిన ప్రతిగ్రహీతల వంశాలవారినీ గుర్తించడం కష్టమే; శాసనోక్తములైన అగ్రహారాలూ, భూములూ ఆ వంశంవారివని స్థాపించడమూ అసాధ్యమే. అయితే ఒకటి. మనకు దొరికే శాసనాలు క్రీ. శ. ౧౩౨౫ నాటి తరువాతకాలంలో ఇచ్చినవైతే, అంటే ఓరుగంటి కాకతీయసామ్రాజ్యం ముస్లిము దండయా త్రల ధాటి కాగలేక ౧౩౨౩ లో కూలిపోయినపిదప మళ్లీ ఆంధ్రులు ముస్లిములను వెళ్లగొట్టి స్వాతంత్ర్యం స్థాపించిన తరువాతికాలంలో పుట్టినవైతే ఆ దానం పొందిన ప్రతిగ్రహీతల వంశాలవారు ఆ యగ్రహారా

లను అనుభవిస్తూవుంటే వుండవచ్చు; ఇటువంటివైనా రైనా చాలా తక్కువ. ౧౩౦౦తరువాత మన తెలుగు దేశాన్ని ప్రధానంగా పాలించిన రాజవంశాలు మూడు: (౧) కొండవీడు, రాజమహేంద్రవరం, కందుకూరులు రాజధానులు చేసుకొని యేలుబడి నెరపిన రెడ్డిమన్నీల వంశం; (౨) రెడ్డిమన్నీలను జయించి ప్రాగాంధ్రదేశం పరిపాలించిన ఒడ్డెరాజులు కటకం గజపతులవంశం; (౩) తుంగభద్రాతీరస్థమైన విజయనగరం రాజధానిగా ఏలిన విజయనగరరాజవంశాలవారు. ఈ వంశాలలోని రాజులిచ్చిన అగ్రహారాలను పూర్తిగా కాకపోయినా అంగుళంలోని కొన్ని వృత్తులకైనా అనుభవిస్తున్నవారు నేటికీ అక్కడక్కడ లేకపోలేరు. కాని పూర్వానికి పోయినకొద్దీ ఇట్టివారి సంఖ్య తక్కువ; ఇటీవలికాలానికి వచ్చినకొద్దీ ఎక్కువ. అందువల్ల మనకు దొరికే శాసనాలలోని అగ్రహారాలు సర్వసాధారణంగా చాలా మంది చేతులు మారినవి; ఆ ప్రతిగ్రహీతల వంశాల వారికీ, ఆ శాసనోక్త అగ్రహారాలకూ నూటికి తొంభై యైదుపాళ్లు ఏమీ సంబంధం లేదు.

క్రీస్తుశకం నాలుగవ శతాబ్దినుంచి క్రీస్తుశకం పదకొండో శతాబ్దివరకూ గల కాలం ప్రధానంగా తామ్రశాసనయుగం అనవచ్చు; అటుతరువాతిది శిలాశాసనయుగం. తామ్రశాసనయుగం అనగానే ఆ కాలంలో బొత్తుగా శిలాశాసనములే లేవని కాని, శిలాశాసనయుగం అంటే ఆయుగంలో తామ్రశాసనాలే లేవని కాని యెంచకూడదు. తామ్రశాసనయుగంలో నూటికి తొంభై వంతులు తామ్రశాసనాలే; మిగిలినవి శిలాశాసనాలు. ఈవిధంగానే శిలాశాసనయుగంలో నున్నూ. ఈ కాలంలో శిలాశాసనాలే ఎక్కువ; తామ్రశాసనాలు తక్కువ. తామ్రశాసనం మహారాజులైన క్షత్రియులూ, బ్రాహ్మణులూ ఆధిపత్యానికి సూచన; శిలాశాసనం ప్రజలలో కలిగిన ప్రబోధానికీ, వారి స్వాతంత్ర్య అధికారప్రాబల్యానికీ నిదర్శనం. శిలాశాసనయుగం అంటే మన దేశంలో మన జాతీయజీవనంలో వివిధ విధాలైన పరివర్తన కలిగిన కాలం. ఈయుగంలో దేశం ఒక శతాబ్దిలోకంటె ఒక శతాబ్దిలో తెలుగు మారింది; ప్రజాబాహుళ్యానికి బలం చేకూరింది. జనసామాన్యంలో ఒక కొత్త చైతన్యం కలిగింది. ప్రజ్ఞాపాటవాలు కలిగిన సామాన్యసంసారికల్లా పారుపత్యం లభించింది. వర్తకవ్యాపారం విస్తరిల్లింది. శిలాశాసనయుగం అద్భుతమైన మార్పుకాలం.

క్రీస్తుశకం పదకొండో శతాబ్దినుంచే మనకు శిలాశాసనాలు అధికంగా కనిపిస్తవి. యజ్ఞయాగాదులు వెనకబడి దేవాలయానికి ప్రాముఖ్యం రావడంతోనే, సమూహ మీద జనసామాన్యం దేవుని అర్చించే పద్ధతికి (Congregational Worship) ప్రాబల్యం కలగడంతోనే శిలాశాసనం వచ్చింది. శిలాశాసనయుగంప్రారంభకాలంలో వచ్చిన శిలాశాసనాలన్నీ దేవునికి నందాదీపానికి చేసిన నేతిదానాన్ని తెలిపేవే. భీష్మాచార్యులవారు అంపశయ్యమీద పరుండి ఉత్తరాయణపుణ్యకాలంకోసం నిరీక్షిస్తూవున్న చివరిరోజులలో ధర్మరాజుకు వివిధధర్మాలుపదేశించారట. ఆ వుపదేశించినవాటిలో దీపదానమాహాత్మ్యం ఒకటి. ఆవునేతితో కాని, మేకనేతితో కాని, గొర్రెనేతితో కాని, మనుష్యసముదాయాలలో ఎవరైనా దేవునికి నందాదీపం పెడితే వారు మృతిపొందిన తరువాత చిరకాలం జ్యోతిర్లోకంలో వుంటారనీ, ఈ దీపదానం చేసినవారి కఖండమైన పుణ్యం కలుగుతుందనీ భీష్ములవారు ధర్మరాజుకుపదేశించారట. ఈ దీపదానమాహాత్మ్యం మహాభారతం శాంతిపర్వంలో వుంది. జనసామాన్యంలో సంచలనం కలిగినకాలం అది. వీసమాత్రం శక్తివున్నా దీపదానం చేశారన్నమాటే ఆకాలంలో. యజ్ఞయాగాదులకు ప్రాధాన్యం తగ్గి దానధర్మాలకూ, వ్రతాలకూ క్రమంగా ప్రసక్తి, ప్రాబల్యమూ హెచ్చింది.

శిలాశాసనయుగంలో కలిగిన రెండవ ముఖ్యమైన మార్పు ఇది: భూవసతి వున్నవారు రాజు అనుమతి తీసుకోకుండానే తన యిచ్చవచ్చినవారికి తన భూమి దానంచేసే హక్కు సంక్రమించింది. అది ముఖ్యంగా దానధర్మాల కాలం అవడంవల్ల చాలా మంది భూమివున్నవారు గొప్పగొప్ప క్షేత్రాలలో వున్న దేవాలయాలలో వృత్తులు ఏర్పాటుచేసి వృత్తిమంతులకు ఆ వృత్తిచేసినంతకాలం వనికట్టు భూము లిచ్చేవారు. నట్టువకాడికి, మార్దంగికుడికి, గాయకుడికి, స్వామికి గొడుగుపట్టేవాడికి ఈవిధంగా దేవాలయపు నౌకరీచేసేవారికి ఈ నామ భూములు పుట్టినవి. ఈ భూములలో చాలా భాగం సామాన్యసంసారులూ, వైశ్యులూ, దొరలూ ఇచ్చినవే. ఇదొక గొప్ప మార్పు.

అయితే ఒక్క విషయం జ్ఞాపకం వుంచుకోవాలి. ఈ శిలాశాసనయుగం రెండవది; మొదటిది క్రీస్తుపూర్వంనుంచి క్రీస్తుశకం నాలుగవ శతాబ్దిదాకా గల కాలం. అంటే, తామ్రశాసనయుగానికి పూర్వపు

కాలం మొదటి శిలాశాసనయుగం. ఈ యుగంలో మన దేశంలో బౌద్ధమతం బాగా ప్రబలింది. మన చరిత్ర ఈ మొదటి శిలాశాసనయుగంలోనే ప్రారంభమవుతుంది. అప్పటి దానశాసనా లన్నీ శిలలమీద చెక్కినవే. బౌద్ధభిక్షువులు (సన్యాసులు) కొండగుహలలో వర్షాకాలం నాలుగునెలలూ గడిపి మిగతా ఎనిమిది నెలల కాలమూ ఊరూరా దేశం అంతటా తిరిగి ప్రజలకు బౌద్ధమతబోధ చేసి బౌద్ధమతాన్ని వ్యాపింపచేస్తూవచ్చారు. గృహస్థాశ్రమం అవలంబించివుండే బౌద్ధశాస్త్రానుసారంగా జీవితం గడపడానికి ప్రయత్నిస్తూ వచ్చే గృహస్థులైన ఉపాసకులు (బుద్ధభక్తులు) బౌద్ధసన్యాసులు వర్షాకాలం నాలుగునెలలూ నివసించడానికి కొండలలో గుహలు దొలిపించి యిచ్చేవారు. బౌద్ధ సన్యాసులకు సంవత్సరానికి కావలసిన బట్ట లిచ్చేవారు. ఈవిధమైన దానాలు చేసి కొండగుహల మీద తమ దానాలు చేసినట్టు శాసనాలు వ్రాయించేవారు. ఇటువంటి దానశాసనాలు రాజులవీ ఉన్నాయి; రాజులు కానివారివీ ఉన్నవి. ఇవికాక మరోవిధమైన దానశాసనాలు ఉండేవి. బౌద్ధస్తూపాలకు బౌద్ధగాథలు పాలరాతిమీద చెక్కించి వాటిని దానంచేయడమూ, బౌద్ధస్తూపాలకు స్తంభాలు ఎత్తించడమూ, బౌద్ధభిక్షువులకు విహారాలు కట్టించడమూ, చైత్యమందిరాలు కట్టించడమూ—ఈమొదలైనవి బౌద్ధం వ్యాపించిన కాలంలో పుణ్యకార్యాలుగా పరిగణింపబడుతూవచ్చినవి. ఈవిధమైన ధర్మకార్యాలు చేసి ధర్మాత్ములు దానశాసనం వ్రాయించేవారు. ఈవిధమైన దానశాసనాలు బౌద్ధస్తూపపు రాళ్ళమీదా, బౌద్ధవిహార మండపపు రాళ్ళమీదా చెక్కిఉంటవి. మన దేశంలో బౌద్ధం ప్రబలిననాడు కృష్ణా, గోదావరీతీరాల స్తూపములూ వెలసినవి; బౌద్ధులకు గుహలూ నిర్మితాలైనవి. మన తెలుగుదేశంలోని గుంటుపల్లి (పశ్చిమగోదావరిజిల్లా), ఉండవల్లి (గుంటూరుజిల్లా), ఎర్రంపాలెం (తూర్పుగోదావరి జిల్లా) గుహలు బౌద్ధులవే; బౌద్ధయుగంనాటివే. అమరావతి (గుంటూరు), నాగార్జునకొండ (గుంటూరు), ఘంటశాల (కృష్ణా)లలోని బౌద్ధస్తూపాలు తెలుగుదేశంలోని స్తూపాలన్నిటిలో ప్రధానమైనవి. భట్టిప్రోలు, అమరావతి, నాగార్జునకొండస్తూపాలలోని రాళ్ళమీద చెక్కిన దానశాసనాలు అనేకములున్నవి. ఇవన్నీ మొదటి శిలాశాసనయుగంనాటివి. అంటే, క్రీస్తుశకం నాలుగవ శతాబ్దికి పూర్వపువి. భట్టిప్రోలు స్తూపశాసనాలు క్రీస్తుకు రెండువందల సంవత్సరాలకింకా పూర్వపువనీ, కొంచెమించుమించుగా మౌర్యవంశజుడైన అశోకచక్రవర్తినాటివనీ ప్రాచీనలిపిశాస్త్రజ్ఞుల అభిప్రాయం. మన తెలుగుదేశంలో కనబడిన మొదటి శిలాశాసనాలు ఇవే. ఇటీవల కర్నూలుజిల్లా ఎర్రగుడిలో అశోకచక్రవర్తి అచ్చటి కొండరాళ్ళమీద వ్రాయించిన ధర్మశాసనాలు కనబడ్డవి. అందువల్ల అశోకచక్రవర్తి ధర్మశాసనాలూ, భట్టిప్రోలు, అమరావతీ, నాగార్జునికొండస్తూపపుశాసనాలూ—ఇవే మన దేశంలో ఇంతవరకు కానవచ్చిన మొదటి శిలాశాసనాలు—మొదటిశిలాశాసనయుగంనాటివి. మొదటి శిలాశాసనయుగంలో చూశామంటే ఇంతవరకు ఒక్క తామ్రశాసనమైనా కానరాలేదు. అచ్చం శిలాశాసనయుగమిది. బౌద్ధమతం ప్రభ తగ్గి, జనులలో బౌద్ధం మీద ఆదరం తగ్గినప్పటినుంచి మళ్లీ దేశంలో యజ్ఞయాగాదులతో కూడిన వేదమతం—పౌరాణికమతం—విజృంభించింది. ఈ మతాన్ని ఆనుకొని పోషించినవారు క్షత్రియులు. ఈ పౌరాణికమతం విజృంభించిన కాలమే తామ్రశాసనయుగం. శాసనాల ననుసరించి చూస్తే అత్యంతప్రాచీనకాలం మొదటి శిలాశాసనయుగం; క్రీస్తుశకం నాలుగవ శతాబ్దినుంచి పదకొండవ శతాబ్దివరకు తామ్రశాసనయుగం. పదకొండవ శతాబ్దినుంచి ద్వితీయశిలాశాసనయుగం.

ఇక రెండుముక్కలు చెపుతాను లిపినిగురించీ, భాషనుగురించీని. మన హిందూదేశం అంతటిలోను కనబడే—చారిత్రికంగా ముఖ్యమైన అత్యంతప్రాచీనశాసనాలు మౌర్యవంశజుడైన అశోకచక్రవర్తి ధర్మశాసనాలు. ఇవి పడమట పెషావరుప్రాంతం మొదలుకొని తూర్పున కలకత్తాప్రాంతంవరకూ, ఉత్తరాన నేపాళం మొదలుకొని దక్షిణాన మైసూరువరకూ గల హిందూదేశం అంతటిలోనూ వేరువేరు ప్రాంతాల కనిపించినవి. ఈ శాసనాలు రెండులిపులలో వ్రాసివున్నవి. అవి ఏవంటే, (౧) ఖరోష్ఠీలిపి, (౨) బ్రాహ్మీలిపి. ఖరోష్ఠీలిపిలో వ్రాసిన శాసనాలు హిందూదేశం పశ్చిమోత్తరప్రదేశంలోనే కనబడ్డవి. ఈ లిపి తురకంలాగ కుడివైపునుంచి ఎడమవైపుకు వ్రాస్తారు; ఇక మిగతా దేశంలో కనబడ్డ అశోకుని శాసనాలన్నీ బ్రాహ్మీలిపిలో వున్నవి. క్రీస్తుపూర్వం రెండు, మూడు శతాబ్దులలో మన హిందూదేశం అంతటిలోనూ వాడుకలో వున్న లిపులు ఈ రెండే—ఖరోష్ఠీ, బ్రాహ్మీలిపులు. బ్రాహ్మీలిపి ఇప్పుడు మనం తెలుగులిపి వ్రాస్తున్నట్లే ఎడమవైపునుంచి కుడివైపుకి వ్రాస్తారు. క్రీస్తుశకం మూడవ

శతాబ్దినాటికి ఈ బ్రాహ్మీలిపి రెండు పాయలుగా చీలింది—ఒకటి ఉత్తరాదిపాయ, మరొకటి దక్షిణాది పాయ. ఉత్తరాదిపాయ నాగరిలిపిగా మారితే దక్షిణాదిపాయ దక్షిణదేశలిపులకు మూలప్రకృతి అయింది. నాగరిలిపిలోనుంచి నేటి ఉత్తర-హిందూస్థానపు లిపులన్నీ పుట్టినవి. దక్షిణాదిపాయలోనుంచి నేటి దక్షిణ హిందూదేశపు లిపులన్నీ పుట్టినవి. అంటే నేడు హిందూదేశంలో వాడుకలో వున్న లిపులకన్నిటికీ ఒకవిధంగా మాతృక బ్రాహ్మీలిపే. ఈ లిపిలోనుంచే నేటి మన లిపులన్నీ పుట్టినవి.

ఇక భాషనుగురించికూడా రెండు మాటలు. అశోకచక్రవర్తికాలంలోనే బౌద్ధం ప్రపంచమతం అయింది. ఆ చక్రవర్తికాలందాకా బౌద్ధం మగధదేశంలోనూ, తత్పరిసరప్రాంతంలోనూమాత్రమే వ్యాప్తిలో ఉండేది. అశోకచక్రవర్తి తన సామ్రాజ్యసీమలకు వెలపల దూరాన వుండే దేశాలకు మతబోధకులను పంపి బౌద్ధాన్ని దూరస్థదేశాలలోకూడా వ్యాపింపజేశాడు. నాటినుంచీ బౌద్ధానికి ప్రపంచమతగౌరవపదం లభించింది; బౌద్ధం మన హిందూదేశంలో ముమ్మరంగా వ్యాపించిన కాలమది. ఈ కాలంనాటి (ప్రథమశిలాయుగపు) శాసనాలన్నీ ప్రాకృతభాషలో వున్నవి. బౌద్ధుల మతగ్రంథాలన్నీ గ్రాంథికప్రాకృతమైన పాలీ భాషలో ఉన్నవి. హిందువులకు వేదభాష సంస్కృతం ఎట్టిదో బౌద్ధులకు తమ వేదభాష పాలీ-ప్రాకృతం అటువంటిది. అందువల్ల బౌద్ధమతం వ్యాపించినకాలంలో ప్రాకృతమే రాజులూ, మతాచార్యులూ ఆదరించినా, అభిమానించినా భాష. ఈ కాలంలో వచ్చిన గ్రంథాలు కూడా ప్రాకృతంలోనే ఉన్నవి. కవులు ప్రాకృతంలో కవిత్వం చెప్పేవారు. అందువల్ల హిందూదేశం అంతటిలోనూకూడా కానవచ్చే మొదటి శిలాశాసనాలన్నీ ప్రాకృతభాషలోనే ఉన్నవి. అశోకచక్రవర్తిధర్మశాసనాల భాష ప్రాకృతం. మన తెలుగుదేశంలో కనబడ్డ అశోకుని శాసనాల భాష ప్రాకృతం; అమరావతి, నాగార్జునికొండ, భట్టిప్రోలు, ఘంటశాల, రామిరెడ్డిపల్లి, జగ్గయ్యపేట మొదలైన ప్రాచీనబౌద్ధక్షేత్రాలలోని స్తూపముల రాళ్లమీది శాసనాలన్నీ ప్రాకృతభాషలో ఉన్నవి. బౌద్ధమతానికి ఆదరం తగ్గి వేదమతానికి—పౌరాణికమతానికి—క్రీస్తుశకం నాలుగోశతాబ్దినుంచీ ప్రజాదరణా, రాజాదరణా హెచ్చిననాటినుంచీ, అంటే దేశంలో మతవిషయకమైన పరివర్తనం కలిగిన నాటినుంచీ శిలాశాసనాలు పోయి తామ్రశాసనాలూ వచ్చినవి; ప్రాకృతం పోయి సంస్కృతమూ వచ్చింది. ద్వితీయశిలాశాసనయుగం ఆరంభమైన నాటినుంచీ జనసామాన్యంలో ప్రబోధం కలిగింది; సంఘంలో, ఆచారవ్యవహారాలలో మార్పు వచ్చింది; దేశభాషలకు గౌరవం హెచ్చింది; దేశభాషే శాసనభాష అయింది. ద్వితీయ శిలాశాసనయుగ నాటినుంచీ శిలాశాసనాలలోని భాష దేశభాష; తామ్రశాసనములలోని భాష సంస్కృతం. శాసనం శిలాశాసనమైనా, తామ్రశాసనమైనా లిపిమాత్రం దేశీయలిపే-తెలుగు-కన్నడదేశాలలో వాడుకలో ఉండే సామాన్యలిపి. విజయనగరసామ్రాజ్యం స్థాపితమైననాటినుంచీ లిపిలోనూ, కొంతవరకు భాషలోనూకూడా మార్పు వచ్చింది. ఇస్లాముమతవిప్లవాన్ని ఎదుర్కొని వేదమతాన్నీ, వేదసంస్కృతినీ సుస్థాపితం చేయడానికే విజయనగరసామ్రాజ్యం నిర్మాణమైంది. విజయనగరరాజ్యసంస్థాపకులు ఇస్లాముమతవిజృంభణాన్ని అరికట్టి హిందూస్వాతంత్ర్యాన్ని సుస్థిరంగా ప్రతిష్ఠాపించి వేద-పౌరాణిక సంస్కృతికి ఆశ్రయమిచ్చి పోషించారు. అప్పటినుంచి శాసనాలలో దేవలిపి అంతరించింది; నాగరిలిపి దాని స్థానం ఆక్రమించింది; శాసనభాష సంస్కృతం. ఈ విధంగా దేశంలో కలుగుతూ వచ్చిన మార్పులకు అనుగుణంగానే, ఉద్యమాల ఫలితంగానే శాసన స్వభావంలోనూ, శాసనలిపిలోనూ, శాసనభాషలోనూకూడా మార్పు కలుగుతూవచ్చింది. శాసనాలు ప్రజలు పొందుతూవచ్చిన మత, సాంఘిక, రాజకీయాదిపరిణామాలకు సూచకములు. మన దేశచరిత్రనిర్మాణానికి ఈ శాసనములే ప్రధాన సాధనసామగ్రి. ఇవి చరిత్రకోసం పుట్టినవి కాకపోయినా వీటిని ఉపాసించి చరిత్రపరిశోధకులు మన దేశపు ప్రాచీనచరిత్ర వ్రాస్తున్నారు.





# కుటుంబం

[కథానిక]

## శ్రీ పంతుల శ్రీరామశాస్త్రి

రాత్రి సుమారు తొమ్మిదిగంటల వేళ...చేతితో తలుపు నెట్టేందుకు కూడా ఓపిక లేక, ఎల్లాగో భుజంతో తోలిగించి, పాతబొంతల మూటలు చిందర వందరగా ఉన్న కుక్కిమంచంమీద కూలబడ్డది వసుంధర.

ఆమె రాకకోసం గడియ యుగంగా ఎదురు చూసిన తల్లి సీతమ్మ ఆమె ఇంత నీరసంగా, దిగులుగా రావడంతో హతాశురాలయింది. ఆక్షణంలో ఆవిడలో రేగిన ఆగ్రహము ఇతరుల నెవ్వరినీ ఉద్దేశించి కాదు; ఈరకపు దైనందిన, ఆశా-నిరాశలకు అతీతమయిన ప్రశాంతస్థితిని ఇంకా తాను పొందలేదేమా అని ఆ క్రోధం.

" వసు రాలేదే? తలుపు చప్పుడయినట్టుంది!" అని పెరటిచీడీలోనుండి ప్రశ్న. అంతలోనే సీతమ్మగారు తనను తాను సర్దుకొని "బాగుందండీ, ఇంత వేగిరం ఎలా వస్తుంది ? ఇవాళ వాళ్ల స్కూల్లో ఏదో పెద్ద మీటింగుట-అందులో నువ్వు మాట్లాడితేనే కాని వల్ల కాదన్నారట వాళ్ళ ఇనస్పెక్టరుగారు" అంది.

"అవునవును, మరిచిపోయేను, అదే అమ్మాయి పొద్దున్న చెప్పింది"

"మీ కన్నీ మరుపే! అది వచ్చేసరికి పది గంటలు దాటుతుంది. మీరు రొట్టెలుతిని పడుకోండి"

"ఎలాగ తినడం, అది వస్తే మందు తెస్తుందేమోనని చూస్తున్నాను."

"అవతల మీటింగాయను; పెద్దపెద్దవాళ్లతో మాట్లాడాలాయను : అటువంటప్పుడు ఎంత భక్తిశ్రద్ధలుంటేమాత్రం, జ్ఞాపకం ఉండొద్దూ? ఇంతకీ, అది తిరిగివచ్చే వేళకి ఏ దుకాణాలూ ఉండవు."

"నిజమేన్లే. కాని, అయితే ఏమీ లేదంటావా? ఆ డబ్బీలో కొంచెం నీళ్లువేసి తే."

"అలా పూటపూటకీ నీళ్ళు వేస్తే ఊరడానికి అదేం గనా, సముద్రమా? ఇందాకా పాలనారాయణ మొగుణ్ణడిగేను; నసిగినసిగి ఇచ్చేడు ఈ పిసరు."

"అయితే ఇంతసేపూ ఇచ్చేవు కావేం ?"

"అప్పుడే ఇచ్చేస్తే ఈపాటికి మళ్ళీ కావాలనరూ?"

"ఏదో, ఈపూటకి ప్రాణం నిలబెట్టేవు!"

నల్లమందు దొరికిందన్న ఉత్సాహంతో, అప్పారావు పంతులు మంచంమీద లేచి కూర్చున్నాడు. సీతమ్మగారు, చాలాచోట్ల పింగాణీ ఊడిపోయిన పళ్లెంలో, పొట్టు బాగాతీయని గోధుమ పిండితో చేసిన రెండు రొట్టెలూ, ఒక పాతనిమ్మకాయ ముక్కా వేసి పట్టుకొనివచ్చింది.

రెండవరొట్టె చివరిముక్క తింటూ, ఆయన, సార్థకంగా "ఎందు కిన్ని కొంచెం చేసేవు రొట్టెలు ?" అన్నాడు. ఆవిడ "కొంచెంలేదు, లావుగానే చేసేను. అయితే, ఇందాకా, పాపం, అప్పలమ్మకూతురు పొద్దున నించీ ఏమీలేదని ఏడిస్తే రెండురొట్టె లిచ్చేసేను.

అయినా ఇంకా ఉన్నాయి. నా కొడివారం; వసు 'అక్కడ మీటింగులో టీపార్టీలో తినివస్తాను, నా కేమీ అక్కరలే'దంది; మీకొక్కవలిస్తే మరిరెండు రొట్టెలు తీసుకొనివస్తా"నంది.

అప్పారావుపంతులులో నిగ్రహమనేది చాలా తక్కువ. కాని, పాపం ఎల్లాగో అన్నాడు: "వద్దు, నాకూ కడుపు నిండిపోయింది; అయినా టీపార్టీలలో వాట్లో ఏమిటి తింటుంది! అమ్మాయికి ఎంతో మొగమాటం. అవి రెండూ దానికి ఉండనీ"అంటూ నడుము వాల్చేడు.

ఆవిడ 'ఇందండీ' అంది ఆయనచేతికి చుట్ట నందిస్తూ. ఆయన లేచి, అతి ఉత్సాహంగా చివర కొరికి, బల్లమీది బుడ్డిదీపానికి ముట్టించి పొగలో తన్మయుడయేడు.

తల్లిదండ్రులమధ్య జరుగుతున్న సంభాషణ వసుంధరచెవులలో పడుతున్నదిగాని, ఆమెమనస్సుకి మాత్రం అందడం లేదు.

ఆ రోజు ఉదయం ఎనిమిదిగంటలకు తాగిన కాఫీనీళ్లువినా ఆమె పచ్చిమంచినీళ్లుకూడా పుచ్చుకోక పోయినా ఆమె కేమీ ఆకలయినట్లు లేదు. అలా ఆ బొంతలమూటలమీద ఒరిగిఉండగానే ఆమెకు చిన్న కునుకు పట్టింది......

"అమ్మా, వసూ! లే అమ్మా, పొద్దుటా ఏమీ తినలేదు. ఈ రెండురొట్టెలూ తిని, ఇన్ని నీళ్లు తాగమ్మా"అని సీతమ్మగారు లేపింది వసుంధరని.

ఆ కొద్దినిమిషాల నిద్రతో ఆమె తన మనో వ్యథలను చాలావరకూ మరిచిపోగలిగింది. అదివరకల్లా స్ఫుటంగా తెలియని ఆకలి అప్పుడు తెలిసింది. ఒక రొట్టె తినేదాకా తా నేమిటి తింటున్నదో కూడా తెలియనేలేదు. రెండవరొట్టె తినేవేళకు ఆమెకు స్ఫురణకివచ్చింది.

"అమ్మా, నువ్వేమేనా తిన్నావా, లేదా" అని అతి ఆతృతగా అడిగింది వసుంధర.

"ఇవాళ నాకు ఆదివారంకదమ్మా" అంది రాని నవ్వును బలవంతంగా తెచ్చుకుంటూ సీతమ్మగారు.

"బాగుందమ్మా, ఇవాళ ఆదివారం, నిన్న శని వారం, రేపు సోమవారం!—నీకు ప్రతిరోజూ ఏదో ఒక వారమే; నువ్వు తినకపోతే నేనూ తినను" అంది నిష్కర్షగా వసుంధర.

"లేదమ్మా, నాకొక్కవాలంటే తిననా? ఇంతకీ మునపటిలాగ అరగటం లేదు; ఏది తిన్నా, ఎంత కొంచెం తిన్నా కడుపులో భారంగానే ఉంటున్నది—"

ఈ మాటలను వసుంధర ఎక్కువగా నమ్మలేదు; కాని అప్పట్లో ఆమెలో వాదించేశక్తి ఏమీ లేక పోయింది. ఆమె మళ్లీ రొట్టె కొరుకుతూఉండగా తమ్ముడు రామం పలవరించేడు—కలతనిద్రలో: "అమ్మా, అక్కయ్య తెచ్చే మిఠాయంతా నాదేనుసుమా" అని.

తల్లీకూతుళ్లిద్దరి కళ్లలోనూ ఆపుకోబడకుండా నీళ్లు గిర్రన తిరిగేయి. "అమ్మా, నేను మరి తినలే నమ్మా" అంది వసుంధర డగ్గుత్తికపడిన గొంతుతో. ఆమెపక్కలో కూర్చొని, "నా తల్లివి కాదమ్మా, ఉదయంనుంచీ ఏమీ తినలేదు. అలా మారాంచేస్తే ఎలాగమ్మా" అంటూ ఆమెనోటికి రొట్టెముక్కను అందించింది సీతమ్మగారు. ఆ క్షణంలో సర్వమూ సమృద్ధిగా ఉండికూడా ఎందుకో తనకే తెలియకుండా మారాంచేసే చంటిపిల్లవలె తనను తాను భావించుకోగలిగింది వసుంధర, తనను నిత్యమూ కలవరపరిచే అంతులేని వ్యథలనన్నిటినీ మరిచిపోయి.

* * * *

సుమారు రాత్రి ఒంటిగంటప్పుడు తమ్ముడు రామంఏడుపుతో వసుంధరకి తెలివివచ్చింది. సీతమ్మగారు తన జీవితంలోని ప్రముఖభాగమయిన అబద్ధాలతో మరిపించి ఊరుకోబెట్టాలని చూస్తున్నది. కాని, వాడు ఊరుకోవడం లేదు. పాపం, వచ్చీరాని జ్ఞానం!

"ఆఁఆఁ! అక్కయ్య తెచ్చిన మిఠాయి మీరంతా తినేసిఉంటారు"—ఇదీ వాడి ఏడుపు.

"లేదమ్మా, అది నూనెమిఠాయిట; తింటే జబ్బు చేస్తుందని అక్కయ్య తేలేదు."

"అయితేమరి, నువ్వు రొట్టెలూ అవీ నూనెతో చేస్తే అవిమాత్రం జబ్బుచెయ్యవేమిటి? నీవన్నీ అబద్ధాలే."

"లేదమ్మా, అక్కయ్యేగాని తెస్తే, నిన్ను లేపకుండా, నీకివ్వకుండా ఉంటుందా? అసలు, రేపు వాళ్ళస్కూల్లో పెద్ద నాటకం వేస్తారట. అందులో నువ్వు కృష్ణుడి వేషం వేస్తావా, రామం!"

"వేస్తానుగాని, ఉత్తినాటకమేనా?"

"బాగుంది, ఉత్తినాటకమేనా, మధ్యాహ్నం పెద్ద విందు చేస్తారు. అందులో నీదే రాజ్యం; కావలసినన్ని జిలేబీలు, లడ్డూలు, బరిఫీలు, కోవాబిళ్ళలూను."

"నిజమేనా అమ్మా."

"నిజమేనమ్మా, మరి నిద్రపో, ఉదయమే లేద్దువుగాని: అక్కయ్య లేచేవేళకి."

"అలాగేకాని, నిద్ర రావడం లేదమ్మా. మరొక్క రొట్టె లేదూ?"

అంతవరకూ ఎల్లాగో అణచుకోబడిన దుఃఖం మరి ఆగింది కాదు వసుంధరకి. మెల్లిగా లేచి వీథిగుమ్మంలోకి వెళ్లిపోయింది తన ఏడుపు వినబడకుండా ఉండేందుకు.

కాని సీతమ్మగారికి కిదేమీ కొత్తకాదు. అనుక్షణమూ ఎన్నెన్నో అబద్ధాలాడి మరిపించడంలోనూ, సర్దుబాటుచెయ్యడంలోనూ ఆవిడ ఆరితేరిపోయింది.

"అబ్బే, ఇంతరాత్రప్పుడు ఎవళ్ళయినా రొట్టెలు తింటారా? తెల్లవారి లేచేక నీకు కావలసినన్ని"— ఎప్పుడూ తనకు కావలసినన్ని రొట్టెలు అమ్మ ఇయ్యకపోయినా, ఆమెమాటలను నమ్మకుండా ఉండలేకపోయేడు రామం.

"మరి నిద్రరావడం లేదమ్మా" అన్నాడు రామం.

"అయితే, కథ చెప్పదునా? ఏకథ చెప్పేది, శ్రీరాములవారి కథా? పాండవుల కథా? ప్రహ్లాదుడి కథా? ధ్రువుడి కథా? ఏంకథ చెప్పేది?"

"ఏంకథా, చిన్నికృష్ణమ్మకథ చెప్పమ్మా."

"అలాగే. అయితే మరి కళ్ళు మూసుకో."

చిన్నికృష్ణుడు ఎన్ని వెంకితనాలు చేసినా మంచివాడుగానే పరిగణించబడడమూ, చిన్నికృష్ణుడు చిన్నవాడైనా ఎన్నెన్నో అద్భుతశక్తులను కలిగిఉండడమూ, అన్నిటికంటె ముఖ్యంగా చిన్నికృష్ణుడు తన కడుపునిండానేకాకుండా, నేస్తులందరి కడుపులూ నిండేటట్లుగా పాలూ వెన్నా మీగడా దొంగిలించి పంచిపెట్టి ఆనందించి ఆనందింపజేయడమూ మొదలయినవన్నీ వినటంలోని తన్మయానందము ఆపిల్లవాడి ఆకలిని కొంతసేపు మరిపించగలిగింది. తనకు వాస్తవికజగత్తులో ఎన్నడూ లభ్యంకాని పదార్థాలనుగూర్చిన భావనతోనే ఆ పసిమనస్సు తృప్తిపడగలిగింది. కథ వింటూ వింటూ తానే చిన్నికృష్ణమ్మయేమో అనికూడా అనుకోగలిగింది ఆ లేతమనసు.

రామం నిద్రపోయేవేళకి సీతమ్మగారి కళ్ళు కూడా బరువెక్కాయి. ఆ నిద్రమత్తులో రామానికి నిద్ర పట్టిందని తెలియకుండానే, మరికొంతసేపు ఆమె ఏమేమిటో అస్పష్టంగా అసంబద్ధంగా చెప్పుకుపోసాగింది.

"........అప్పుడుట, ఆ గోపికలుట,...... చిన్నికృష్ణమ్మా, నీకు కావలసినన్ని రొట్టెలూ అవీ ఇస్తాము......నిన్ను మీ అమ్మ రోలుకి కట్టేస్తే..." అంటూ ఆమె నిద్రలో మునిగిపోయింది.

అప్పటికి వసుంధర మళ్లీ తేరుకుంది. ఇంట్లోకి వచ్చి ఆ చిరిగి జీర్ణమయిన బొంతమీద, మూడువంతులు శిథిలమయిన బట్టతో పడుకొనిఉన్న తల్లినీ, సగంసగం మండే ఆకలిమంటను కథలతో, రేపటికబుర్లతో, ఆధారంలేని ఆశలతో తీర్చుకునే చిట్టితమ్ముణ్ణీ చూడలేక, బుడ్డిదీపాన్ని మరీచిన్నది చేసి పక్కమీద నడుమువాల్చి గట్టిగా కళ్లుమూసుకొంది నిద్రవస్తుందేమోనన్న ఆశతో. కాని, అంత సులభమయినదా నిద్ర? అందులోనూ మనఃప్రథవానలం నాలుగువంకలా దహిస్తూఉండగా నిద్రాచ్ఛాయలనేవి తాటాకులకంటే కూడా తేలికగా దహ్యమానము లవుతాయి.

* * * * *

అప్పారావుపంతులు తన చిన్నతనంలో ఎన్నడూ ఉద్యోగం చెయ్యవలసివస్తుం దనుకోలేదు. కాని, తండ్రి పోయిన రెండేళ్లలో ఆస్తి యావత్తూ హారతికర్పూరంకంటే విచిత్రంగా హరించిపోయింది. నౌఖరీచెయ్యడం తప్పనిసరి అయింది.

అంతటి అమాయకుడు తాలూకాబోర్డుహెడ్డు క్లార్కుగా పదిహేనేళ్లు పనిచేసేడంటే ఎవ్వరికైనా ఆశ్చర్యం కలగకపోదు.

ఆఫీసుబంట్రోతులు మొదలు పెద్ద కలెక్టరుగారి వరకూ అందరికీ తెలుసు అప్పారావు పంతులుకు అధమం లంచాలుపుచ్చుకోవడమయినా చేతకాదని. అయితే ఏమిటిలాభం? కేసంతా అతనికి విరుద్ధంగానే నడిచింది. అలవాటుచొప్పున అలా పనిచేసుకుపోవడాన్నే అతడి మనస్సు నేర్చుకుందిగాని ఇటువంటి విపరీతసంఘటనను ఎదుర్కొనే శక్తి దానికి లేకపోయింది. విచారణలో ఒక్కవిషయంకూడ సమంజసంగా చెప్పలేకపోయేడు. అయితే అధికారుల అనుగ్రహంవల్ల శిక్ష (జెయిలు) పడకుండా ఉద్యోగం పోవడంతో ఒడ్డెక్కగలిగేడు.

ఆ ఊళ్లో మరి ఉండలేకపోయేడు. ఎక్కడి కయినాసరే, ఈఊరు తప్పిపోతే చాలుననుకున్నాడు. అప్పటికి వసుంధర చదువుమాని రెండేళ్లయింది; రామం నాలుగేళ్లవాడు. ఒకనాటి రాత్రి చీకటిలో, సుమారు రెండుగంటలవేళప్పుడు భార్యాభర్తలూ, ఇద్దరు పిల్లలూ ఎవ్వరూ గుర్తించలేని కొత్తపట్టణంలో రైలు దిగేరు.

ఆతరువాత కొన్నాళ్లు అప్పారావుపంతులు మళ్లీ ఏదైనా నౌఖరీకోసం నిష్ప్రయోజనంగా యత్నించేడు. చిట్టచివరకు, ఒక వర్తకుడు, మూడు నెలలు పద్దులు రాయించుకొని, "అన్నీ తప్పులే, ఇలా గయితే మేము మూడురోజులలో దివాలాఎత్తిపోమా?" అని పాతికరూపాయలు చేతిలో పెట్టేడు. ఏమేమీ ఇవ్వనంతకాలం ఎంతెంతో ఇస్తాడన్న ఆశయినా ఉండేది. ఈ పాతికరూపాయలనూ చించి, అతడిమొగం మీద చల్లి వేయాలనిపించింది. కాని, కోపం తెచ్చుకునే అధికారానికికూడా కొంత హద్దు ఉండాలికదా! పాతిక రూపాయలు తీర్చగల అవసరాలుకూడా ఎన్నెన్నో ఉండగా ఎంతకోపం వస్తేనేమి, లోలోపల అణిగిపోవలసిందే.

క్రమక్రమంగా ఆయనకు దగ్గు లావయింది. అందులోనూ చిరకాలంగా అభ్యాసమయిన నల్లమందు లేకపోయేసరికల్లా మరీ ఎక్కువయేది. ఏమయినా, ఎంతబాధయినా పడడానికి ఆయన అలవాటు పడిపోయేడుగాని, వీథిలోకి వెళ్లడమంటేమాత్రం ఆయనకు ప్రాణగొడ్డంగాఉండేది.

ఇంటిలో మిగిలిఉన్న కర్రసామానూ, ఇత్తడి వస్తువులూ మొట్టమొదట తాకట్టుపెట్టడమూ, తరవాత అమ్మివేయడమూతో కొంతకాలం గడిచింది. ఈ లోపున తక్కిన కుటుంబంకూడా కొంతవరకు కొత్త పరిస్థితులకు అనుగుణంగా జీవించటానికి అలవాటుపడి పోయింది.

* * * * *

ఏదో ఒక నిశ్చయం చేసుకున్నట్టుగా ఆమె ఒకనాడంది తల్లి సీతమ్మతో. "అమ్మా, నేనే కొడుకు నయిఉంటే మిమ్మల్ని పోషించనటమ్మా? ఇవాళ దగ్గరనుండీ నువ్వు ఎవళ్ల ఇంటికీ వెళ్లొద్దు. ఎవళ్లూ మనకు ఇచ్చేదీ లేదు, చచ్చేదీ లేదు; కాని, నానా ఇదీని."

"వాళ్లిస్తారనా, ఏదో అలా ఊసుపోక..."

ఈ ఊసుపోకపోవడానికి అర్థం 'ఇల్లుగడవక' అని.

"లేదమ్మా, ఈ ఫస్టునుండీ ఇక్కడి గర్ల్సుస్కూల్లో సంగీతంమేష్టరుగా పని దొరికింది. నెలకి పాతికరూపాయల జీతం ఇస్తారు."

కూతురు అంత సంతోషంగా చెప్పిన వార్తతో తల్లిమనస్సు చివుక్కుమంది. పద్ధెనిమిదేళ్ల నిండువయస్సులో, పెళ్లి—చీరలు—నగలు—సంసారం, ఏ ముచ్చటలూ లేకుండా తన అపురూపపు కూతురు పాతిక రూపాయలకు నౌఖరీచెయ్యడమా?

—అన్నాళ్లూ ఆవిడమనస్సులో, పరిస్థితుల దౌర్భాగ్యాన్ని ఎదుర్కొని, ఎక్కడెక్కడో ఆశా లేశము కొనసాగేది; ఏ విధంగానో ఆమెకు అద్భుత మయిన సంబంధము వస్తుందనీ, ఇంకా తన మనస్సులో సుఖజీవనము అంటే ఉన్న భావనకు అనురూపము లయిన సౌఖ్యాలన్నీ లభిస్తాయనీ ఆమె భావించగలి గేది. ఈ ఉద్యోగలబ్ధితో ఆమెఆశ నిరాశ అయింది.

*   *   *   *   *

బడిలో పనిచేయనిస్తున్నందుకు ప్రతిఫలంగా ప్రధానోపాధ్యాయురాలి కొడుక్కీ, కూతురుకీ రెండు న్నరగంటలు ప్రయివేటు చెప్పాలిట. ఏమయితేనేం, అన్నిటికీ సంతోషంగానే సిద్ధపడింది వసుంధర.

మొదట్లో ఆమె తెచ్చే పాతికరూపాయలూ సరి పడినట్టే ఉండేది కుటుంబానికి.

కాని క్రమక్రమంగా, సంగ్రామప్రభంజనోద్ధతి వల్ల ధరలు అల్లా ఉవ్వెత్తుగా పెరిగిపోవడంతో పయిగా ప్రయివేట్లు చెప్పి తెచ్చే డబ్బుకూడా చాల టంలేదు.

వస్తువుల ధరలకూ, వాటిని సంపాదించుకొనే కష్టానికీ అంటే ఒక మితి లేదుగాని, మనుష్యుల శక్తి పరిమితంకదా!

ఉదయం లేచిందిమొదలు రాత్రి పదిగంటల పర్యంతమూ కష్టపడికూడా వసుంధర కుటుంబపోష ణకు తగినపాటి సంపాదించలేకపోతున్నది. ఈ శ్రమ తో, నిత్యమూ ఉండే ఆందోళనతో, ఆమె పద్దెనిమి దేళ్లకే పాతికేళ్లు పైబడిన మనిషిలా తయారయింది.

సీతమ్మగారు ఇంటికవద్ద పడే తాపత్రయము ఏమీ తక్కువకాదు—ఆమెకూడా ముప్ఫయిఅయిదేళ్లకే తల నెరిసిపోయి, శరీరపటుత్వం తగ్గిపోయి, యాభైఏళ్ళ మనిషిలా అయిపోయింది. పూర్వంలాగ ఎవరి ఇంటి కయినా వెళ్ళి సాయం చెయ్యలేకపోతున్నది; ఏ మాత్రం ఎక్కువగా కదలినా ఆలిక, గుండెలో భారంగా ఉండటం!

ఇక ఇంట్లో చిన్నపిల్లవాడు రామం—ఏమీ తెలియదు; అన్నిటికీ మారాము చేసేవాడు. కేవలం అవన్నీ తనకు అందనివని చెప్పలేకపోయేది ఆ తల్లి గుండె. ఏవేవో కారణాలు, సమాధానాలు కల్పించి చెప్పేది.

రామంకంటే పసిపిల్లవాడు అప్పారావుపంతులు. ఆయనకు చుట్టలూ, నల్లమందూ, కాఫీకూడా కావాలి విధిగా. అందులోనూ పనిపాటలు లేకపోవడంచేత అల వాట్లు మరీమరీ ఎక్కువయేయి. ఇన్నిటికీ డబ్బు ఎల్లా వస్తుంది అన్న విచక్షణజ్ఞానం ముసలి అప్పారావు పంతులులో నశించిపోయింది. ఎల్లాగో అదే (భాగ్యం) తనకు కావలసినవన్నీ సమకూర్చుతుందనీ, అమ్మాయి ఏదో పెద్దఉద్యోగం చేసి కొల్లలుకొల్లలుగా ఆర్జించు తున్నదనీ ఆయనవిశ్వాసం.

వృద్ధాప్యం వచ్చేసరికి బాహిరదృష్టి ఎల్లా అస్ఫు టంగా అయిపోతుందో అల్లాగే అంతరదృష్టికూడా మందీభూతమవుతుంది కాబోలు. అప్పారావుపంతులు అప్పుడే కొత్తగా ప్రపంచంలోకి వచ్చిన వ్యక్తిలా ప్రశ్నించేవాడు లోకపు భోగట్టాలన్నీని. వసుంధర కూడా విసుగుకోకుండా, లేని ఉత్సాహం తెచ్చుకొని సమాధానా లిచ్చేది. సీతమ్మగారే "దానికి బడికి వేళ అయిపోతున్నది. అలా కబుర్లు చెప్పుకుంటూ కూర్చుంటే తండ్రీకూతుళ్ళకి ప్రపంచమే తెలీదు" అని అవధిలేని వారి సంభాషణకు ఒక హద్దు ఏర్పరిచేది.

*   *   *   *

ధరలు ఎక్కువకావడంవల్ల ఎంత బాధో, కంట్రోలువల్లకూడా అంత బాధగానే ఉండేది. ఎలాగో సీతమ్మగారు ఇరుగుపొరుగువాళ్ళ పిల్లలను తియ్యని మాటలతో మంచిచేసుకొని, బియ్యమూ, గోధు మలూ అవీ తెప్పించేది. ఆవిడమంచితనానికీ, తియ్యని మాటలకీ సాయంచెయ్యాలనే ఉండేది పిల్లలకు. కాని వాళ్ళ పెద్దవాళ్ళకుమాత్రం చాలా పరువుతక్కువగా తోచి ఆగ్రహం వచ్చేది. ఒక్కొక్కనాడు ఆవిడే స్వయంగా వెళ్ళవలసివచ్చేది బియ్యానికీ, పంచదారకీని.

ఉద్యోగంలో ప్రవేశించినతరువాత మరిరెండు చీరలుమాత్రమే కొనుక్కుంది వసుంధర; అంతే. ఆతరవాత రెండేళ్ళలోనూ మరి అట్టే సావకాశం లేకపోయింది.

*   *

తగిలినకాలికే(దెబ్బ) తగులుతుందన్న సామెతలో ఎంతో నిజం ఉంది. అసమం, దెబ్బ తగిలినకాలికే తగిలినప్పుడే బాగా తెలిసివస్తుంది.

తను అందరిలాగే స్కూల్లో పనిచేసి పొందే పాతికరూపాయలకు ప్రతిఫలంగా, ప్రధానోపాధ్యాయురాలి ఇంట్లో రెండున్నరగంటలు ప్రయివేటు చెప్పవలసిరావడం అప్పట్లో ఎంతో కష్టమనిపించినా తరవాత అదే మేలనిపించింది వసుంధరకి. ఏమంటే తరవాత వచ్చిన ప్రధానోపాధ్యాయురాలు వచ్చీరావడంలోనే క్వాలిఫికేషను లేదంది. ఇంకా ఎన్నో అభ్యంతరాలను చూపి ఉద్యోగంనుండి తొలగించింది. కేవలం ఉద్యోగం లేకపోయినంతమాత్రంలో అంత చిక్కు లేకపోవును. ఏమంటే, అప్పటికి, ఆమెకు తీరిక ఉంటే ఆమెదగ్గర చదువుకోవాలనేవాళ్లు, సంగీతం నేర్చుకోవాలనేవాళ్లు చాలామంది తయారయేరు. కాని, తనను ఉద్యోగంనుండి తొలగించటంతో తృప్తి కలగలేదు నూత్నప్రధానోపాధ్యాయురాలికి. ఊర్లల్లా బోలెడుప్రచారం—"గొంతు బాగానే ఉంటుంది గాని, శాస్త్రజ్ఞానము ఏమీ లే"దని. ఈ దెబ్బకు తాళుకోవడం వసుంధరశక్తికి మించిపోయింది.—అందులో, తన శక్తిమీద ఇదివరకల్లా ఉండే ఆ నమ్మకమంతా అంతరించగా, ఏవేవో సానుభూతికబుర్లు చెప్పేవాళ్లంటే ఆమెకు మరీ కష్టంగా ఉండేది. ఇంతలా తనను పాడవడానికి ఏమిటోకదా తాను చేసిన నేరం? పోనీ, తనవెనుక భృత్యప్రాయుడుగా తిరిగే రామ్మూర్తికి ఉద్యోగం ఇప్పించుగాక, ఈ దరిద్రప్రచారం అంతా దేనికో? ఆవిషయంలో అంతకంటే మరి ఆలోచించలేకపోయేది వసుంధర.

ఆమెకు ఇంకొక విచారం. ఒక్క అమ్మకే తెలుసును- నాన్న కింకా తానేమో పెద్దఉద్యోగం చేసేస్తున్నాననే. ఆమెకు అబద్ధాలంటే అదొకవిధమైన అసహ్యం. కాని, తమ్ముణ్ణీ, నాన్ననూ తాత్కాలికంగా తృప్తిపరచటానికి అమ్మ ఆడే అబద్ధాలకి ఆమె క్రమంగా అలవాటుపడిపోయింది. అవునుమరి, నిజం చెప్పి తృప్తిపరచలేకపోవడమేకాకుండా, అబద్ధాలవల్ల కలిగే ఆభ్రాంతినికూడా ఎందుకు పాడుచెయ్యాలి?

ఈ కొత్తప్రచారంవలన ట్యూషన్లు చాలాభాగం కొత్తసంగీతంమాష్టరుగారికి సంక్రమించేయి. అయితే ఎవరోకొందరు, తమ పిల్లలకు మగవాళ్ళచేత సంగీతం చెప్పించటం ఇష్టంలేనివాళ్లు ఆమెచేతే చెప్పించేవారు. అయితే ఆ మునపటి మోజు లేదు. పైగా డబ్బిచ్చేవేళకు బేరంచెయ్యడమూ, బాకీలు పెట్టడమూ కూడా అలవాటయింది.

* * * *

ఆవేళ ఉదయం ఆమె ఎంతయినా ఆశతో బయలుదేరింది. కాని, ఎండవేడి ఎక్కువవుతున్నకొద్దీ ఆమెఆశ పలచబారిపోసాగింది.

హైస్కూలు హెడ్మాస్టరుగారింట్లో తప్పక ఇస్తాననుకొంది-మూడునెలలజీతం. మొదట్లో కొన్ని రోజులు ఇవాళ, రేపూ అనడం, ఆతరవాత క్రమంగా మళ్ళీ నెలజీతంతో కలిపి ఇస్తామనడం—ఇల్లాగ మూడు నెలలయింది. తమ జీతా లిలాగే పుచ్చుకుంటున్నారా?

ప్లీడరుగారి భార్య జానకమ్మ ఎంతో మంచిది. కాని ఆవిడచేతిలో దమ్మిడీకూడా ఉండదు. ఆమె ఎంతో అభిమానంగా పెట్టిన ఆ రెండు ఇడ్డెనలూ, కప్పుడుకాఫీయే ఉదయంనుంచి ఆమెకు ఆధారం.

ప్రతిచోటా డబ్బుదొరుకుతుందేమో నన్న ఆశతో మామూలుకంటే అరగంట ఎక్కువగాకూడా కూర్చుంది. అసమం ఒక్క అయిదురూపాయలు దొరికినా ఆమె కొంత ఉల్లాసపడగలిగిఉండును. పన్నెండుగంట లవుతూండగా ఆమె ఇంటిమొగం పట్టింది.

సందుదగ్గరకి వచ్చేవేళకు ఆమెలో చిన్న బుద్ధి పుట్టింది. వట్టిచేతులతో ఇంటికి వెళ్లి ఏమి ప్రయోజనం? సాయంత్రం వెళ్లే బదులు ఇప్పుడే మేజస్ట్రేటుగారింటికి వెళితే?—ఏమో అదృష్టం, ఎవరు చెప్పగలరు?

ఆమెమనస్సులో ఎంతయినా ఓపిక ఉందిగాని, అందుకు తగిన శక్తి శరీరంలో ఉండవద్దూ? డబ్బునూ, ఇంటినీగూర్చిన తన్మయధ్యానంలో ఆమెకు తెలియడం

లేదుగాని, నీరసంవల్ల అడుగుతీసి అడుగువెయ్యడానికి కూడా అసాధ్యంగా ఉంది శరీరానికి.

ఊరుచివరనున్న మేజస్ట్రేటుగారింటికి వెళ్ళడానికి రెండుదారు లున్నాయి. ఒకటి దగ్గరది, రెండవది చుట్టుదారీని. కాని ఆమె తరుచుగా చుట్టుదారినే వెళ్ళివలసివచ్చేది. అందుకు రెండు కారణాలు. మొదటిది ఆవీథి అట్టే గౌరవప్రదమయినది కాదు. అంటే మర్యాదస్థులు వెళ్ళడానికి మొగమాటపడేది. ఇక రెండవ అభ్యంతర మేమిటంటే, ఆవీథిలో తన చదువుకొనే రోజుల్లోని నేస్తురాలు నాగమణి ఉంది. ఆమె ఇప్పుడు వృత్తిలో ఉంటున్నదట. దారంట వెళ్ళుతూఉండగా ఆమెగాని పిలిచిందంటే తానే వెళ్ళకుండాఉండలేదు. ...చిన్నప్పటి స్నేహమంటే బాధలేకపోయిందిగాని, ఈవయస్సులో ఆమెలాటి మనిషితో స్నేహం ఉందంటే తనను ప్రతివాళ్ళూ ఒక పురుషుకంటేకూడా హీనంగా చూస్తారే!.........సముద్రంలో ఈతవచ్చీ కూడా, ఎక్కువసేపు శక్తికిమించి ఈదటంవల్ల శక్తి ఉడిగి దుర్బలంగా బారలువేసినట్టు ఎలాగో నడిచి చేరుకుంది గమ్యస్థానాన్ని.

సరస్వతి ఎంతో ఆప్యాయంగా పలకరించింది... "ఇంత ఎండలో వచ్చా రేమండీ!" అని.

ఆ అమ్మాయిలో ఎంతయినా ఆత్మీయత ఉంది. మొగం కడుక్కుందికి సబ్బూ, తువ్వాలూ అన్నీ అందించి, చిక్కని మజ్జిగ తెచ్చి పుచ్చుకోమంది.

సరస్వతికి బాగా తెలుసు, ఉపాధ్యాయురాలు పాఠంచెప్పే స్థితిలో లేదనీ, ఆ ఉద్దేశంతో రాలేదనీని.

వాళ్ళ నాన్నగారు ఊళ్ళోలేరు. ఉన్నా, డబ్బుయావత్తూ సవతితల్లి శ్యామలాంబచేతిలోనే ఉంటుంది. అక్కడనుంచి డబ్బు ఊడిపడడం ఏమీ సామాన్యమయిన పని కాదు...

ఊరుకోలేక, వసుంధరే, "హార్మోనియమ్ తెస్తావా?" అంది.

సరస్వతి వయస్సులో చిన్నదేకాని ఊహకలది.

"వద్దండీ, ఇవాళ ఏమీ చెప్పుకోవాలని లేదు" అని, వంటింట్లోకి వెళ్ళి వంటలక్క నరసమ్మగారి నడిగింది...ఇంట్లో సరస్వతీ, నరసమ్మగారూ ఒకపార్టీ; తక్కిన పనిమనుష్యులూ, శ్యామలాంబా ఒకపార్టీ... ఏమయినా, అందరూ నరసమ్మగారినోటికీ, ఆమె యెడల మేజస్ట్రేటుగారికుండే అభిమానగౌరవాలకీ జడిసి ఊరుకొనేవారు.

సరస్వతి తిరిగివచ్చి, "అమ్మగారూ, రండి, నరసమ్మగారు పిలుస్తున్నా"రంది. ఎందుకు, ఏమిటి అని అడగకుండా దుర్బలంగా అనుసరించింది వసుంధర......విస్తరినిండుగా ఉన్న పదార్థాలను చూసి విస్తుపోయింది ఆమె. ఎక్కువ పదార్థాలను ఎట్ట ఎదురుగా చూడటంతోనే ఆమెఆకలి సగం తీరిపోయింది. నాలుగుమెతుకులు ఎల్లాగో నోట్లో పెట్టుకొనేసరికల్లా ఆమె మరి తినలేకపోయింది. ఎలాగో బలవంతంమీద పెరుగూఅన్నం తిని లేచింది. చెయ్యి కడుక్కుంటూ ఉండగా, తొలినాటి రాత్రి "అమ్మా, మరొక్క రొట్టె లేదూ" అని అడిగిన చిట్టితమ్ముడు ఆమెకళ్లలో మెరిసినట్లయింది. వెంటనే కళ్ళల్లో నీళ్లు కమ్మాయి. సరస్వతి అందించిన తువాలుతో చేతులూ మొగం తుడుచుకోవడంలో కళ్లనీళ్లు తుడుచుకొని, అతిప్రయత్నంమీద మళ్లీ రాకుండా నిరోధించుకొంది.

తాను డబ్బు లేకుండా ఇంటికి పోవడానికి ఎంత ఆవేదన పడుతున్నదో, తనకు డబ్బు సరిగా ఇవ్వలేకపోతున్నందుకు సరస్వతికీ అంత బాధగా ఉందని ఆమెకు తెలుసు. అదే ఆమెతృప్తి.

ఆ చిట్టిశిష్యురాలి సానుభూతి అంతటితో ఆగిపోలేదు. మళ్ళీ నరసమ్మగారి దగ్గరకి వెళ్లింది. ఆవిడ సంతోషంగానే పెట్టె తీసి లెక్కపెట్టి ఇచ్చింది. సరస్వతి తన సిల్కుచేతిరుమాలులో మూటకట్టి 'మాష్టరుగారి'చేతిలో ఉంచింది. 'ఏమిటిది' అనడానికి గాని, 'వద్దు' అనడానికిగాని ఉపాధ్యాయురాలికి ఓపిక లేకపోయింది.

శిష్యురాలు హృదయపూర్వకంగా చేతిలో ఉంచిన డబ్బుమూటను పట్టుకొని, ఆమె ఇంటిమొగం పట్టింది. ఈ రెండేళ్లలోనూ ఆమె ఎన్నడూ అంత తొందరగా నడిచిఎరుగదు.

"వసూ ! వసూ!" అన్న పిలుపు ఆమెను నిలవేసింది. ఆ పిలుస్తున్న వ్యక్తిని గూర్చి ఆమెమనస్సు ఆలోచించేలోపునే—

"నువ్వేనా ? అవునా కాదా అని పేరుపెట్టి పిలిచేను. అవుతే వెనక్కి తిరుగుతావనీ, లేకపోతే లేదనీ" అంటూ నాగమణి ఆమెచెయ్యి పట్టుకుంది.

"అప్పటికీ ఇప్పటికీ ఒక్కలాగున్నావే" అంది వసుంధర, రాని నవ్వును తెచ్చుకుంటూ.

ఎన్ని కారణాలు చెప్పినా వెంటనే వెళ్లిపో నివ్వలేదు మణి.

ఒక రెండుగంటలసేపు బాధలకూ, బాధ్యతలకూ అతీతమయిన, ఆ చదువుకొనేరోజులలోని అమాయిక బాల్యానందస్మరణలో వాళ్లిద్దరూ తన్మయులయేరు.

చివరికి "రేపు మళ్లీ వస్తానని ఒట్టుపెట్టుకుంటేనే నిన్నివాళ విడిచిపెడతా"నంది నాగమణి.

"అయితే, నన్ను నమ్మవుటే" అంది వసుంధర.

* * *

ఆవేళ ఆమె తమ్ముడికి పొరుగువాళ్ల సుందరం చేత మిఠాయి తెప్పించింది. అమ్మతో "తక్కిన ఖర్చులు ఎలా ఉంటేనేం, ముందు బియ్యమూ, నాన్నకు నల్లమందూ వచ్చేలా చూసిపెట్టమ్మా"అంది.

ఆరాత్రల్లా ఆమెకి నిద్రపట్టలేదు. తమ్ముడు హాయిగా నిద్రపోయేడు. అమ్మకూడా ఇవాళ నిశ్చింతగా ప

తాత్కాలికంగా చేతిలో డబ్బు ఉన్న మాహాత్మ్యం.

మళ్లీ రెండురోజుల్లో మామూలే.

తిరిగి చేతిలోకి వచ్చేదాకా నమ్మకం లేదు.

స్థిరంగా డబ్బువచ్చే సాధనమో !

పాపం, సరస్వతి ఎంత మంచి పిల్ల ! నరసమ్మగారే తనకంటే నయం. అయితే ఆవిడవెనక ఆధారపడిన మనుష్యు లెవరూ లేరు—తానూ ఒంటరిదయితే అంత కష్టం ఉండకపోవును. కుటుంబం-ఏమిటి సాధనాంతరం!

మర్నాడుదయం ఆమె బాగా ప్రొద్దెక్కి లేచింది. రాత్రంతా నిద్రలేకపోవడంవల్ల కళ్లల్లోకి అదొకవిధమయిన ఎరుపుదనం వచ్చింది...అది తలనొప్పి అనుకోడానికి వీలులేకుండా తల ఏమేమో బాధపెడుతూంది. అయినా, అన్నిటినీ అణచిఉంచే ఏదో ఉత్సాహకిరణము—

అమ్మ చేసిన రొట్టెలు తమ్ముడూ, తానూ, నాన్నా కలిసి తింటున్నసందర్భంలో ఆమె ఏదో చెప్పలేని హాయిని పొందింది. రోజూ ఏదో గొణుగుతూఉండే నాన్న ఆవేళ ఎంతో ఆనందంగా ఉన్నారు.

రోజూ మరి రొట్టెలు లేవని మారాంచేసే రామాన్ని ఆవేళ తినమని ఎంతో బలవంతం చేయవలసి వచ్చింది.

ఆవేళ ఉదయం ఆమె ఎవ్వరిఇంటికీ వెళ్ళలేదు. మధ్యాహ్నంభోజనం అయినతరువాత, ఎనిమిదేళ్ళ క్రిందటి ఏనాంసిల్కుచీర తీసి, చిరుగులు కనబడకుండా కట్టుకొని, తనలో తానే నవ్వుకొని బయలుదేరింది. మళ్ళీ ఏదో ఉద్యోగప్రయత్నంమీద వెళ్తున్నదికాబోలనుకుంది సీతమ్మగారు.

నాగమణి ఎదురుచూస్తూనేఉంది.

"నాకు తెలుసు, నువ్వు వస్తానంటే తప్పక వస్తావని" అంది.

"రాకపోవడం నాతరమా" అంది వసుంధర.

సఖులిద్దరూ మళ్ళీ సంభాషణకి ఉపక్రమించేరు. ఆవేళ సంభాషణ అంతా వ్యాపారపరంగానే నడిచింది.

మూడుగంటలవేళప్పుడు తన చెల్లెలు రత్న తెచ్చిన కాఫీ అందుకొంటూ, మణి "నువ్వేమంటే అదనుగాని, ఏవృత్తీ అంత తేలికయినది కాదు. దేని కష్టనష్టాలు దానిలో ఉన్నాయి."

"నిజమే, నేను కాదనలేదుగాని, అసలు వృత్తి అని ఒకటి తిన్నగా ఉంటే కష్టంసుఖంమాట తరవాత; ఇప్పుడు నాపని మాడూ, ఉదయంనుండి రాత్రి ఎనిమిదిగంటలదాకా గొంతుచించుకొని అరుస్తాను. లెక్కకేమో ఎనభైరూపాయలు రావాలి. కాని, ఒక్కొక్క నెలలో నలభైముప్పైకూడా దొరకడం దుర్ఘటంగా ఉంటుంది"

"ముప్పై, నలభయ్యేనా! నేను ఎంత క్లుప్తంగా చేసినా నెలకి ఖర్చు రెండువందలవుతున్నది. మేమూ ఉన్నవాళ్ళం ముగ్గురమే! నా ఉద్దేశం, ఏదోరకంగా కాస్త సంపాదించుకొని, అంటే ఒక అయిదారేళ్ళు కష్టపడి ఆర్జించి తరవాత ఏ పల్లెటూరుకో పోయి నిశ్చింతగా బ్రతకాలని..."

"మంచికోరికే."

"కోరికలు మంచివైతే ఏమి లాభం? 'సాయిబు సంపాదన బూబమ్మ పోగులకే సరి' అన్నట్టు, నేను తెచ్చేది కాస్తా ఇంటిఖర్చులకే అయిపోతున్నది. నీలాగే ముప్పైనలభైతో గడపగలిగితే—"

"నీకు నవ్వులాటలుగా ఉన్నట్టుంది. గడుపుకోవడం అంటే, నేను నీలాగా సిల్కుచీరలూ, పట్టు పరుపులూ ఉండాలనడం లేదుకదూ!"

"వెధవచీరలూ, వెధవపరుపులూను! నాకోసం ఏమిటి ? అంతా ఎవళ్ళకోసమో!...... మీనాన్నగారి నల్లమందంటావా ? ఈ ముసలాళ్లందరిలోనూ ఉన్న పాడుగుణమే ఇది. మా అమ్మకీ మూడురోజులకి తులం నర నల్లమందు కావాలి. దాని మిఠాయికీ, తాంబూలానికీ నెలకి అరవైరూపాయలపయిని తగలేస్తుంది."

కాఫీ ఏమీ తాగాలనిపించలేదు వసుంధరకి. బలవంతంగా తాగబోయింది. సగంలో వాంతి వచ్చింది. మణి ఆమెను ఆనుకొనిచూసి, "అబ్బ ! రేమిటే ఒళ్లు! ఇలా [ కాగిపోతున్నది!"అంది...వాంతి అయినతరవాత మొగం కడుక్కొందుకు నీళ్లిచ్చి, మొగం తుడిచి, మెల్లిగా నడిపించుకొనివచ్చి మంచం మీద ప

ఒకపావుగంట సర్దుకున్నాక వసుంధర కొంచెం సర్దుకొని, "నేను పోతానమ్మా మణీ"అంది. నాగమణి వెంటనే ఏమీ అనలేదు.

ఆమె మంచంమీంచి లేవబోతూవుండగా, "నీవంట్లో ఇలా ఉండగా, నిన్ను పంపాలని నాకు లేదుగాని మరి నువ్వు వెళ్లకతప్పదంటే నేనేమీ అనలేను"అంది మణి.

"మరేం భయం లేదు. నేను మెల్లిగా వెళ్లిపోగలను."అంది వసుంధర.

ఆమెమాట వినిపించుకోలేదు మణి. జట్కా తెప్పించి తన మెత్తని శాలువ ఒంటిచుట్టూ కప్పి, మెల్లగా జట్కాలోకి ఎక్కించి, తాను కూడా వస్తానంది. కాని, వసుంధర ఒప్పుకోలేదు. పోనీ, మాచెల్లెలు రత్నమేనా నీకూడా రానీ"అంది మణి. "ఎందుకులే, జట్కాలో కూర్చుని వెళ్లిపోవడానికి ఏమిటి కష్టం?" అంది వసుంధర.

ఎలా తాను జట్కా దిగిందో, ఎలా వెళ్ళి మంచంమీద కూలబడ్డదో ఆమె కేమీ తెలీదు.

తరవాత రెండురోజులవరకూ ఆమెకి ఒంటిమీద స్మృతేలేదు.

సీతమ్మగారికి ఒకమాదిరి వెర్రెత్తినట్లయిపోయింది.

రామం దిస్సబోయి ఏమీ అడగడం మానివేసేడు.

అప్పారావుపంతులు అలా నిర్జీవప్రతిమలా మంచంపక్కను కూర్చున్నాడు.

వసుంధర వెళ్ళినదగ్గరనుండీ నాగమణికి ఒక్కటే ఆందోళన—ఆమెకి ఎల్లా ఉందో అని. ఇంతఊళ్ళో ఎలా వెతకటం ? జట్కావాణ్ణయినా తాను సరిగా చూడలేదు. రెండురోజుల మాటల్లోనూ వీధిపేరయినా కనుక్కోలేదు. ఎంత తెలివితక్కువ! పాపం, ఇంట్లో ఎలా ఉందో !

* * *

ఎంతగా తూలిపోయినా, సీతమ్మగారు మనస్సును కూడదీసుకొని కర్తవ్యాన్ని నెరవేర్చింది.

ఆమె చెప్పీచెప్పడంలో డాక్టరు దివాకరం వచ్చిచూసేడు. "టైఫాయిడ్. కాని, మరేమీ భయం లేదమ్మా. తడిగుడ్డ మొగంమీద తరుచుగా వేస్తూ ఉండండి. నేను మందులూ అవీ పంపిస్తాను. మళ్ళీ రాత్రి ఎనిమిదిగంటలప్పుడు వస్తాను" అని పోయేడు.

డాక్టరు దివాకరానికి కీర్తీ, అపకీర్తీ రెండూ ఉన్నాయి. మంచి సాధకుడూ, తెలివయినవాడూ, ఎంత ఇచ్చినా అభిమానంగా పుచ్చుకుంటాడు అని ర్తి : కాడీల్లో కాడీ అనీ, తాగుతాడనీ, సానివీథి

అంతా అతడే సత్తగొన్నాడనీ అపకీర్తి! కాని, దివాకరంస్వభావ మేమిటంటే, ఈకీర్తిని ఎంతగా కాంక్షించగలుగుతున్నాడో ఆ అపకీర్తిని అంతకంటే ఎక్కువగా ప్రేమించగలగటం.

వసుంధరకి అప్పుడప్పుడు తెలివివచ్చేది; కాని ఆ అడుగుతున్న మాటలకి ఆమెకి అర్థం తెలిసినట్టు లేదు.

డాక్టరు దివాకరానికి ఇంట్లో ముసలితల్లితప్ప మరెవర్నూ లేరు. ఆవిడకి సీతమ్మగారంటే ఎంతో అభిమానం. రోజూ కొడుకు ఇంటికి రాగానే ఆవిడ అడిగేది—"బాబూ, వాళ్ళపిల్ల కెలాగుందిరా" అని. దివాకరంశ్రద్ధకు తల్లి అభిమానం తోడుపడింది.

మందుఖర్చులూ, పథ్యపానాలను గూర్చిన ఖర్చులూ తానే స్వయంగా భరించేవాడు దివాకరం. ఇంటికి కావలసినవాటిలోకూడా ఒక కంట చూడమని తల్లితో చెప్పేడు.

సీతమ్మగారిలోనూ, అప్పారావుపంతులులోనూ కృతజ్ఞతాధిక్యం వారి నోటివెంట ఒక్కమాటనుకూడా రానీయలేదు.

దివాకరానికి తన శక్తిమీదే అపనమ్మకం కలిగేటట్టుంది. అప్పుడప్పుడు అసందర్భంగా కలవరించే కలవరింపుతప్ప తెలివిరావడమే లేదు వసుంధరకి.

ఆవేళ ఉదయంనుండి కదలకుండా కూర్చున్నాడు డాక్టరు దివాకరం. ఎల్లాగో బలకంతపెట్టి అప్పారావుపంతులును భోజనానికి పంపేడు.

మళ్ళీకలవరింత. "మణీ, మణీ, కుటుంబమో...... అసలు వృత్తిఉంటేకదూ,..........కొనుక్కుంటే, అమ్ముకుంటే, పాపమా......"...దివాకరానికి ఏమీ అర్థంకాలేదు. ఈ మణి ఎవరో తల్లిదండ్రులకికూడా తెలీదు.

"మరేం భయంలేదు. నేనంతా ఆలోచించాను" అంటూ లేవబోయి వెనక్కి పడిపోయింది వసుంధర.

మరొక గంట పోయేక మళ్ళీ— "అమ్మా, తమ్ముడికి మిఠాయి తెప్పించు" అంది బాగా తెలివితో అన్నట్టుగానే. కొంచెంసేపట్లోనే కలవరింత మరీ ఎక్కువయింది—రోదనస్వరంతో.

"మణీ, మణీ, నా కేడబ్బా వద్దు—న న్నీ రాక్షసుడు మింగేస్తున్నాడు, మింగేస్తున్నాడు—"

దివాకరం అప్పటి కేదో మందు ఇచ్చి మళ్ళీ సాయంకాలం వస్తానని వెళ్ళిపోయేడు.

* * *

"మీరుగాని వస్తే, కాఫీ, ఫలహారమూ ఇచ్చి, వచ్చినదారినే సాగనంప మన్నాను మాచెల్లితో- తెలుసునండీ"అంది నాగమణి అప్పుడే చెమటతుడుచుకుంటూ లోనికివచ్చిన దివాకరంతో.

"నాకు కావలసినదే అది. ఇక్కడ అట్టేసేపు కూర్చుందికి నాకు తీరుబాటులేదు." అంటూ పడక కుర్చీలో కూలబడ్డాడు దివాకరం.

అతని చేతిలోని రుమాలు అందుకొని, తానే తుడిచి, విసనకర్రతో విసరుతూ అడిగింది "ఏమిటి ఆ తొందరకదా ?"అని.

"ఏమిటా ? ఏమీలేదు. ఒక ప్రమాదమయిన కేసుంది. అందులో నీ సహాయం ఏమయినా ఉపయోగిస్తుందేమోనని."

"నాసహాయమా? ఏమి, ఎవరయినా కవికుమారుడు విరహజ్వరంతో బాధపడుతున్నాడేమిటి?"

"ఊఁహు. ఇది చాలా కరుణజనకమయినదిలే. పాపం, ఒక ఇరవైఏళ్ళ అమ్మాయి..."

"మరేం, మీ రొట్టె విరిగి నేతిలో పడిందన్నమాట. అందుకేమరి ఇన్నాళ్ళూ దర్శనాలు లేవు" అంది ఉల్లాసంగా మణి.

తీవ్రంగా మొగంపెట్టి, "చెప్పేది చివరంటా వినకుండానే నవ్వుతావు. అందికే నాకు అసహ్యం" అన్నాడు డాక్టరుసాహేబు.

అమాయికంగా 'అయ్యో' అంది నాగమణి.

"పాపం, ఆ అమ్మాయే ఆయింటికి ఆధారం. ఒక ముసలితండ్రి ఉన్నాడు, ఎందుకూ పనికిరాడు."

"ఆఁఆఁ, ఏమిటి, ఆ అమ్మాయి పేరేమిటన్నారు?"

"ఆ అమ్మాయిపేరేమిటో నాకుతెలీదు; కాని వాళ్ళమ్మగారి పేరు సీతమ్మగారట. ఆ అమ్మాయి గర్ల్స్ స్కూల్లో సంగీతం చెప్పేదిట—"

మరి అనుమానం లేకపోయింది నాగమణికి.

"అయితే మా వసుంధరే. ఎలా ఉందేమిటి ? మరేం ప్రమాదం లేదుకదా ?"

"ఏమిటో చెప్పలేము. ఇదివరకు కొంత ధైర్యంగా ఉండేదిగాని, నిన్నటినుండీ మరీపాడుగా ఉంది; ఇవాళ ఉదయం 'మణీ, మణీ' అని కలవరించింది, నీ గురించే కాబోలు"

"నిజమే. పదండి వేగం. ఆవేళ పాపం ఇక్కడినించి వెళ్లేవేళకే విపరీతమయిన జ్వరం. నన్నుకూడా దిగబెట్టనివ్వలేదు. ఏ వీధిలో ఉన్నారో కూడా తెలీదు. ఆవేళ జట్కావాణ్ణి వెతికించేను. వాడూ కనబడలేదు. పదండి వేగం."

"ఉండు, ఒక్కనిమిషం—కళ్లు మండుతున్నాయి. రాత్రల్లా నిద్రసరిగా లేదు."

'పాపం' అంది ఎంతో అభిమానంగా మణి తల పట్టుతూ.

*　　*　　*

దివాకరం ఇచ్చిన ఇంజక్షనుతో అంతచక్కగా తెలివిరావడం అందరికీ ఎంతో ఆశ కలిగించింది. కాని అతడికిమాత్రం లోలోపల అనుమానంగానే ఉంది.

"మణీ, వచ్చావా, వచ్చావా? నేనేమీ చెడిపోలేదుకదూ" అంది వసుంధర.

మణి మాట్లాడలేక, కన్నీళ్లను ఆపుకోలేక మొగం పక్కకు తిప్పుకుంది.

తరవాత మరొక్కక్షణం కళ్లు మూసుకొని, తెరిచి, "అమ్మా, తమ్ముడేడీ" అంది వసుంధర.

వెలవెలబోతూ దగ్గరకు వచ్చి నిలబడ్డాడు రామం.

"రామం, ఇదుగోనమ్మా, మరో అక్కయ్య. నేను లేకపోయినా, ఈ అక్కయ్య నీకు రోజూ అన్నీ కొనిపెడుతుంది" అని మరి మాట్లాడలేకపోయింది.

అందరూ ఏడిస్తే, ఎందుకో తెలియకుండానే తానూ కళ్లలో నీళ్లునించుకున్నాడు రామం.

*　　*　　*　　*

కుటుంబంలో ఒక మనిషి తగ్గిపోయేసరికి అంతకంటే తక్కువ బంధమూ, ఎక్కువ ఆర్థికసాధన సంపత్తీ గల ఇంకొక మనిషి వచ్చింది.

రామానికి తగని ముద్దు జరగటంవల్ల చదువు సరిగా అంటలేదు; కాని, ఇరవైయేళ్లు వచ్చేలోపునే తెలుగుదేశంలో అతని పేరు బాగా వ్యాపించింది మంచి ఫ్లూటు (వేణువు) వాద్యకుడుగా. కాని, అతడికి ఎన్నడూ కుటుంబాన్ని పోషించవలసిన అగత్యం కలగలేదు. అతడు చేయవలసిన తప్పనిసరిపని ఏమిటంటే? నెలరోజులకొకమారు వెళ్లి అక్కయ్య మణి పెట్టిన మిఠాయి కడుపునిండా తినడమే.

వసుంధర పోయినతరవాత మణి అనుకుంది—"నావృత్తి మంచిదో చెడ్డదో, నా కిప్పుడే సంకోచమూ లేదు. ఏమంటే, మునపటిలా నాసుఖంకోసమే నేను పాటుపడలేదు; నన్ను అంటిపెట్టుకొనిఉన్న అమాయికమయిన కుటుంబాన్ని పోషించడంకూడా ఇప్పుడు నా కర్తవ్యాల్లో ఒకటి. ఎవరి కుటుంబాన్ని వాళ్లు పోషించుకోవడంలో ఏమి తప్పుంది?" అని.

నాగమణిలో ఏదయినా విచారం ఉంటే అది, తన చెల్లెలు రత్నాన్ని తన వృత్తిలో దిగకుండా కాపాడలేకపోవడమే.

అప్పారావుపంతులూ, సీతమ్మా ఎప్పుడెప్పుడని రోజులు లెక్కపెట్టుకుంటూనే కొన్ని సంవత్సరాలు, విచారంలేకుండా కాకపోయినా, డబ్బుకు సంబంధించిన వడిదుడుకులూ, వేదనా లేకుండా బ్రతికేరు.

కొన్నాళ్లపాటు అప్పారావుపంతులుకి అభిమానంగా ఉండేది. ఆవిధంగా ఏమీ సంబంధం లేని, ఎవరో అమ్మాయిమీద ఆధారపడటం. కాని, క్రమంగా, అత డామెను ఎవరో అన్నట్లు కాకుండా, అత్యంత ఆత్మీయురాలుగా భావించేస్థితికి వచ్చేడు.

కాని సీతమ్మగారి గుండెల్లో తగిలిన గాయం ఇంకా బలమైనది. ఆమెమనస్సులో మణి అంటే ఏదో చెప్పలేని అభిమానమూ, ఆమె నిర్వ్యాజంగా చేస్తున్న సహాయానికి కృతజ్ఞతాభావమూ లేకపోలేదు అతిఉజ్జ్వలంగా. కాని, ఆమెలోపల్లోపల వసుంధర నీడలు చెరిగిపోలేదు. జీవితంలోని అత్యంతమధురమయిన భాగమంతా తలకుమించిన భారంతో కృంగిపోతూకూడా తమకోసం, లేని ఉత్సాహంతో ఆజీవితాంతమూ ఆవేదనపడిన ఆకూతురును తలచుకోని క్షణమే ఆమె శేషజీవితంలో లేదనడం అతిశయోక్తి కాదు.

# ఆర్షధర్మసంగ్రహం

శ్రీ నిర్వికల్పానందస్వామి



హిందూమతం అనే పేరుతో లోకప్రసిద్ధి చెందిన ఆర్షధర్మానికీ, ప్రపంచంలో ఉన్న మిగిలిన మతాలకీ ప్రభేదం ఏమిటి? ప్రకృతి శక్తుల్ని తమ క్రీడాపుత్తలికలుగా చేసుకొన్న అమెరికా ఐరోపాఖండాలుకూడా ఈ ఆర్షవాణియొక్క అమృతధారల్ని పానంచెయ్యటానికి కుతూహలపడుతూ ఉండటానికి కారణ మేమి?

అనే విషయాలు ఈమతంతొడుగులో పుట్టి పెరిగినవాళ్లందరికీ అనుసంధాన యోగ్యాలు.

వాల్టు విట్‌మన్, ఎమర్సన్, కార్లయిల్, పాల్‌డయిసన్, మాక్సుముల్లర్, స్కాపెన్‌హూవర్ ప్రభృతులైనవాళ్లందరూ మన దర్శనశాస్త్రాల్ని భట్రాజుల్లాగా పొగడిన సంగతి లోకవిదితమేకదా! వాళ్ల ప్రశంసాపత్రాల్ని ఇక్కడ అనువదించటం అనావశ్యకం.

సృష్టికంతటికీ మనుష్యుడే మకుటాయమానమనిన్నీ, అతని ఆత్మ అమరణధర్మి అనిన్నీ మన దర్శనశాస్త్రసిద్ధాంతం. ఇక తదితరమతాలు ఏకరువుపెట్టే ధర్మపన్నాల సూక్తి—మనుష్యుడు పాపంలో పుట్టి సదా సైతానుయొక్క కుటిలదృష్టికి గురిఅవుతున్నాడని. మన దర్శనశాస్త్రసిద్ధాంతం మనస్సుకి ఎంత ఆహ్లాదాన్ని కల్పిస్తున్నదీ, రెండవ సిద్ధాంతం ఎంత గ్లానిని చేకూరుస్తున్నదీ వేరే చెప్పనక్కర్లేదు.

ఈశ్వరుడియొక్క లీలాపరిణామమే ఈ విచిత్ర జగద్రచన అని మన శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. ఇక పరాయిమతాల దృష్టిలో ఇది పాపాల బుంగ.

ఇతరదేశాల్లో ప్రబోధింపబడే మతాలకిన్నీ, మన దేశంలో వ్యాప్తమైన మతానికిన్నీ ఉన్న తేడా ఏమిటంటే: మన మతానికీ, సాంఘికజీవితానికీ లంకె ఉంది. ఇతరదేశాల్లో ఉన్న సంఘాలు మతాన్ని ఒక ప్రక్కకు నెట్టి పెరిగాయి. ఫలితంగా ఆర్యసంఘం, ఆర్యసంస్కృతీ అనేవి యుగాలతరబడి చెక్కుచెదరకుండా నిలిచిఉన్నాయి. ఇక పాశ్చాత్యదేశాల్ని చూస్తే, ఎన్నో జాతులూ, ఎన్నో సంఘాలూ, ఎన్నో సంస్కృతులూ ఉద్భవించి, మూణ్ణాళ్లముచ్చటగా అంతరించిపోయాయి. ఆయా దేశచరిత్రల్ని కొంచెం తిరగవేస్తే ఈ సత్యం మనకు ఉపలభ్యమవుతుంది.

కర్మ, భక్తి, జ్ఞానము అనే త్రిశక్తుల్ని మన మతం ఉద్బోధించినంతగా మరేమతమూ ప్రచారం చెయ్యలేదు. ఈ మూడూ ఏకత్ర సమన్వయమవుతేగాని మనుష్యజీవితం ఆనందోద్భాసితం కాదు. జ్ఞానపరిపూర్ణుడైనవాడే భక్తిమయుడవుతాడు. అల్లాంటివాడే జగద్ధితకరమైన కర్మని ఆచరింపగలుగుతాడు. ఇల్లాంటి క్రమవికాసం లేనినాడు పశుజీవితానికీ, మనుష్యజీవితానికీ అంతగా ప్రభేదం ఉండదు.

తక్కిన మతాలు ఈ మూడింటిలో ఒక్కదాన్నే గట్టిగా నొక్కిచెప్పాయిగాని, మూడింటినీ కలిపిచెప్పలేదు. యథా:—బౌద్ధమతం లోకహితకరాచరణాన్నే ముఖ్యంగా చెప్పింది. మహమ్మదీయక్రైస్తవమతాలు భక్తినే బహుళంగా ప్రచారంచేశాయి. పాశ్చాత్యదర్శనాలు జ్ఞానాన్వేషణతోనే పరిసమాప్తిని పొందాయి. కనుక లోకంలో ఇవి విరళప్రచారాన్నే పొంది, ఏదోఒకవిధంగా నామరూపాల్ని నిలబెట్టుకుంటున్నాయికాని, ఆయా ధర్మావలంబకులకుగాని, లేక ఆయాధర్మాల్ని అనుసరిస్తున్నామని చెప్పుకొంటున్న దేశాలకుగాని చైతన్యాన్ని ప్రసాదింపలేకుండా ఉన్నాయి. కనుకనే లోకంలో మారణహోమానికి సమిత్తులు లభిస్తున్నాయి.

ఈ ఆర్యధర్మాన్ని సంగ్రహంగా పరిశీలన చెయ్యాలంటే వేదాలు, పురాణాలు, తంత్రాలు అనే త్రివిధశాస్త్రగ్రంథాలు గమనికలోకి వస్తాయి. సంహితలూ, బ్రాహ్మణాలూ, ఆరణ్యకాలూ, ఉపనిషత్తులూ అనేవి వేదవిభాగాలు. సంహితాబ్రాహ్మణాలు కర్మకిన్నీ, మిగిలిన రెండూ క్రమంగా ఉపాసనా (భక్తి)జ్ఞానాలకిన్నీ సోపానాలు. మహాపురాణాలకు శాఖలుగా ఉపపురాణాలున్నూ, స్థలపురాణాలున్నూ లభిస్తున్నాయి. తంత్రాల్లో ఆగమనిగమభేదం ఉంది. మళ్లీ తంత్రం శైవశాక్తపరంగానూ, ఆగమం శివవిష్ణుపరంగానూ లోకంలో ప్రత్యక్షమవుతున్నది.

పురాణాల్లో వర్ణించబడిన దేవమూర్తులకు ఆయతనాలు ఏ విధంగా కట్టి, అర్చావిధుల్ని ఏ మార్గంగా కల్పించాలి అనే విషయాన్నీ; మరిన్నీ ఆ దేవమూర్తుల్నే గృహదేవతలుగా చేసుకొని ఏ విధంగా ఉపాసించవలసిందీ తంత్రాగమాలు బహుళంగా వర్ణిస్తున్నాయి.

వేదాల్లో స్తుతింపబడిన దేవతలందరూ పురాణాల్లో త్రిమూర్తులుగానో, లేక ముగురమ్మలు (లక్ష్మీ సరస్వతీ పార్వతులు)గానో మారిపోయారు. నిగమాగమాలు విశదంగా వీరి ఆరాధన్నే వర్ణిస్తున్నాయి.

వేదోక్తకర్మకాండలో విసుగుచెందిన ఋషి అన్వేషణాఫలంగా ఉపనిషత్తులువర్ణితమైన ఆత్మజ్ఞానాన్ని పొందాడు. కాని సామాన్యులు తేలిగ్గా కర్మనుండి జ్ఞానానికి లంఘించలేరు. వాళ్లకు మధ్యగా ఉపాసన అనే సేతువు అవసరమవుతుంది.

ఈ ప్రయోజనాన్నే పురాణాలు దృష్టిలో ఉంచుకొని, ఈశ్వరుడు భావగమ్యుడు అని చెపుతున్నాయి. 'శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధురములు' అనే భావపంచకాన్ని సాధకుడు ఆశ్రయించి, ఆ ఈశ్వరసత్తను సృష్టిస్థితిలయకారకంగానో, ప్రభువుగానో, స్నేహితుడుగానో, సంతానరూపంలోనో, భర్తగానో ఆరాధించవచ్చు.

ఈ భావాలకు ఆశ్రయమైనది మనస్సు. ఇవి మనస్సులో సుప్రతిష్ఠాలు కావాలంటే తదనుగుణమైన కర్మాచరణం అవశ్యంభావి. తంత్రాలు ఈ కర్మోపదేశంతోనే నిండిఉన్నాయి. ఈశ్వరసత్తను గాణపత్య, సౌర, శైవ, వైష్ణవ, శాక్తరూపాల్లో భావించవచ్చునని తంత్రం ఆదేశిస్తోంది. అంతేకాకుండా ఇష్టదేవతారాధనకుముందు ఈ పంచదేవతల్ని ఆరాధించాలనే నియమం ఉంది. తంత్రోక్తమైన మంత్రాల్తో యంత్రస్వరూపియైన దేవతయొక్క అర్చన. ఒక దేవతను ఆరాధిస్తున్నవాడు తదితరదేవతారాధకుల్ని విద్వేషింపకుండాఉండేనిమిత్తమే ఈ పంచదేవతాపూజ అనే అంశాన్ని మనం సుస్పష్టంగా గ్రహింపవచ్చు.

ఈ దేవతల్ని ఆరాధించే క్రమంలో విశేషం ఏమిటంటే, ద్వైతభావనతో ఆరంభించిన సాధన అద్వైతంతో పరిసమాప్తిని చెందుతుంది. "దేవో భూత్వా దేవం యజేత్"—దేవత్వాన్ని పొందినవాడే దేవతను అర్చింపగలడు అనేది ఈ తంత్రశాస్త్రసిద్ధాంతం. పశు(ద్వైత)భావనతో ఆరంభించిన సాధన వీరమార్గంగుండా నడచి, దివ్యత్వాన్ని అధిరోహిస్తుంది.

ఈ పంచదేవతల్లో గణపతికి సంబంధించిన హరిద్రగణపత్యాది రూపభేదాలున్నూ, సూర్యుడికి సంబంధించిన ద్వాదశాదిత్యాదివర్ణనలున్నూ, మహావిష్ణువుకు సంబంధించిన దశావతారాలూ, శివుడికి సంబంధించిన అష్టమూర్తికల్పనా, శక్తికి సంబంధించిన దశమహావిద్యాది వర్ణనలూ భక్తుల హృదయాల్ని ఆనందసాగరోద్వేలితాలు చేస్తాయి.

కాగా, భక్తిపరిప్లుతమైన ఆర్షనేత్రాలకు పాలస్తయినాలో అవతరించిన క్రీస్తూ, అరేబియాలో అధివసించిన మహమ్మదూకూడా ఈశ్వరావతారాలుగానే గోచరిస్తారు. ఆనందోద్భాసితమైన ఈ ప్రపంచసరోవరంలో స్నానకేళి జరుపుతున్న ఈశ్వరశక్తే ఒక తడవ శిరోన్నయన మొనర్చేటప్పటికి భక్తుడికి రాముడుగానూ, ఇంకోతడవ కృష్ణుడుగానూ, మరొకతడవ బుద్ధుడుగానూ, వేరొకతడవ క్రీస్తుగానూ,

ఇంకొకమారు మహమ్మదుగానూ గోచరించారు. విగ్రహ యుతమైన ఈ సగుణశక్తే కొందరకు 'నిర్గుణనిరాకార-రూపం'లో సాక్షాత్కరించటమూ ఆశ్చర్యం కాదు.

## ౪

స్థూలంగా పరిశీలిస్తే వర్తమానకాలంలో భారత దేశంలో ఉన్న హైందవులందరున్నూ శివారాధకులుగానో, లేక విష్ణుపూజాపరులుగానో, లేక దేవీఉపాసకులుగానో కనిపిస్తారు.

ఆంధ్రదేశంలో ఉన్న పట్టణాలన్నిటిలోనూ ఒక శివాలయమున్నూ, ఒక విష్ణ్వాలయమున్నూ ఉండటం పరిపాటి. దక్షిణాదిన శైవసిద్ధాంతాన్ని అనుసరిస్తున్నవాళ్లున్నూ, శ్రీవైష్ణవాన్ని పుచ్చుకున్నవాళ్లున్నూ కనపడతారు. ఓఢ్రదేశీయులందరూ ఇంచుమించుగా శ్రీచైతన్యస్వామి ప్రబోధించిన వైష్ణవ మతాన్ని అవలంబిస్తున్నారు. వంగదేశంలో ఇదిన్నీ, దీనితో సరిసమానంగా శక్త్యారాధనా గోచరిస్తాయి. హిందీభాష మాట్లాడేవారందరూ ప్రాయికంగా రామ భక్తులు. గుజరాతీవాళ్లు వల్లభస్వామి ప్రబోధించిన వైష్ణవాన్ని అనుగమిస్తున్నారు. మహారాష్ట్రంలో శివ పూజాధురంధరు లున్నా, మహావిష్ణువు పాండురంగడై వారి మన్ననలను పొందుతున్నాడు. కన్నడులలో వీర శైవులూ కనబడుతారు, వీరవైష్ణవులూ ప్రత్యక్ష మవుతారు.

భగవంతుణ్ణి ఏరూపంలో అర్చించినా సరే కాని, తుద కారూపంతో ఐక్యాన్ని అనుసంధానించుకొని మళ్లీ జన్మ లేకుండా చేసుకోటమే పరమావధి— అనే అంశం భారతీయుడై జన్మించిన ప్రతి—వ్యక్తి కీ తెల్సు. ఎన్ని చదువులు చదివినా, ఎన్ని పోకడలు పోయినా, చివరకు సృష్టింపబడిన జీవుడు స్రష్టను చేరుకోవాలి. నదికి గమ్యస్థానం సాగర మేకదా !

"నృణా మేకో గమ్య స్త్వమసి పయసా మర్ణవ ఇవ"






# పూలు - వాటి నిజస్వరూపాలు

కడలియందు గల పువ్వులతోటకు గల సౌందర్యమునకు సాటియైనది ప్రకృతిలో ఇంకొకటి లేదు. ఈ తోటలోని పువ్వులు నిజముగా జంతువులు! మాంసాహారులు గూడా! ఈ తోటలు ముఖ్యముగా ఉష్ణమండలపు సాగరజలములలో వైడూర్య, మరకత, పద్మరాగ వర్ణములతో భాసిల్లుచు, కన్నులపండువుగా కనిపించుచుండును. కవులు వీటిని చూచియే సాగరములో నాగకన్యకలు జలకమాడుచుందురనియు, వారికి వివిధవర్ణములచే విరాజిల్లు క్రీడోద్యానవనములు గలవనియు భ్రాంతి జెందిరి.

భూమిపై మనము అందమైన పువ్వులను, పలు విధములయిన జంతువులను చూచెదము. ఇక్కడ మొక్కలు ఒక్కచోటికే అంటిపెట్టుకొని యుండును. అందువలననే వృక్షములకు స్థావరము లని పేరు. ఇక్కడ జంతువులు ఒక చోటినుండి మరొకచోటికి కదలుచునేయుండును. కాన జంతుకోటి జంగమము లనబడును. కడలియందలి వింతప్రపంచములో ఈ క్రమము తల్లక్రిందులయినది. కడలిమొక్కలు (Sea-Plants) జంగమములు. పువ్వులవలె కానవచ్చు కడలి జంతువులు స్థావరములయి, ఏ బండకో, లేక ఏ జంతువు చిప్పకో కరచుకొని కదలికయే లేక జీవితమంతయు గడుపును. అట్టి కడలిపువ్వు (Sea-Flowers) లనబడు కడలిజంతువులనుగూర్చి తెలిసికొందము.

స్పంజి, లేక సముద్రపుపాచి (Sponge)ని చూడనివా రరుదు. ఇది యొక సముద్రప్రాణి అస్థిపంజరమని మనము నమ్మలేము. ఈ జంతువులు సముద్రమున సమిష్టిగా జీవించును. చాలకాలమువరకు వీటిని మొక్కలనే భావించెడివారు. ఎందుకనగా ఇవి స్థావరములు. కాని ఇవి గ్రుడ్లుపెట్టి సంతానాభివృద్ధిగావించుకొనును. సముద్రములోని ఏకకణజంతువులు (Uni-cellular animals) వీటి ఆహారము. ఇవి పాలు, అన్నపు ముక్కలు పెట్టినను, తిని జీర్ణించుకోగలవట!

తెలుపు, పసుపు, ఆకుపచ్చ, లేక రక్తపురంగులను కలిగి అందముగా తురాయిపువ్వుమాదిరి కనిపించే ఇంకొకజంతు వున్నది. ఇది సముద్రఅనిమోను (Sea-anemone) అని పిలువబడును. ఈ జంతువులు సన్యాసి ఎండ్రకాయచిప్పకో, లేక ఏ గుట్టకో కరచుకొని జీవితాంతమువరకు స్థావరముగానే యుండిపోవును.

ఈ అనిమోన్లకు నిరోధకశక్తి చాలా ఎక్కువ. బొబ్బలురేగునంతటి వేడినీటిలో వీటిని ముంచినను, మంచుగడ్డలో ఉంచినను, గాలియే సోకకుండ జేసినను, ఒక్క సంవత్సరమువరకు తిండియే లేక పస్తుంచినను— ఇవి చావనేచావవు. ఇవి చాల మొండిప్రాణులు. కాని మంచినీటిలో ముంచితేమాత్రము వీటి ప్రాణములు నిలువవు. అందుకల్లనే ఇవి కడలిఉప్పునీటిలోనే కష్టాలకోర్చి జీవించును.

అనిమోను ఒక గొట్టమువంటి జంతువు. దీనికి కండరయుతమైన కడుపు గొట్టము మధ్య నుండును. దీని నుండి రబ్బరువంటి నాళములు చేతులవలె అనిమోను నోటిచుట్టు లెక్కలేనన్ని యుండును. వీటికి తంతులు

(Tentacles)అని పేరు. ప్రతి తంతునందు కాటు) వేయగల గోళికములు (Stinging cells) ఎన్నో ఉండును. సూక్ష్మదర్శినితో చూచినచో ఈగోళికములు బుడుపల (Vesicles) వలె కన్పడును. ప్రతి గోళికములోను ఒక కారమయిన ద్రవము, దానిలో చుట్టగానున్న దారపుపోగు (Filament) ఉండును. ప్రతిపోగు సూదివంటి మొన గలిగియుండును. అనిమోను నోటివద్దకు ఒక చిన్న చేప రాగానే అనిమోనుతంతుల లోని వేలకొలదిగోళికములు పగిలి వాటి సూదులవంటి పోగులన్నీ ఒక్కమారుగా ఆ చేపపైకి విసరబడును. ఇవన్నియు, ముళ్ల జెముడుపై చేయి పెట్టినపుడేవిధముగా ముళ్లుగుచ్చుకొనునో ఆవిధముగా ఆ చేపదేహమును పొడుచును. అంతేకాదు. పాము కాటువేసినప్పుడు విష మేవిధముగా ఎక్కింపబడునో ఆవిధముగానే గోళికపుపోగులు చేపను పొడిచి దాని గాయములోనికి ఒక విషద్రవమును చిమ్మును. ఈ అనిమోనువిషపు కాటునకు చేప చచ్చిపోవును; లేక కొయ్యబారిపోవును. చేప పూర్తిగా చంపబడిన తర్వాత దానిని అనిమోను మ్రింగి, నమలి, పీల్చి పిప్పిచేసి, తర్వాత పిప్పిని నోటిద్వారానే ఉమ్మివేయును. అనిమోను తక్కిన జంతువులవలె మలవిసర్జన చేయదు. హంస పాలనుండి నీటిని వేరుజేయునట్లు, అనిమోనుగూడ తన ఆహారమున పనికివచ్చునది పీల్చుకొని, పనికిరాని పదార్థమును విసర్జించును.

ఈవిధముగా అనిమోనునకు ఆహారసముపార్జనకు తంతులు తోడ్పడును. చేపలు, రొయ్యచేపలు, కడలిపురుగులు, ఎండ్రకాయలు, నత్తలు మొదలగునవి అనిమోనుయొక్క ఆహారము. ఆహారముకొరకు అనిమోను ఎక్కడా వెదకుకొని పోనవసరమేలేదు. అదేమి ఆశ్చర్యమోకాని సాధారణముగా అనిమోను నోటిలోనే ఆహారము వచ్చిపడును. అనిమోను చాల తిండిపోతు. తిండిపై పేరాశచేత పలుమారు ఇది తన కంటె పెద్దజంతువును మ్రింగివేయును. అనిమోను పెద్ద శంఖుచిప్ప పురుగుతోపాటు మ్రింగివేయును. శంఖుచిప్ప అనిమోనుయొక్క కడుపుకు, నోటికి మధ్య దారిని పూర్తిగా మూసివేయును. శంఖుపురుగును తిన్న వెనుక చిప్పను నోటిగుండా విసర్జింప అనిమోనుకు వీలుపడదు. దీని అవస్థ కొమ్ములుగల పెద్ద మేకను మ్రింగిన కొండచిలువవలె, విషముతినిన గుజ్జువలె చావుగా నుండును. కాని అనిమోను ఇట్టి అవస్థనుండి అతితేలికగా తప్పించుకొనును. అదేమి ప్రకృతివైచిత్ర్యమోగాని వెంటనే అనిమోను పృష్ఠభాగమున క్రొత్తనోరు, కాటువేయు తంతుల (Tentacles)తో సహా తయారగును. అపుడు అనిమోను కడుపులో చేరికొనియున్న శంఖుచిప్ప కడుపుక్రింద ఏర్పడిన నోటిగుండ విసర్జింపబడును.

అనిమోను కూడ అన్నిజంతువులవలె గ్రుడ్లు పెట్టును. ఇవి నీటిలో తేలి తర్వాత ఏదైన బండలో, లేక ఏదోఒక ఎండ్రకాయచిప్పకో కరచుకొనును. ఇవి కొంతకాలమునకు పగిలి క్రొత్త అనిమోన్లు బయటికి వచ్చును. అనిమోన్లుకూడ ఎపుడైన స్థలముమార్చును. అపుడు దానికి దేహనష్టము సంభవించును. దాని మొదలు (Stump) ఉన్నచోటనే ఉండిపోయి, తక్కిన అనిమోనుమొదలునుండి చిరిగి, జారుచు, దొర్లుచు వేరేస్థలము చేరుకొనును. అయితే ఈ మొదలుయొక్క ప్రతితునుకనుండి క్రొత్త అనిమోన్లు మొలచును. ఇట్టి గుణము వానపామున కున్నది. వాన పాము నెన్ని తునుకలుగా చేసినను అన్ని తునుకలు అన్ని పాములుగా ఏర్పడును. అట్లే అనిమోనుశరీరపు ప్రతి తునుక ఒక అనిమోనుజంతువుగా మారును.

ప్రకృతిలో అనిమోనుకు, సన్యాసి ఎండ్రకాయ (Hermit-crab)కు గల స్నేహబాంధవ్యములు అత్యద్భుతమైనవి. సన్యాసి ఎండ్రకాయ ఎల్లప్పుడు అనిమోనును వీపుపై మోయుచుండును. దానికి అనిమోను దొరకకపోతే పిచ్చెత్తినట్లు అనిమోనుకొరకు తిరుగాడుచు, అనిమోను దొరకినవెంటనే దానిని మూపుపై వహించును. అనిమోనును సన్యాసిఎండ్రకాయ మంచి ఆహారమువద్దకు కొంపోవుచుండును. తిండిపోతైన అనిమోను ఆహారము కంటబడినపుడెల్ల ఎండ్రకాయకు లేకనే అంతయు తానే కబళించుచుండును. అనిమోను తినగా మిగిలినది, విసర్జించినది ఎండ్రకాయ తిని వేయును. కాటువేయు గుణము గల అనిమోనుఎండ్రకాయను ఇతర జంతువులబారినుండి తప్పించును. అంతే

గాక అనిమోను అతితిండిపోతుతనమువల్ల ఎండ్రకాయకు కొంత తిండి లభించుచుండును.

సముద్రములో చాలద్వీపములు పగడపుసుట్టల నుండి నిర్మింపబడినవే. ఇవి సున్నపురాతిచే నిర్మింపబడినవి. ఇవి అనిమోనువంటి చిన్నజంతువులచే నిర్మింపబడును. ఈ జంతువులు సమిష్టిగా సముద్రజలములలో నివసించును. ఈ జంతువుల గుంపు చూచుటకు సస్యసమూహమువలె కనిపించుచుండును. ప్రతిజంతువు సూదితలయంత చిన్నదిగా నుండును. దాని నోరుచుట్టు కాటువేయగల తంతు లనేకము లుండును. ఈ జీవులు తమ దేహసంరక్షణార్థము తమచుట్టూ సున్నపురాయి కోటనొకటి నిర్మించికొని దానిలో నివసించును. ఈ సున్నపురాతికోట వృక్షమువలె శాఖోపశాఖలు గలిగి తెలుపు, ఎఱుపు, పసుపు, నీలము, ఊదా మొదలగు ఉజ్జ్వలవర్ణములు గలిగియుండును. ఈ పగడపుసుట్టలు జీవులచే నిరంతరము నిర్మింపబడుచునే యుండును. కొంతకాలమున కివే పెద్దపర్వతములై సముద్రద్వీపములుగా నేర్పడును. సముద్రములలో అనేకసార్లు నీటిలో అగుపించకఉండు పగడపుసుట్టలకు నౌకొని ప్రక్కలుగా అయిపోవుచుండును.

మంచిపగడములు చాల విలువగలవి. వీటి విలువ వీటి ఆకర్షణీయమైన రంగులపై ఆధారపడియుండును. పగడములలో ఎఱుపురంగు గలవి చాల శ్రేష్ఠమయినవి. ఇవి నక్షత్రములవంటి—ఎనిమిది తంతువులు గల చిన్న జంతువులచే నిర్మింపబడినవి. పగడములపొడిని వైద్యములో 'ప్రవాళభస్మ'మను పేర అన్నిదేశములలోను రక్తసంబంధవ్యాధులకు మందుగా వాడెదరు.

మంచిపగడములేగాక నల్లపగడములు అనునవి గూడ బజారులో అమ్మబడును. ఇవిగూడ అనిమోనువంటి జంతువులచే సమిష్టిగా నిర్మింపబడినవే. కాని ఈ పగడములు సున్నపురాతిచే నిర్మింపబడియుండవు. ఈ జంతువులన్నీ గుండ్రముగా ఒక కొమ్మువంటి పూస చుట్టూ ఏర్పడి తామరపూవు ఆకారము గలిగి జీవించును. మధ్యను కొమ్మువంటి పూస ఎఱుపురంగు ముళ్లతో గూడియుండును. ఈ పగడములు కొరుసలుపు గలిగియుండును. ఈ జంతువులుగూడ అనిమోనువలె తంతులతో ఆహారము సంపాదించుకొనును.

"రాము"





# మాతృదేవి

[కథానిక]

= శ్రీ పుట్టి ఆంజనేయశర్మ

"అమ్మా! దాదీ."

.......

"అబ్బా!...నేర్సు...ఒక్కసారి"

ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో, పాలిపోయిన ముఖంమీద దట్టంగా పెరిగిన గడ్డంతో, నాలిక తడుపు కుంటూ పిలుస్తున్నాడు నెం 23 గదిలో వున్న రోగి. ముసలినర్సు మెల్లిగా ప్రక్కగదిలోని సోఫానుంచి తల ఎత్తింది. ఆ మౌనముద్రలో విపరీతతలపులు మెరుపుల్లా మెరిసి మాయమైవుంటాయి. ఆమెకు ఒకటే ఆలోచన: ఆ రోగి యెవరు? ఆ అభాగ్యుని అస్థిపంజరంలోనుంచి ఎటువంటి విషాదవిషయాలు స్ఫురణకు వస్తాయి? అత నెవరో తనకు తెలియదు. ఎన్నో వందలమంది వస్తూంటారు. ఎవరూ తన హృదయాన్ని ఇంతబలంగా ఆకర్షించి, తన శరీరాన్ని ఇలా కుదిపి, తన్నింత ఆరాటపెట్టలేదు. ఆమె మరిచిపోలేదు అతని కళ్ళని! ఎంత మంచి కళ్లు అతనివి! తను ఆ కళ్లని ఎప్పుడో చూసివుండాలి. కారు మబ్బులతో మలినమైన ఆకాశంలో మెరిసే జంటనక్షత్రాలు. ఆనందంకాని, ఆశకాని, తను విశేషించి ఫలానిదాన్ని ఆశించి అన్వేషిదామని గొప్ప చెప్పుకొనే జీవితం కాని తన కికముందు వుండదని ఆమె ఎప్పుడో నిశ్చయంచేసుకొంది. ఆ రోగిని ఎక్కడో పడివుంటే ఈ ఆస్పత్రిలో చేర్చి పోయారు దారినపోయే దాసయ్యలు. అతను—ఆవును, బాగా జ్ఞాపకం—అతినీరసంగా, చేరజేసి మెరిసే కళ్లతో నావంక చూస్తూ "ఇంకా నేను చచ్చిపోలేదా?" అన్నాడు. చాలాసేపు పసిపిల్లాడిలా ఏడ్చాడు. తను విధ్యుక్తధర్మంగా ఆ అనాథున్ని లాలించింది. ఆ ప్రేమానుభూతివల్ల ప్రయోజనం లేకపోయినా.

"ఎందుకు ఏడుస్తావ్?"

"అంతకంటే నేను చెయ్యగల ఘనకార్యాన్ని ఊహించుకోలేకుండావున్నాను. అయితే, నన్ను ఏడవనివ్వరా?"

"వూరికే మనస్సు పాడుచేసుకోబోకు. సౌఖ్యం లేనంతమాత్రాన చావు కోరతావా? పిచ్చివాడా!"

"ఒకప్పుడు అందరూ ప్రేమించారు. కొంత కాలానికి ద్వేషించారు. నన్ను నేను గాఢంగా ప్రేమించుకున్నంత కాలం ఎవర్నీ శిక్షపెట్టలేదు"

"సరే, పడుకో"

"నన్ను మీరు మాట్లాడనియ్యాలి. లేకపోతే నేను వూరుకోను. ఈ గదిలో గోడలైనా కనీసం వింటాయికదూ!"

పాపం! అతన్ని చూస్తే జాలి, పరితాపం, సానుభూతీ తనలో మెదిలాయి. అందుకే అతని నంత హృదయంలో సన్నిహితునిగా చేసుకొంది.

"నువ్వంటే నాకు చాలా యిష్టం."

ఆ రోగికళ్ళు ఆనందజ్యోత్స్నలను వెదజల్లాయి. విషాదంగా, బరువుగా, పెద్దగా గది ప్రతిధ్వనించేటట్లు నవ్వాడు.

"నాకు చాలా బాధగా వుంది నవ్వొంటుంటే. నన్ను చూస్తే నాకు రోతగా వుంది. నన్ను ఎవ్వరూ

ప్రేమించకూడదనే, నేనేదన్నా కోరడానికి వీలుంటే, వాంఛించేది!"

రోగి ఆయాసంగా కళ్లు మూశాడు. తను అప్పుడు వెళ్లిపోయింది.

ఆమె అప్పుడే అతని కళ్లతో తీవ్రంగా వేటాడబడింది. అవెప్పుడో తన కళ్ళలో ప్రతిబింబించి తన చెవులో "నాపిచ్చిసుందూ!" అని గట్టిగా ఘోషించి వుంటాయి.

*   *   *   *

తడబడే అడుగులతో రోగిగదిలోకి మెల్లిగా నడిచింది. అతను కన్నులు మూసుకొని అమితాయాసంతో ఓవిధంగా వగర్చుతున్నాడు. ఆ స్థితిలో, ఆ జీర్ణవల్కలాల్లోని వ్యక్తిని చూసి, ఏమీ పరిచయం, సంబంధం లేని మనం చూపే సానుభూతికన్న ఎక్కువ సానుభూతి చూపింది. ఆ దీనవదనంలోంచి కారే కన్నీటిని మెల్లిగా అద్దింది. రెండు ఎత్తయిన పర్వతాలమధ్యని లోయల్లో ప్రవహించే నదుల్లా వున్నది ఆ పరితాపప్రవాహం!

మెల్లిగా "విశూ" కళ్లు తెరిచాడు. తనకే వినపడనంతటి హీనకంఠంతో "నేను నిన్న చాలాసార్లు పిలిచాను. నామాటలు నీకు వినపడవుకదూ?" అన్నాడు. నర్సు ఒక్కసారి షాక్ తిన్నదానిలా కంపించింది. ఆమె గుండెల్లో ఎవ్వరో బలంగా కదిలిస్తున్నట్లనిపించింది. ఆ విపరీతపరితాపంలో ఎలాగో "కాదు" అనగలిగింది.

"నిన్న చాలాసార్లు వూరికే పిలుస్తుంటా.. వూరికే"

"వూరికేనా?"

"నేను తూచి సమాధానంమాత్రం చెప్పలేని స్థితిలో వున్నాను. కాని నువ్వు నామాట వినాలని నేను అర్థించడంలేదు. తిరస్కరించడానికి సంపూర్ణ హక్కు వుంది. కాని నేనే నగకలేకుండా వున్నంత హృదయదౌర్బల్యస్థితిలో వున్నందుకు క్షమిస్తావని ఆశిస్తాను."

"నాకు తెలుసు, నీకూ తెలుసు. నేను చాలా కొద్దికాలంమాత్రమే జీవిస్తాను."

ఆమె ప్రాన్పడి వింటోంది. ఆ మెరిసే కళ్లు ఎప్పుడో తన్ను అతిసన్నిహితంగా పలకరించి, తన్ను, ఎలాగైతేనేం, విపరీతఉద్రేకంలో ఊపినాయ్!

"నాకు నీ దగ్గరికి రావటం ఇష్టం."

బలహీనంగా నవ్వాడు.

ఇద్దరూ మౌనంగా చూసుకున్నారు.

గడియారం గట్టిగా రెండుకొట్టి ఆ నిశ్శబ్దాన్ని చీల్చింది

"నేను పోతున్నా."

"ఎందుకు? ఎవరికోసం?"

"ఎంత అమాయకంగా అడుగుతాడు" అనుకొంది ఆమె. తనకోసమేనా నేనుందీ!!

"చూడు, నీలాంటివారిని చాలామందిని చూడాలి."

"చాలామంది ఉన్నారనుకుంటూ చూడ్డానికి; పొరపాటే."

"నీ కేం కావాలి చెప్పు?"

"ఇలా నన్ను చూస్తూ కూర్చో. నేను మహాకవి రాజాస్థానంలో నర్తకిని వర్ణించినట్లు ఊహాపథంలో వర్ణిస్తా. నువ్వు ఇక్కడికి రావాల్సినదానివి కావు. చూడు—నీ పేరేమిటో!—ఇలా నా వంక నింపాదిగా నవ్వుతూ చూడు! ఎక్కడినుంచీ వచ్చింది ఆకోమలత్వం? విను. నువ్వో గంధర్వకన్యవిసుమా!"

"అబ్బ, చాల్లే!"

"కాసేపు మాట్లాడబోకు. నన్ను మాట్లాడనీను. పగలంతా చెమటోడ్చి పున్నమరాత్రి చంద్రుణ్ణి చూసే కలలుకని, కష్టాన్ని మరిచే కార్మికవీరుణ్ణి నేను. నిజం చెప్పు: నువ్వు దేవతవా?"

"నన్నెందుకిలా వుడికిస్తావు? ఏమిటో, నీ ప్రతిమాటా నాలో ఇంత పరివర్తనాన్ని ఎందుకు తీసుకురావాలో నాకు తెలీదు. కాని తెలుసుకోవాలని చాలా ఆశగా వుంది."

"అవును. ఇద్దరం ఒక్కస్థితిలో వున్నాం."

"ఏదన్నా కథ చెప్పనా!"

"నాకు అది ఆనందాన్ని కాని, బాధనికాని ఉపశమిస్తుందనుకోను. మా అమ్మ కథలు చెప్పకపోతే ఏడ్చి ఏడ్చి నిద్రపోని రోజుల్ని చూసి చాలా ఆశ్చర్యపడుతుంటా. అవును. అప్పుడు చిన్నవాణ్ణి. కల్మషంలేని హృదయం. కల్పవృక్షంవంటి కన్నతల్లి! నువ్వేన్నా న్నా చెప్పు. తల్లికంటె ప్రపంచంలో మానవుడు ఆరాధించ

వలసిన దైవం లేదు. అందుట్లో ఓ భారత హైందవ స్త్రీ మాత్ర స్థితి ఎంత విషాదస్థితిలో వుందో నీకు తెలుసు."

"అవునా !"

నర్సు విషాదంగా నవ్వింది. "అయితే నువ్వేద చెప్పు."

"నేను చాలా చెప్పదలచుకొన్నాను. కాని ఏదీ ప్రయత్నపూర్వకంగా చెప్పటంలేదు. ఇది నీకో కథగా తోచినా ఇబ్బందిలేదు."

"ఎందుకూ ?"

"ఏమీ లేదు. కథలన్నీ జీవితప్రతిబింబాలే. ఇవ్వాళ నువ్వు చదువుతూ కథలని త్రోసిపుచ్చే వన్నీ ఒకప్పుడు జరిగినవే. చాలా కథలు ప్రపంచానికి తెలియకపోవచ్చు."

"అయితే చెప్పు. నాకు చాలా సంతోషం"

"చెప్పనా!" రోగి సంతృప్తిగా, హృదయపూర్వకంగా నవ్వాడు!

*　　*　　*　　*

"ఆ అరుపులు, ఆ కోలాహలం, పరిగెత్తడం పిచ్చి కేకలు—ఎవరూ ?" అన్నాడు విశు నింపాదిగా ప్రక్క మీద కూర్చుంటూ.

"ఇవ్వాళ క్రొత్తేమిటి ?"

"వచ్చినప్పటినుంచీ రోజూ సాయంకాలం ఈకిటికీలోంచి చూస్తున్నా. దూరంగా ఆ ముసలామె చుట్టూ పిల్లలు చేరి ఒకటే గోల. ఎవరామె? పాపం" జాలిగా నిట్టూర్చాడు.

"ఆమె..." మెల్లిగా అంది ఆమె. "అవును, ఆమె-నీకూ నాకూ ప్రపంచానికీ ఆమె ఉపయోగపడే స్థితిలో గాని, అర్థంచేసికొని సానుభూతిచూపే స్థితిలో గాని లేదు."

"ఆమె పిచ్చిదికదూ ?"

"ఆమెకి ఆనందం ఏదన్నా వుంటే ఇప్పుడే. ఎందుకంటే ప్రపంచం ఆవిడకి పిచ్చి లేదన్నంతకాలం ఆమెజీవితయాత్ర నరకయాత్ర అయింది. ఆవిణ్ని చూస్తే నీకు జాలివేయటంలేమూ ?"

"ఆ సంగతి నన్నడగబోకు. నాహృదయం మండిపోతూంది. గత విషాదస్మృతులు నన్ను కలిచివేస్తాయ్. ఎవరామాతృమూర్తి ?"

"ఎందుకు అదంతా !"

"ఎందుకో చెప్పలేను. ఒక సానుభూతిపరుడికి చెప్పటంలో నీ కేం అభ్యంతరం వుంటుందో ఊహించలేకున్నాను."

"ఆమె అంటే నాకు విశేషపరితాపం. రోజూ నాదగ్గరికి పొద్దున్నే వచ్చి పలకరించిపోయేది! కొన్నాళ్లు సాయంత్రంకూడా వస్తుండేది. ఆమెకు చెప్పకునేవారెవ్వరూ లేరు. జాలితలచి వాళ్లూ వీళ్లూ ఏమన్నాయిస్తే తింటుంది. ఏపంచనో పడుకొంటుంది."

"ఎవ్వరూ లేరా ఆమెకు ! నీతో ఏం మాట్లాడేది ?"

"ఓరోజు మా యింటికి తీసుకుపోయి ఎక్కడికీ తిరగక, యిక్కడే తింటూ పడుకోమన్నాను. రెండు రోజు లలా వుండి, మూడోరోజున మళ్లీ మామూలే. ఎక్కడికో లేచిపోయింది"

"నిన్నేం అడుగుతుంది రోజూ?"

"ఒక్కటే ప్రశ్న. దానికి విధి విరామం లేదు. బహుశా ఆమె జీవితపర్యంతరం అనుపడే ప్రతి సానుభూతిపరుడి కర్ణపుటాల్లోను భీకరంగా బాధగా ప్రతిధ్వనింపజేస్తూనేవుంటుంది. "మాఅబ్బాయి మీ కెక్కడైనా అగుపడ్డాడా? ఓసారి నాదగ్గరకి గమ్మని చెప్పండి. ఏం, చెబుతారు కదూ?" అంటుంది." విశూ ప్రబలంగా వణికిపోయాడు. అలాగే అంటుందామె :

"అందరూ విషాదంతో తలనంచుకుంటారు. ఆ త్యాగమూర్తిమాతృప్రేమకు ! 'ఏం, చెబుతారుకదూ?' అంటే ఏమంటారు చెప్పు ? ఎవరైనా!"

ఆమెకు నమ్మకం—ఎప్పుడన్నా, ఎవరన్నా, ఎక్కడన్నా తన కొడుకుసంగతి తెలియజేస్తారని ! ఆ నమ్మకంమీదే జీవించివుంది. ఆ ఉన్మాదమే ఆమెకు ఆనందం. లేకపోతే ఇన్నాళ్లు జీవించదేమో!

విశూ తువ్వాలుతో ముఖం కప్పుకున్నాడు.

"ఎందుకు అలా వెక్కి వెక్కి ఏడుస్తున్నావ్?"

"ఏమీ లేదు."

"ఏమీ లేదా ?"

"పోనీ, బాధ కల్గిస్తే చెప్పనులే."

"నామీద వొట్టు : నామనశ్శాంతి చెడగొట్టబోకు."

"మరి దుఃఖించబోక."

"కన్నీరు కారితే వచ్చిన నష్టం లేదు! అది బాధను ఉపశమింప జేస్తుందని నా నమ్మకం. మానసిక భావదర్పణమే కన్నీరు!"

* * * * *

"నర్సు...మా కోడలేదీ?"

"ఎవరో పిలుస్తున్నారు!"

"ఆఁ, ఆమె, ఒకసారి మాట్లాడి పంపించివస్తా" మెరుపుతీగలా నర్సు మాయమయింది. శూన్యంగా ఆమెఅడుగుజాడల్ని చూస్తూ గాఢంగా నిట్టూర్చాడు విశూ.

విశూ నర్సుకోసం ఆరోజు చాలాసేపు చూశాడు గాని ఆమెజాడ అగుపడలేదు. మర్నాడు మామూలుగా టెంపరేచర్ చూడ్డానికి వచ్చినప్పుడు చాలా ఆతృతతో అడిగాడు: "ఆమెవిషయం దయచేసి చెబుతారా? రాత్రంతా ప్రక్కంతా కన్నీటితో తడిసిపోయింది. నా మీద సానుభూతి ఈ విషయంలో చూపండి"

ఆమె ఈ విషయాన్ని గురించి అతడింత పట్టుబడతాడనుకోలేదు. మెల్లిగా తల పంకించి, తలుపు మూసి ఆమె మౌనంగా కూర్చుంది.

"నా గతించిపోయిన జీవితఘట్టాల్ని పునస్మరిస్తున్నాను. కొంతవరకు ఆత్మానందం నాకు లేకపోలేదు.

ఆమెజీవితం, నా జీవితం దృఢంగా పెనవేసుకోటానికి కారణం విచిత్రమైందే!

ఆమె అగర్భశ్రీమంతురాలు. తండ్రి మూడో పెళ్లి చేసుకున్న తర్వాత ఆమెనుగురించి శ్రద్ధతీసుకోలేదు. ఏదో పెళ్లి అయిందనిపించడానికి దారినపోయే ఓ దానయ్యకిచ్చి పెళ్లిచేశాడు.

సమర్థతకాని, నడవడికాని లేని ఆ భర్తచేతుల్లో ఆమె వేసారిపోయింది. అతను పోయినా, ఆమెజీవితాంతం తనవంతు సాధించడానికన్నట్లు ఒక కొడుకుని ప్రసాదించిపోయాడు.

స్త్రీ! అందుట్లో బీదరాలు! ఆ వయస్సులో, సంఘం అన్నివిధాలా లోపాలు కనిపెట్టాలని ప్రయత్నించే విషమసమయం—చచ్చిపోదామన్నా అడ్డొచ్చే రక్తసంబంధం...తన కొడుకు!/ఏం చేస్తుంది? కన్నవారింటి తాలూకూ సవతిఅన్నదమ్ములు తిరస్కరించి, నీచంగా మాట్లాడారు. తనవాడని చెప్పుకుందామన్న తండ్రికూడా ఆమెకు లేడు. నిశ్చింతగా చచ్చిపోయాడు.

ఆమె నాకు చాలాసార్లు చెప్పింది: తనకు జీవితంలో ఒకటే ఆశట! తన పిల్లవాడు పెద్దవాడయి, గౌరవనీయంగా సంపాదిస్తూ, గొప్పవాడని పేరు పొందితే, తను ఆనందబాష్పాలు రాలుస్తూ, మహారాణిలా జీవిస్తుందట. ఎప్ప ప్పినా తన కొడుకుని గురించే మాట్లాడుతుందట.

ఏ ఆశాసౌధాలు ఆమె ఊహాపథంలో నిర్మించుకుందో, వాటికోసమే ఆమె తన కున్న గౌరవాన్ని, శక్తిని, తనదని చెప్పుకున్న ప్రతిదానిని విసర్జించింది. గౌరవనీయమైన వంశం. ఆమె అన్నీ మరిచిపోయింది. పెద్ద మహారాజుల ఇళ్లల్లో ఆమె వంటపూటితనానికి కూడా వప్పుకొంది. ఎంత శ్రమపడినా, ఎంతమంది వేలుపెట్టి చూపినా ఆమె శాంతమూర్తియై నిలిచింది. తన పాపకు హృదయానికి హత్తుకుంటే అదే ఆమెకు స్వర్గసీమ! ఆ సీమలో ఓ మాతృదేవి-ప్రపంచాన్నెరుగని ఓ అమాయక ముగ్ధబాలుడు మాత్రమే గోచరిస్తారు ఆమెకు!

క్రమంగా కొడుకు బాల్యావస్థని సుఖకరంగానే ముగింపజేసింది. అతనూ కూడా బుద్ధిమంతుడు. సక్రమంగా పరీక్షలన్నీ నెగ్గుతూవచ్చాడు.

అతను పట్టభద్రుడైనతర్వాత న్యాయవాదవ్వాలనుకొంది ఆమె. అతనూ సమ్మతించాడు. సానుభూతి చూపే కొందరు గౌరవనీయుల సాయంతో, విద్యార్థివేతనాలతో అతను లాకాలేజిలో చేరాడు. అతికష్టంమీద కాలం గడుపుతూవుండేవాడు.

అతన్నిరోజూ చూస్తూండేదాన్ని. బీదవాడవటం చేత మేమంతా నివసించే సానివాడలోనే ఓ చిన్న గది అద్దెకు తీసుకొన్నాడు. అతనికి ఏ దురభ్యాసమూ, నేనెరిగున్నంతవరకు, అప్పట్లో లేదు. ఆజానుబాహువు, కండలుతిరిగిన శరీరం, నల్లటి ఉంగరాలజుట్టు, పరిశీలనగా చూసే నేత్రద్వయం—ఎంత బాగుండేవాడు! చెబుతుంటే ఇప్పటికీ నేను వివశనైపోతాను.

అతనితోటి చదివే సాటివిద్యార్థులంతా మా ఇళ్లకి వస్తూండేవారు. తల్లిదండ్రులు పంపే ధనాన్ని, వాళ్లకి తెలియకుండా, తమ ఆత్మల్ని వంచించుకుంటూ, వ్యభిచారాన్ని అణచలేని ఓ ప్రచండశక్తిగా నిరూపించడానికి ప్రయత్నించేవారు.

నా సంగతి వేరే చెప్పనక్కర్లేదు. ఈ పతిత భారతదేశంలో, దమ్మిడీల్లేని, నీరసించిన పిరికిపురుషుల కౌగిళ్ల వల్ల కృశించి, నశించిపోయింది నా శరీరం. నే నావృత్తిని హృదయపూర్వకంగా ఎన్నడూ వాంఛించ లేదు. మా కులపెద్దలు, సంఘపెద్దలు 'సాంప్రదాయం, అందుల్లో దోషం లే'దన్నారు. వారి బాధ తీర్చుకోవ డానికి 'కులవృత్తి' అనే గౌరవపదం చాలు అడ్డం పెట్టు కోడానికి. ఇప్పు డిక్కడ నా శీలాన్ని గురించి అతి శయోక్తులు చెప్పనవసరంలేదు. దానివల్ల నాకు కలిగే లాభం ఏమీ లేదుకనుక. మాతండ్రి, తల్లి, బంధువులు అంతా నిర్బంధించారు. తర్వాత చలనం, ఆనందం లేని నా శరీరంలో దురాశ, ప్రతీకారం పుట్టుకొచ్చాయి! ఈమగపురుషుల్లోకి విషం ఎక్కించి, వాళ్లని వంశపారం పర్యంగా నాశనం చెయ్యా లనుకున్నాను.

ఆకాలంలో నేను అందంలో పేరుమోసిన వేశ్యనని పేరుపొందాను. పట్టుదలతో నాప్రాపు పొంద టానికి కులవిచక్షత లేకుండా డబ్బుని చాలామంది విచ్చలవిడిగా వెదజల్లారు.

కాని, నావంకైనా నింపాదిగా చూడని అత నంటే నాకు చాలాకోపం. ఆ యువక ప్రవరాఖ్యు డంటే నాకు రోమాంచం కలుగుతుంది. ఆ నడకలో ప్రపంచాన్ని జయించగలననే ధైర్యం! ఎవ రావీరుడు!

ఓసారి మావీధిగుండా వస్తుంటే నా తమ్ముణ్ణి పంపించాను ఎలాగైనా ఆయ న్నిక్కడికి తీసుకొస్తే గొప్ప బహుమాన మిస్తానని. కనీసం పూరికేనన్నా వచ్చి, కాస్త పానీయం పుచ్చుకుపొండిఅని అన్నా చెప్పి తీసుకురమ్మన్నాను. మొదటిరోజు బిక్క మొహంతో వచ్చాడు వాడు.

మర్నాడు వాడికి క్రితంరోజల్లే చెప్పవలసిన కిటుకులన్నీ చెప్పి, తీసుకురాకపోతే తిరిగి ఇంటికి రావద్దని గట్టిగా మందలించాను.

ఆత్రుతగా మావాడు అతనితో మాట్లాడ్డం, ఆదీను. గుండెలు వేగంగా కొట్టుకుంటుంటే దేహం చల్లబడిపోయింది.

ఇద్దరూ చాలాసేపు మాట్లాడుకున్నారు.

గుండె గట్టిగా అదుముకుంటూ ఆవంక చూశాను. పర్వతరాజులాగా గంభీరంగా అతనూ, మేకపిల్లలాగా తమ్ముడూ మాఇంటివైపు వస్తున్నారు. నేను మెల్లిగా లోపలికి వెళ్లి అద్దంలో నాఅందాన్ని సవరించుకొని, కుర్చీలో కూర్చొని ఏదోపుస్తకం తిరగేస్తున్నాను.

అడుగుల చప్పుడు గాఢంగా వినిపిస్తోంటే లేచి "స్వాగతం, సుస్వాగతం, రండి" అన్నాను. కాళ్లు కడుక్కోటానికి సుగంధపు నీళ్లు అందించాను. అలంక రించివున్న ఆగదిలోకి ఆహ్వానించాను. అతను పరిశీ లనగానే చూస్తున్నాడు. ఆ గంభీరవదనం ఏమీ చలించలేదు. ఇద్దరం మౌనం వహించాం. ఆమౌనం నన్ను దహిస్తోంది! చాలాసేపటికి ప్రకంపించే కంఠంతో అన్నాడు—"ఇక్కడికి నే నెందుకు ఆహ్వానింప బడ్డానో నాకు సరిగా తెలీదు. కారణం కొంచెం చెబుతారా?" నే నాప్రశ్న, అంత నిర్దయగా, ఆ మార్దవకంఠంలోనుంచి వస్తుం దనుకోలేదు. నేను తల క్రిందకవలసివచ్చిన ఘటన అది!

మాట్లాడలేదు. అసలు మాట్లాడదలచుకోలేదు. అయినా ఏం మాట్లాడను! "నాలో ప్రత్యేకత ఏదన్నా మిమ్మల్ని ఆకర్షించిందేమోనన్న సంశయం నన్ను బాధిస్తోంది. నాకు ఎవరన్నా నాకు తెలియ కుండా విలువయిస్తుంటే నేను బాధ్యుణ్ణి కాదు."

"నేను చెప్పదలచుకొంది విపులీకరించడం మంచిది ఎందుకైనా! నన్ను మీ రేదృష్టితో చూస్తు న్నారో ఆదృష్టికి నేను బాధ్యుణ్ణి కాదు! అయినా మీ రీవిషయంలో బలహీనత కనపరిచినా అడ్డుపెట్ట డానికి నేను అర్హుణ్ణి కాదు."

నేను మౌనం వహించడంలో ఇంక అర్థంలే దనుకున్నాను. "నేనేదృష్టితో మిమ్మల్ని చూస్తున్నానో అ దేమంత, మీదృష్టిలోగాని, చాలామందిదృష్టిలో గాని గౌరవంకలది కాకపోవచ్చును. నాబలహీనతకు క్షమించినందుకు మీకు చాలా కృతజ్ఞురాల్ని."

అతను ఓసారి తలెత్తి చూశాడు పరిశీలనగా. ఆచూపులో ఆశ్చర్యం, సానుభూతీ స్పష్టంగా గోచ రించాయి.

"ఈమాత్రం వచ్చి నేను మిమ్మల్ని ఏమన్నా సంతృప్తిపరిచివుంటే తృప్తిపడతాను... నేను వెళ్లి పోదలచుకున్నాను"

నేను షాక్ తిన్న శరీరంలాగా బాధపడ్డాను. అయినా ఆత్మాభిమానంతోనే "మీరు వెళ్లిపోతానని దృఢంగా చెబుతున్నప్పుడు బలవంతపరిచి ప్రయోజనం లేదు. కాని నేనిచ్చే ఈ అల్పఅతిథిసత్కారాన్ని ఓ నూతనపరిచితుడిగా స్వీకరించాలని ప్రార్థిస్తాను."

నేను అర్పించిన మధురఫలాల్ని గాని, ఫలహా రాల్ని గాని, పానీయాల్ని గాని అతను ఏమీ ముట్టుకో లేదు. మంచినీళ్లుమాత్రం తాగాడు.

"నమస్తే. నాకిదే తృప్తి"

"నా ప్రార్థన ఒకటి మన్నించండి"—అతిదీనంగా వేడుకొన్నాను.

"ఏమిటి ?" అన్నాడు ఆత్రుతగా, ఆశ్చర్యంగా.

"మీకు తీరిక దొరికిన సమయాల్లో, ప్రపంచం బాధగా అగుపించిన సమయాల్లో, నాకు సాధ్యమైనంత సాయంచేస్తాను–దయచేసి స్వీకరించండి. మళ్లీ వస్తారు కదూ ?"...కాసేపు ఆలోచించాడు.

"దీంట్లో అభ్యంతరపెట్టాల్సింది నేనున్న పరిస్థితిలో ఏమీ లేదు. కాని ప్రపంచంలో అర్థించినా, అవస్థపడినా ఎవరూ నావంక చూడలేదు. కాని మీరు వాళ్లకంటే చాలా ఉత్తమోత్తములని నాఅభిప్రాయం. నమస్తే."

శరవేగంతో వెళ్లిపోయాడు. ఆ మెఱుపుతీగ! గట్టిగా వేడినిట్టూర్పు విడిచాను కొంత ఊహించుకున్న తృప్తితో!

* * *

"అతను వెళ్లిపోయాడు. ఆ నడకలో ఎంత రాజసం! ఎంతఠీవి" ఈ ఊహలతో తీవ్రంగా చాలా రోజులు వేసారిపోయాను. ఆ దివ్యలావణ్యమూర్తి నేను కలలుకనడానికేనా నా మనఃపథంలో మెరిసింది! ఎందుకు నా యౌవనం, నా రూపం, నా భాగ్య సంపదలు! సంతృప్తిలేని జీవితానికి ఇవన్నీ తృణప్రాయాలనుకున్నాను. తమ్ముణ్ణి చాలాసార్లు పంపించాను. వాడు కొన్నిసారు పోయీ, మరికొన్నిసార్లు పోయినా వని చెప్పి, మొత్తానికి ఒకటే కర్ణకఠోరమైన సమాధానం చెప్పేవాడు. అవును. నాలో వేదనని వాడు గురించుకోలేడు. అంతెందుకు, నేను ప్రేమించగలనని హృదయపూర్వకంగా ఎవ్వరూ నమ్మరు! నేను కాచుకుని కాచుకుని కళ్లు కాయలుకాచిపోయాయి. నారాజు రాడు! నేను విపరీతంగా పరితాపపడ్డాను. నేను వేశ్యను. నా మాట నమ్మరు. ప్రజలు గౌరవించే స్థితిలోకి నేను ఎదూ రానని తెలుసు. మళ్లీ ప్రజలే చాటుగా నన్ను అర్థించి, స్వార్థంగా, సత్యాదర్శానికి దూరమౌతారు.

నేను వేశ్యనవటానికి కారణం? అమ్మానాన్నా వాళ్లు నిర్బంధించబట్టేనా! వాళ్లు నిర్బంధించటానికి కారణం? దారిద్ర్యమా? శీలంకంటే దారిద్ర్యం ఎక్కువా? దారిద్ర్యాన్ని ముఖ్యకారణంగా భావించడానికి వీలులేదు. ఎంచేతంటే మేము కట్టుబట్టలకూ, తిండితిప్పలకూ తీసిపోయినవారం ఏ విధంగాచూసినా కాము! ఏమయినా అవనీ, నేను వేశ్యను! ఎందుకీతర్కం?, ఎందుకీబాధ, పరితాపం?? తీరని మనోవేదన!!! ఓ విధంగా చాలామంది హిందూస్త్రీలకంటే, భర్తలులేనివారికంటే చాలా స్వతంత్రంగానే వున్నాను. నన్ను ఎవ్వరూ శాసించటానికి వీలులేదు. నేను చాలామందిని తిరస్కరించగలను. బుజ్జగింపబడగలను. కాకపోతే, ముందుజన్మలో ఏమైనా గాని! కళ్లముందర నేను చూడని, అనుభవించని కష్టసుఖాల్లో, అందుట్లో చచ్చిపోయింతర్వాత, ఏమైనా ఫరవాలేదు!

నా ఆత్మసంతృప్తికోసం ఏదో సమాధానపరుచుకో ప్రయత్నించేదాన్ని"

"అతను రాలేదా ?" విశూ చాలా ఆత్రుతగా అడిగాడు.

ఆ ముసలివగ్ను కళ్లల్లోని లోతైన సముద్రాలు సగర్వంగా పొంగినాయి!

"రాకుండాపోలేదు. మా ఇద్దరికీ..."ఆమె ఛటుక్కున ఆగిపోయింది. చాలాసేపటికిగాని ఆమె తేరుకోలేదు.

"విను, ఏమైందనుకున్నావ్ ?" అంది విషాదంగా.

విశూ మహోన్నతుడైన గురుదేవుని పాదాల ముందు శిష్యుడు వినయంగా కూర్చున్నట్టు కూర్చున్నాడు. అలసట, అలుపు మరిచి అతనిలో అంత నమ్రత్వం ఎలా వచ్చిందో!

డాక్టరు కిటికీలోంచి చూశాడు ఇద్దర్నీ. రోగి ముఖంలో ఆయన చాలా మార్పు కనిపెట్టాడు. ఆ నిశ్శబ్దం మూర్తీభవించిన గదిలో వారిద్దరే ప్రపంచం ...కున్నట్లు కూర్చున్నారు పరవశత్వంలో!

కాసేపు చూసి డాక్టరు పరీక్షించకుండా పోయినాడు, తృప్తితో.

"నేను చాలా నిరాశ చేసుకున్నప్పుడు వసాడని ఎన్నడూ అనుకోనప్పుడు అతను ఆదరాబాదరాగా ఓ రాత్రి వచ్చి తలుపుగొట్టాడు. నేను మొదట ఎవరోననుకొని "ఇప్పుడు వీలులేదు."అని నిద్రమత్తులో అన్నాను విసుగ్గా.

కాని, ఆ గంభీరనినాదం నా మత్తును వదలగొట్టింది. నా స్వామి తన భక్తురాల్ని రక్షించడానికి

వచ్చాడు. నేను ఆశ్చర్యఆనందాలతో అతన్ని వేయి ప్రశ్నలడిగాను. మధురంగా స్వేచ్ఛాగానం చేశాను. ఎంత నిబ్బరం కనపరిచాడు! ఏమీ తొణకలేదు. మొత్తంమీద అతని ప్రవర్తన ఆశ్చర్యాన్నే కల్గించింది.

"నే నెందుకు ఇక్కడికి రావల్సివచ్చిందో అన్న విషయం చెప్పకోటాని కేమంత ఘనమయిందిమటుకు కాకపోవచ్చు"—నిట్టూర్చా డతను.

అర్థవిహీనంగా నాస్వామినేత్రాలలో చూశాను. నిశ్చల, నిరీహ, నిరీషనేత్రాలు!

"నేను నిన్ను సహ్యయుడనే విషయంలో సంతోషం కలిగించా ననుకోటంమాత్రం పొరపాటుకావచ్చు"

"ఏమిటో చెప్పండి"

"ఇప్పుడు నాపరిస్థితి నీకు కొంచెం చెప్పడం అవసరం. నే నో బీదవిద్యార్థిని. మా అమ్మ..." అతను ఆగిపోయాడు. గాఢవిషాదాచ్ఛాదితమైన అతని మొహంలో శోకపూరితస్వరూపం ఓనిమిషం నృత్యం చేసింది.

"అదంతా అనవసరం ప్రస్తుతం. నాకు డబ్బు కావాలి అవసరంగా"అన్నాడు

నా స్వామి కోరితే చాలు ఆలోచించడంకూడానా? వేటిని తృణప్రాయంగా చూసి నారాజును స్మరిస్తున్నానో, ఆ వినయశీలుడే వాటిని గౌరవించి, నన్ను తృణీకరిసున్నాడు!

నేను కారణం అడగదలచుకోలేదు. నాకు తెలియటం అనవసరం. అతనికి డబ్బు కావాలి. అంతే.

అల్మారా తీసి చూశాను. అప్పుడే పేరయ్యశెట్టి యిచ్చిన రెండు పచ్చకాకితాలు అగపడ్డాయి. మాట్లాడకుండా అతని జేబులో కుక్కాను.

"ఎందుకు ఇదంతా? నాకు యాభైరూపాయలు చాలు"అన్నాడు.

యిస్తే ఒట్టు"—గట్టిగా అతని చేతులు పట్టుకొని ప్రార్థించాను.

"నేను తిరిగీ వీటిని మీకు ఎప్పుడు ఇవ్వగలనో సరిగా చెప్పలేని స్థితిలో వున్నందుకు సిగ్గుపడుతున్నాను"

............

"మీరు నన్నెరుగరు. నేను హామీ యివ్వడానికి నాచదువుకునే పుస్తకాలున్నాయి. అవయినా ఎవరో వాడుకోటానికి యిచ్చారు"

"నాకు మీ రేమీ చెప్పకుండావుంటే బాధ కలిగించకుండావున్నవా రవుతారు. మీదగ్గరినుంచి తిరిగీ తీసుకుంటానన్నది కల్లోమాట. మిమ్మల్ని ఒక్క విషయం అర్థిస్తాను. మీకు సహాయం చేస్తూ బలవంతం చేస్తున్నా ననుకోబోకండి. అప్పుడప్పుడు నా కగపడుతుంటారుకదూ?"

"మీరు ఏ నమ్మకంమీద నాకిస్తున్నారో నాకు తెలీదు. కాని నేటికి జీవితంలో ఒక ఉత్తమోత్తమమైన జీవసాహచర్యం నాకు లభించినందుకు గర్విస్తున్నాను."

"ఈచీకటిలో ఎక్కడికి పోతారు? ఇక్కడ వుండరాదూ?" అన్నాను.

"నాకు పరీక్షరోజులు దగ్గరికొచ్చాయి, ఏవిధంగానూ ఇక్కడ వుండటానికి అవకాశం లేదు.

"వెళ్లి చదువుతారా?"

"అవును. మా అమ్మ చాలా కష్టపడి చదవమని చెప్పింది. మాఅమ్మని—ఆ ప్రేమమూర్తిని - లోకాలంతా నివ్వెరపోయి చూసే త్యాగాన్ని చూసి చాలాసేపు శ్రమిస్తాను."

"మీకోసం అంత త్యాగం చేసిందా మీఅమ్మ"

"ఆమెత్యాగాన్ని నేను నా కందినంతవరకూ వూహించుకుంటున్నాను. ఆమె నాకే కాదు. దరిద్రనారాయణుల కఠోర ఆక్రందనాలకి ఒక మూర్తీభవించిన స్వరూపం...నేను ఆరాధించే దేవత ఆ మాతృమూర్తి."

"ఎప్పుడైనా జ్ఞాపకమొస్తే నానమస్కారాలు అందజేస్తారా?"

"ఆఁ, తప్పకుండా"_అతను ఆలోచించాడు.

"దయచేసి అందజెయ్యబోకండి. పొరపాటున అన్నాను. నేను మాతృమూర్తిని కాను. కాలేనేమో! వేశ్యనికదూ? పోనీ, ఎవ్వరికీ తెలియకుండా ఆరాధించుకోనీయండి" సూటిగా, అసహాయంగా చూశాడు. ఇద్దరం శూన్యంగా నిశీథంలోకి చూశాం. మా మధ్య అగాధాలు!

"శ్రమకల్గించినందుకు క్షమించండి. శెలవు."

"వస్తారుకదూ?" గద్గదస్వరంతో అర్థించాను.

"తప్పకుండా. తప్పించుకోలేను" తొందరగా తలవంచుకొని అతను వెళ్లిపోయాడు. నన్ను నిరాశలో ముంచి నిశీథంలోకి పోయాడు."

ఆ ముసలినర్సు ఈ ప్రపంచంలోకి వచ్చి, తలెత్తి రోగిని చూసింది! ఒకటే అశ్రుధారలు కారుస్తున్నాడు. ఎంత సేపట్నుంచి ఏడుస్తున్నాడో-కళ్లు ఎఱ్ఱబడ్డాయి. ఆమె మెల్లిగా తువ్వాలుతో అద్దింది.

"చెప్పు, దయచేసి. నా ఆనందానికి అంతరాయం కలిగించబోకు"

"ఎందుకు ఏడుస్తున్నావ్ ?"

"నీవంత జాలిగుండెగలవాడి వనుకోలేదు. పోనీ, మానేస్తాలే. మరి ఏడవబోకు"

"నేను ఏడవను" విశూ ఏమీభావం వెలిబుచ్చని స్వరంతో అన్నాడు.

"నాకు చెబుతుండు. నా కది చాలు. అంతకంటే ఈ ప్రపంచంలో నేను కోరేదిగాని, ఘనమైందిగాని లేదు. దయచేసి చెప్పవూ ?"

ఆమె అతనికి పాలు యిచ్చింది. విశూ నిరాకరించాడు.

"రోగం తిరగబెడుతుంది. నా మాట విను"

"నేను జీవించాలని నాకు ఆశలేదు"

"నువ్వింత విరాగివని అనుకోలేదు ; అయినా బ్రతికున్నవారిలో చాలామంది జీవితసుఖం అనుభవిస్తామనిగాని, అనుభవించగలమనికాని బ్రతకటం లేదు."

"నేను పాలుత్రాగడం నీకు ఏ మాత్రమైనా సుఖంకలిగిస్తే నేను ఎందుకు అభ్యంతరపెట్టాలో నాకు తెలియదు."

విశూ అయిష్టంగానే తన శరీరానికి మేలు చేకూర్చాడు. తనలాంటివారు అంతటా వున్నా రనుకొన్నాడు. "దయచేసి చెప్పండి. నేను వింటూనే చచ్చిపోవాలని అనుకుంటున్నాను. చెప్పరూ ?"

ఆమె చకిత అయింది. ఎవ రీదుఃఖభాజనుడు ? ఇత నెవరో తనకు తెలీదు. గత పాతికసంవత్సరాల నాటి మా జీవితగాథను ఎందుకు చెప్పాలో, అత నెందుకు అంత ఆత్రుత కనపరుస్తున్నాడో తనకు అయోమయంగా వుంది. కాని ఎవ్వరూ సానుభూతిని చూపని ఈ అభాగ్యునిలాంటి జీవితం ఎవ్వరికీ, ఎప్పుడూ ఆ నిర్ణేత ప్రసాదించవద్దనే ఆమె ప్రార్థించింది.

"బహుశః నన్నుగురించి నువ్వు విచారిస్తావు' నువ్వే కాదు. నా రాజుకూడా కరిగిపోయాడు."

మళ్లీ ఓ రోజు రాత్రి వచ్చాడు. పెరిగిపోయిన గడ్డం,కృశించిన దేహం...ఆ మలినవస్త్రాల్లో,నల్లమబ్బుల్లోని శశిలా వున్నాడు నా ప్రభువు. ఇలా అన్నాడు. "ఆ వేళ డబ్బివ్వకపోతే ఏ దురంతం తలపెట్టేవాడినో తెలీదు. అయినా అమ్మ నాకు సాయం చేయలేక పోయింది. ఈ నెలవల్లో మీ దగ్గర నన్ను గుమస్తాగా నన్నా పెట్టుకోండి. నేను మీ అప్పు తీర్చంది ఎక్కడ పోదలచుకోలేదు."

అతన్ని చూస్తే విపరీతవిచారం వేసింది. మెల్లిగా మాటల్లో అతన్ని స్తిమితపరిచాను. భోజనం పెట్టి మంచి బట్ట లిచ్చాను. మెల్లిగా అన్నాను: "మీరు నాకు డబ్బివ్వకపోతే ఇక్కడ వుండరా

కొంచెం ఆలోచించి అన్నాడు: "వుండను."

నేను అతన్ని పోగొట్టదలచుకోలేదు.

"మిమ్మల్ని ఇక్కడ వుండమని కోరుతున్నాను' ఎలా భావించుకున్నా ఇబ్బంది లేదు."

అతను అంగీకరించాడు. అతనున్న ఆ రెండు నెలల్లో పరపురుషుణ్ని నా గుమ్మం తొక్కనీలేదు. చాలామందికి నాకు పెళ్లయిందని చెప్పాను. చాలా మంది ఎన్నివిధాలుగా అనుకున్నారో, అనుకుంటారో నే నిప్పుడు చెప్పటం అనవసరం. అప్రస్తుతం.

కాని అమ్మ, నాన్నా ఈ విషయంలో నాకు కలిగించిన వత్తిడి ఏ మాత్రం గౌరవం వున్న వ్యక్తిగాని సహించరానిది. అతన్ని చూసుకునే అన్నిటికీ అంగీకరించాను. నేను మీకు అణుపడాలంటే నా యిష్టానికి వ్యతిరేకు లవకండని మందలించాను. నాకు తమాయించుకున్నారు. ఎప్పుడైనా నావెఱ్ఱి తగ్గి మొదటి స్థితిలోకి రాగలనని వారినమ్మకం నన్ను వదలిపెడితే వారికి జీవనాధారంలేదు.

అతని స్నేహితుడు--మాయింటికి అప్పుడప్పుడు వస్తుండేవాడు——శంకర్. అతను నన్ను కాళ్లా వేళ్లా పడి అర్థించాడు. తన సాహచర్యాన్ని విరమింపజేయవద్దనీ, తను అగర్భశ్రీమంతుణ్ణనీ, నన్ను మహారాణిని చేస్తాననీ చాలా ఆశలు గొల్పాడు. అతని మాటలు

వింటుంటే అతనిమీదుండే అసహ్యం ద్విగుణీకృత మైంది.

శంకర్‌కు, నాకు సంబంధం విడిపోయినతర్వాత అతను మానాన్నతో ఏవో మంతనాలు చేయటం మొదలుపెట్టాడు."

విశూ అడిగాడు. "మీరు ప్రేమించిన వ్యక్తి పేరేమిటో చెబుతారూ ?"

ఆమె పెద్దగా నవ్వింది. "నే నెప్పుడూ అతని పేరడగలేదు. నాకు అతని పేరుతో అవసరం ఎప్పుడూ కనిపించలేదు. నాదగ్గరికి ఇదివరకు ఎంతోమంది వచ్చేవారు. వారు నాపేరునుగురించిగాని, నేను వారిపేరును గురించిగాని ఎప్పుడూ ప్రస్తావించుకోలేదు. నాకు తెలిసినంతవరకు శంకర్ "రావు" అంటుండేవాడు. శంకర్ అతనితో ఇదివరకన్నంటే ఎంతో అన్యోన్యంగా పూసుకుతిరుగుతుంటే నేను భయపడ్డాను. ఓవిధంగా రావు అమాయకుడు. నామీద ప్రతీకారంతో అతనిలో ఏ విషభావాలు ప్రవేశపెడతాడో అని శంకించేదాన్ని. కొద్దికాలంలోనే నాశంక నిజమయిందని రుజువయింది. రావు ఓరోజు చాలాకోపంగా నాదగ్గిరికి వచ్చాడు.

"చూడు. నే నిక్కడుండటం బాగుండ్లేదు. మా అమ్మ వ్రాసిన ఉజాబులు చూడు. వూరంతా నవ్వుకుంటున్నారట. ఆమెకు తలవంపుగా వుందట. "

నేను తలవంచుకుని నిల్చున్నాను.

"శంకర్ నేనేమో నీకు అడ్డుతగుల్తున్నానని చెప్పాడు. ఎవర్నీ బాధపెట్టడం నావంతు కాదు."

మెల్లిగా ఎవ్వరో తలుపుతట్టారు.

శంకర్ వచ్చాడు. ఆసమయంలో అతనంటే నాకు మండిపోయింది.

"శంకర్, దయచేసి నువ్విక్కణ్నుంచి వెళ్లు. నువ్వు నన్ను ఇంకెంతకాలం సాధిస్తావోచూస్తాను. నీచత్వంలో అధిగమించిపోయారు." ఇంతలోకే ప్రక్కగదినుంచీ ఇద్దరు వచ్చారు. అమ్మా, నాన్నా. "ఏమిటి ఎరిగున్న ఆ పెద్దమనిషిని అలా తూలనాడుతావ్ ? మాటా మంచీ ఏం అక్కర్లేదా ఏం ?" అంది అమ్మ.

"నువ్వు అడుక్కుతింటావంటే నే దిగులుపడను కాని మమ్మల్ని అడుక్కుతినేట్టు చేయబోకు" చురచురా 'రావు' వంక చూస్తూ "నువ్వే కారణం ఈ తుపానుకంతా !" అంటూ వెళ్లిపోయాడు. శంకర్ సగర్వంగా స్వగతంగా చాలా సంతోషించాడు.

"దౌడ్డుటావును ఎన్నాళ్లు గోకినా ఒకటే... నీ వెఱ్ఱిగాని" అంటూ నిష్క్రమించి పోయింది అమ్మ.

శంకర్ మెల్లిగా అన్నాడు: "రావు, నేను నీకు నీతులు చెప్పడానికి రాలేదు. నువ్వుండే పరిస్థితిని బట్టి, నువ్వు మీ అమ్మగారికి నెరవేర్చాల్సిన బాధ్యతను, గౌరవాన్ని బట్టి నువ్విక్కడనుంచీ ఎంతత్వరగా విడుదలైతే అంత మంచిదని చెప్పటానికి వచ్చాను." రావు చేతనా చేతనాలన్నీ పోయినవాడిలా నుంచున్నాడు. "క్షమించమని అడుగుతూ ఓ విషయం చెబుతున్నాను. మీ అమ్మగారికి శరీరస్వస్థత లేదని కర్ణాకర్ణిగా వింటున్నాను. బహుశః నువ్విక్కణ్నుంచి విడుదలవడానికి ఎటువంటి ఆటంకమూ వుండదు. ఎందుచేతంటే, నువ్వు డబ్బువిషయం విచారపడనవసరం లేదుకనుక. ఈ పర్సులో మూడువంద లున్నాయి. నీ యిష్టం" అంటూ పిల్లిలా వెళ్లిపోయినాడు. ఎంత ఆప్తమిత్రుడు...ఒకప్పుడు రావు అతిదీనంగా, పరీక్షరుసుంకోసం అర్థించినా చిల్లిగవ్వ ఇవ్వని నిర్భాగ్యుడు శంకర్ ! నన్ను వల్లో వేసుకోడానికి, అడ్డంకి తప్పించుకోడానికి మూడువందలు అనాయాచితంగా, సులభంగా ఇచ్చివేశాడు ! రావుమనస్సులో లోకాలు తిరిగిపోయినయి. పిచ్చివాడిలా పరిగెత్తాడు. ఎక్కడికో!

"రావ్, ఎక్కడికి ? వుండు. నా మాట విను."

అని ఆక్రందిస్తూ అరిచిన నా ఆర్తనాదానికి గదిలోని గోడలు ప్రతిధ్వనించాయి. పోయినాడు. "దౌడ్డుటావు" అన్న అమ్మమాట అతన్ని వేటాడుతుంటుంది ! "ఎక్కడికి పోయినాడు నా రావు? నా ఆశాజ్యోతి ఆరిపోయినట్లేనా ?" రెండురోజులు దిండులో తల దూర్చి కుమిలిపోయినాను. నా రావు రాడా ? నా రాజు లేడా ??

* * *

నేను నిశ్చయించుకున్నాను. కార్యసాధకుడు అయిందానికి విచారించడు. అతని దృష్టి ఎప్పుడూ భవిష్యత్తంతా కలయదిరుగుతుంది.

అప్రయత్నంగా గదిలో వ్రేలాడగట్టబడిన దివ్యరూపుడు వివేకానందుని చిత్తరువు చూశాను ప్రపంచాన్ని శాసించే గంభీరత, సత్యాదర్శను అతనిలో వుట్టిపడుతున్నాయి. ఎన్నోసార్లు ఆ దివ్యమూర్తి వంక చూశానుగాని ఎందుకో ఈసారి నాలో మహత్త

రమైన మార్పు తీసుకొచ్చాడు. ఆ మహనీయుడిలో ఎంత ప్రశాంతత !

తమ్ముణ్ణి లేపి ఆయన వూర్లో వున్నారో లేరో కనుక్కురమ్మని పంపాను. మాట్లాడలేని స్థితిలో వున్నాడనీ, తనతో ఏం మాట్లాడక, అర్థంకాని చూపులతో వింతగా చూశాడనీ చెప్పాడు.

గుండెల్లో తుపానులు చెలరేగాయి. శరవేగంతో డాక్టర్ని పిల్చుకొని వెళ్ళాను ఆగదికి. మెల్లిగా లోపలికి వెళ్లి అతన్ని మృదువుగా స్పృశించాను.

"ఎందుకొచ్చావ్ శక్తీ?"

"ఇప్పుడు నన్నడక్కండి."

డాక్టరు అతనితో నన్ను మాట్లాడకద్దని సంజ్ఞ చేసి, జాగ్రత్తగా పరీక్షించి, చేయవలసిన సదుపాయాలన్నీ చెప్పి మందిచ్చి వెళ్ళిపోయాడు.

వారంరోజులైంతర్వాత మామూలుస్థితిలోకి రాగలిగాడు. ఓరోజున అడిగాడు "డాక్టరుకి డబ్బు ఎవరిచ్చారు ?"

"మిమ్మల్ని చూసి జాలిదలచి డబ్బు అడగలేదు" అన్నా ఏమంటాడో నని !

"నన్నుగూర్చి ఎవ్వరూ జాలిపడమని కోరను. నన్ను పరిహారంగా ఆయన అమ్ముకున్నా సంతోషిస్తాగాని" అతను కోపంతో అన్నాడు.

"మరేమీ అనుకోబోకండి. నా చంద్రహారాన్ని అమ్మాను." అతను అసహాయంగా, సిగ్గుతో తలవంచుకున్నాడు. బీదరికంలో వున్నందుకు ఎవరన్నా అవమానపడుతుంటే "రావు" మొదటివాడనే అంటాను. ఇద్దరం ఆగదిలోనే వుంటున్నా మని చెప్పాలి. ఎవరన్నా ఒకరు ఆర్జించనిది కాలం వెళ్ళదు.

"మనం వుండటానికి డబ్బు లేదు. ఎల జీవించడం?" అన్నాడు భోజనం చేస్తూ ఓరాత్రి. ఒక్కసారి మనస్సు ప్రకంపించింది.

"మీకు తెలుసు నేనిదివరకు ఎలా సంపాయిస్తున్నానో. మీ అభ్యంతరం లేకపోతే మనకోసం ఏమన్నా చేయడానికి సిద్ధపడుతున్నాను." రావు వణికిపోయాడు.

"నేను నిన్ను ఈ విషయంలో శాసించే స్థితిలో మాత్రం లేను. అయినా ఓహృదయపూర్వక సన్నిహితుడిగా, శ్రేయోభిలాషిగా ఒక్క విషయం ప్రార్థిస్తాను. మీరు ఆవృత్తి దయచేసి మానేయరూ ?"

అన్నాడు. గంభీరంగా అన్నాడు. "ఈ భాగ్యవంతులంతా పిరికి వాళ్లు. ఏమీ పని చేయకుండా, పని చేసి కృశించే అభాగ్యుల ధనాన్ని, అన్యాయమనన్నా లేకుండా హాయిగా అనుభవిస్తున్నారు."

నాస్వామికి మనస్సులో నానమస్సుల్ని అర్పించుకున్నాను. అప్పటినుంచి 'రావు' విధివిరామం లేకుండా ఉద్యోగంకోసం అన్వేషించడం మొదలుపెట్టాడు. కార్యసాధనకోసం ఎంత కష్టాన్నయినా లెఖ్ఖచెయ్యడు.

చాలావిచారంతో కూర్చున్న అతన్ని ఓరోజు అడిగాను: "మీ కెక్కడా వుద్యోగం దొరకలేదా ?" పెద్దగా నవ్వాడు.

"వుద్యోగం చెయ్యడానికి సమర్థతని, విజ్ఞానాన్ని చూస్తే ప్రపంచం ఇట్లా వుండదు."

"ఏమయింది ?"

"నాసర్టిఫికెట్లని, యోగ్యతాపత్రాలన్నిటిని సరిగా ఎవ్వరూ చూడలేదు. నేనో అనామకుణ్ణి నన్ను చూడ్డానికికూడా ఎవ్వరూ రమ్మనలేదు. భాగ్యవంతుడు సాటివాడికే ఎప్పుడూ ఇచ్చుకుంటాడు. రానురాను వాళ్ళు ధనవంతులయి ఈ ప్రపంచాన్ని ఓ మధురకలగా భావించుతారు. మనం ఇలా కృంగిపోవలసిందేనా క్రమక్రమేణ?"

"పోనీ, మీ కభ్యంతరం లేకపోతే నేను..." దుఃఖంతో మాట్లాడలేకపోయినాను. మృదువుగా ఆ పొడుగాటి వేళ్లతో నా కురుల్ని సరిదిద్దాడు. "నేను ఆత్మాభిమానంవిషయంలో బీదవాణ్ణికాదు. జ్ఞాపకముంచుకో. ప్రపంచం తాత్కాలికంగా దుష్టుల్ని గౌరవించినట్లగపడొచ్చు. సత్యాదర్శంకోసం ఎదురీదు తాను ఏమైనాగాని దొంగ పట్టుబడనంతకాలం ఆపని అభినందించవలసింది కాదేమో !"

"దొంగతనం చేయడానికి ముఖ్యకారణమేమిటి మన దేశంలో ?"

"అవును. ఉచితానుచితాలకీ, మంచి చెడ్డలకీ చాలా భేదం వుంది"

"నేను వుండబట్టి మీపరపతి చాలా చెడిపోయింది. నేను వదలిపెట్టడం నాకు ఏం కలిగిస్తుందో నాకు వదలిపెట్టండి. మీకన్నా జీవితం సాఫీగా నడుసుందని."

"వద్దు శశీ. ఎక్కడికన్నా మన్నెరుగని చోటికి లేచిపోదాం" నన్ను దగ్గరికి తీసుకొని గుండెలకి గట్టిగా అదుముకున్నాడు. అస్పష్టస్వరంతో— "ఒక కొరత జీవితంలో శాశ్వతంగా తీరిందని భావిస్తాను"అన్నాడు. ఒక్కక్షణం బాధల్ని, సాంఘిక గౌరవాన్ని, ప్రపంచాన్నీ మరిచాం. కష్టాలు కానని లోకంలో స్వేచ్ఛావిహంగాలం మేం. కడుపులో ఆకలి బాధిస్తున్నా—నాకు బాగా జ్ఞాపకం—మేం ఆ పరవశత్వంలో కరిగిపోయినాం.

ఎంత సేపయిందో తెలీదు. ఎవరో గట్టిగా అతని పేరు పిలుస్తూ తలుపు తట్టుతుంటే నేను మెల్లిగా లేచాను.

రావు ఆ స్వరాన్ని పోల్చుకున్నాడు. అతని ముఖం పాలిపోయింది.

అతను తలుపు తీశాడు. శంకర్ మొదట వచ్చాడు. తర్వాత మెల్లిగా శశి అమ్మా, నాన్నా. తర్వాత ఓ పెద్దమనిషి. అందరికంటే చివర ఓ శోకమూర్తి—రావు తల్లి వచ్చారు.

రావు వినయంగా అందరికీ నమస్కరించాడు. అమ్మపాదాల్ని స్పృశిస్తే ఆ తల్లి ప్రేమ పొంగిపోయింది. తన కొడుకుని, తన రక్తాన్ని గట్టిగా కౌగలించుకొంది. ఎన్నాళ్లయిందో చూసి! ఇద్దరూ చాలాసేపు అశ్రుధారలు కారుస్తూ అలాగే వుండిపోయారు. శంకర్ చూపుల్లో విషముంది. కాని, ఆస్నిగ్ధమాతృమూర్తి అశ్రుధారల్లో కరిగిపోయినాడు.

వీరంతా ఇలా పనిగట్టుకొని రావడమేమిటి? శంకర్ అన్నాడు—"నే నిక్కడకు వచ్చి మిమ్మల్ని భంగపరిచినందుకు క్షమించండి. వీళ్ళకు దోవచూపడానికి మాత్రమే వచ్చాను. నమస్తే." అతను వెళ్ళిపోయాడు. పిల్లిలా పారిపోయాడు.

నే నీ ప్రతిఘటించే సముద్రాలని ఎదుర్కొనే స్థితిలో లేను. నామాట వారు నమ్మరు! మా నాన్న అన్నాడు— "నువ్వు మాకేగాక ఒక తల్లిని, కొడుకుని వేరుచెయ్యడంలో ప్రముఖపాత్ర వహిస్తున్నావ్?"

అమ్మ అంది: "నీ కిక్కడ వుండటానికి ఒక్క క్షణమున్నా స్థానం లేదు. నీ అభివృద్ధిని నువ్వు నిరోధించుకోవటం చూస్తూ ఎన్నాళ్ళు వూరుకోగలం!"

ఆ వచ్చిన పెద్ద మనిషి అన్నాడు: "అమ్మాయీ, న వ్వెవరివో నాకు తెలియదు. కాని ఓవిధంగా కల్పించుకున్నందుకు ఏమీ అనుకోబోకు. మీరు ప్రేమంటే ఏమో తెలియని అజ్ఞానవయస్సులో వున్నారు"

రావు తలెత్తాడు ఏదో చెబుదామని.

"అమ్మా, నిన్ను గురించి మాకందరికీ విచారంగా వుంది. నువ్వు ఎవ్వరి సాహచర్యం చేస్తున్నావో, అందులో ఎటువంటి పరిస్థితుల్లో మా అబ్బాయితో నేస్తం నెరిపావో అదిమాత్రం ఎన్నటికీ సిద్ధించరాదనే మీ ఉభయుల శ్రేయస్సుకోరి చెబుతున్నాను."

నేను ఈ ములుకులవంటి మాటల ధాటికి తాళుకోలేకపోయినాను. రావుజీవితం నా సాహచర్యంవల్ల ఏమీ బాగుపడే అవకాశం నాకు గోచరించలేదు. ఎందు కింతమందికి అసంతృప్తి? అందరికీ తిరిగి నమస్కరించి, రావువంక "క్షమించమన్నట్లు" చూసి వెళ్ళిపోయాను. నేను వస్తే చాలనుకున్న అమ్మా, నాన్నా వెంటనే నన్ను బండిలో తీసుకెళ్ళారు. కాని రావు ఎలా వున్నా డనుకున్నావ్? దీనాతిదీనమైన, ప్రాధేయ పూర్వకమైన చూపు చూశాడు. గొంతు సవరించుకొని ఏదో చెప్పబోయాడు. కాని ఏం మాట్లాడలేకపోవటం ప్రత్యక్షంగా చూశాను.

"అమ్మా" అంటూ కూలబడిపోయినాడు.

తర్వాత నాకు తెలిసింది"ఆమె ఆగింది అతన్ని చూస్తూ. విశూ అతిప్రయత్నంమీద తేరుకున్నాడు. ఘోరంగా దగ్గుతూ తొట్టిలో వుమ్మేశాడు. దాంతో పాటు చాలారక్తంకూడా పడింది. ఆమె చాలా భయపడింది.

"డాక్టర్, డాక్టర్" అంటూ వెళ్ళే ఆమెను బలవంతగా ఆపాడు. "నేను కొన్ని గంటలు జీవించాలంటే డాక్టర్ని పిలవద్దు. నన్నెవ్వ రేం చెయ్యలేరు! కనీసం నాప్రక్కని కూచొని అతని జీవితగాథని చెప్పు. నీ ప్రేమకు నేనేం ఋణం తీర్చుకోగలను కనుక!"

"ఎందుకు అంత ఆత్రుత అతని గతించిన జీవితం మీద?"

"నా జీవితచరిత్ర అడుగబోకు. ఓ విధంగా మా ఇద్దరి జీవితాలూ ఒకటే. అందుకే అంత ఆత్రుత" అన్నాడు విశూ.

"అవును. చాలామంది జీవితాలు విచిత్రంగా ఏకీభవిస్తుంటాయ్."

అతను కన్నుల నీరు నించుకున్నాడు. గత జీవితచరిత్ర ఆ కన్నీటిలో అతను చూశాడు!

"విను. అతనిపై నాకు మమకారం పోదు. రోజూ మా వీధిని పోతుంటే చూసి సంతోషించేదాన్ని. తమ్ముణ్ణి అతని యోగక్షేమాలు కనుక్కురమ్మని ఎప్పుడూ పంపుతుండేదాన్ని.

తల్లి అతనికి నీతినిగురించి, సాంఘికమర్యాదను గురించి చాలా చెప్పిందట. ఆ వచ్చిన పెద్దమనిషి చాలా శ్రీమంతుడట. జాలితలచి చదువు పూర్తయేవరకూ వూరికే సాయం చేస్తానన్నాడట. ఇది ఒకవిధంగా నిజంగా జరిగిందనే చెప్పవచ్చు కొంతకాలం.

ఎందుకంటే, రావు నిజంగా మారిపోయాడు. దుస్తులు, అన్నీ మారిపోయాయి. ఆ అమాయికముఖ లావణ్యం ఏం చీకట్లో దాచాడో! తమ్ముడు అగుపడి నప్పుడల్లా డబ్బు యిచ్చేవాడు.

ఓ రోజు తమ్ముడు చెప్పాడు: "అక్కాయ్, నీ కిదిగో డబ్బు ఇవ్వాలిట. ఇదిగో ఆయనిచ్చిన పర్సు" అని యిచ్చాడు.

నాకు ఆశ్చర్యం కలిగింది. నన్నవమానపరచ డానికేగా ఇది ఇవ్వటం! ఆ డబ్బును కోపంతో అవతల పారేశాను.

ఇంకోరోజు వాడు ఆత్రుతగా వచ్చి అన్నాడు: "ఏం చెప్పను అక్కయ్యా! ఆయన ఎలా తాగుతున్నా డనుకున్నావ్! నేను వెళ్లితే నాకు యివ్వటానికి వచ్చాడు. 'ఎంతో ఆనంద మిస్తుందట' అంటూ రాయన. గదిలో శంకర్, ఆయన, ఇద్దరు రూపవతులైన స్త్రీలు...ఏం చెప్పను?" అన్నాడు.

నేను నమ్మలేదు. ఇలా మారిపోతాడని నే నెన్నడూ అనుకోలేదు. నా సాహచర్యం నశించినందుకు ఉన్నతస్థితిలోకి వస్తా డనుకున్నా గాని ఇలా వినాశకరమైన పంథా ననుసరిస్తా డనుకోలేదు. ఆ రాత్రే బయలుదేరి అతని బసకు పోదలచుకున్నాను, ప్రచ్ఛన్నంగా. క్రిందికి పోయినప్పుడు శంకర్, నాన్నా మాట్లాడుతున్నారు.

శంకర్ అంటున్నాడు: "పిచ్చిపిల్ల! సన్యాసీ సన్యాసీ రాసుకుంటే బూడిద రాల కేం చేస్తుంది?"

నాన్న అన్నాడు: "ఇదిగో, శంకర్ నీ కోసం వచ్చారు."

ఆ కోపంలో మాట్లాడలేకపోయినాను.

"నువ్వు పిచ్చిదానవని ఋజువుచేస్తాను. ఎందుకంటే ఒక త్రాగుబోతుని, ఓ వ్యభిచారిని అత్యంత ఘనునిగా ఎంచి వలిచావు. అలాంటప్పుడు నే నెందుకు అతనికంటే తీసిపోయానో అర్థంకావటంలేదు."

నేను రివ్వున వెళ్లిపోయాను. నన్ను అతను అనుసరిస్తాడనే పరిజ్ఞానం లేకుండా.

"రావూ" గదితలుపు తోసి లోపలికి వెళ్లాను.

గది అంతా పరిమళద్రవ్యాల్తో నిండివుంది. బాగా తాగాడేమో - సరిగా గుర్తుపట్టే పరిజ్ఞానం పోయిం దతనికి.

"రావూ, ఇటూ చూడు" అన్నా.

"ఎవరూ?" అన్నాడు.

"నేను" అన్నా ముసుగు తీసి.

"ఎందుకొచ్చావ్?" అన్నాడు.

అలాంటప్పుడు ఏం చెప్పను?

"చూడు. మీ అమ్మగారికి, పోషించే ఆ దాతకి ఎంత అన్యాయం చేస్తున్నావో!" అన్నాను.

"న్యాయాన్యాయాల సంగతి నా కనవసరం. నీ కిక్కడ స్థానంలేదని తేల్చబడిందికదూ? పోరాదూ? నీకైనా మంచిది" అన్నాడు.

అతని కెంత చెప్పినా అర్థంకా దిప్పుడనుకొని వచ్చేస్తుంటే శంకర్ యమభటుడిలా తారసిల్లాడు.

"నేను నిన్ను గమనిస్తున్నాను. నేను నిన్ను, రావుని నాశనం చెయ్యగలను. ఈ సంగతి అతనికి సాయంచేసే దాతకి చెబితే ఏమవుతుందో వూహించు" అన్నాడు.

"ఏం చేస్తావు?" అన్నా ప్రజ్వరిల్లుతూ.

"నామాట విను."

"ఏమిటీ, న న్నెన్నాళ్లు సాధించదలచుకొన్నావు?"

"నువ్వు సౌందర్యదేవతవి. అసలు నాకోసమే పుట్టావని నానమ్మకం. చూడు, మన స్నేహాన్ని ఎందుకు బూడిదపాలు చేస్తావు?" అంటూ దగ్గిరికి రాబోయాడు.

"ఛీ, నీచుడా! నిన్ను దేనితో పోల్చాలో తెలీదు. నే నెవరిననుకుంటున్నావ్. స్త్రీ శక్తిస్వరూపిణి! దగ్గిరికి వచ్చావంటే నిన్ను చీల్చేస్తాను. నీతో నేస్తంకంటే కుక్కతో నయం" గట్టిగా గర్జించాను.

"నువ్వెన్ని చెప్పినా వినపడవు నాకు. నీస్వరమే నాకు సంగీతం" నామీద పడ్డాడు. బలవంతంగా పెనుగులాడి, పెద్దగా అరిచాను. దూరాన్న ఎవర్నో చూసి "చూడు నాతడాఖా చూపిస్తా" అంటూ ఆ నిశీథంలో కలిసిపోయాడు.

శంకర్‌ది పాముపగ. తనకు లాభం లేకపోయినా ఒకళ్ళు నష్టపడితే సంతృప్తిపడే తరగతికి చెందినవాడు.

రావు జీవితానికి శాశ్వతవినాశం చేకూర్చాడు. ఆపోషించే పెద్దమనిషికి ఏ కల్లబొల్లివిషయాలు వ్రాశాడో కాని ఆయన సాయంచెయ్యటం మానేశాడు. పరీక్షలు దగ్గరికికూడా వచ్చాయి.

అదే చివ్వరిసారి అతన్ని చూడటానికి వెళ్ళటం పుస్తకాలు, గుడ్డలు, అన్నీ చిందరవందరగా పడిపోయినయి. తుపాను చెలరేగినట్లుంది గదిలో. గదిలో రెండు జాబులు వున్నయి. చూశాను తడిసిన ఆ లేఖల్ని!

ఒకటి: సాయం చెయ్యడంవల్ల ధనాన్ని దుర్వినియోగంచేస్తున్నట్లు తను భావించడంవల్ల విరమించడమైందని ఆ దాత వ్రాశాడు. రెండోది అన్నిటికన్నా ఘోరమయింది. ఒక ప్రచ్ఛన్నుడని సంతకంవుంది. అందుట్లో ఎఱ్ఱసిరాతో వ్రాయబడిన వాక్యాలు ఘోరాతిఘోరమయినవి. "మీ కీవిషయం చెప్పడానికి చాలా చాలా ఆలోచించాను. విచారపడుతున్నానుకూడా. ఎందుకంటే వ్యభిచారార్జితమైన విత్తానికి మీరు విలువనివ్వరని నాకు తెలుసు. మీకు సాయంచేసిన పెద్దమనిషి వ్యభిచారనీ, మోసకాడనీ తెలియకపోవడం చాలా దురదృష్టం. ఆయన వూరికే ఎందుకు డబ్బు పంపుతున్నాడో ఆలోచించారా? సంగతేమంటే - మీ అమ్మగారికీ, ఆయనకీ సంబంధం వున్నదని చాలా పుకారుగా వుంది. మీకు ప్రత్యక్షంగా ఈవిషయాన్ని ఋజువుపరచడాకి తగిన ఆధారాల్ని సేకరించాను. ఇంతకంటే ఎక్కువ చెప్పడం అనవసరం."

ఎవరీద్రోహి? ఏ మనుకుంటాడు రావ్? దస్తూరీని పరిశీలించి చూశాను. శంకర్! అవును, శంకరే వ్రాసేడు. గుండె పగిలి చచ్చిపోలేదుకదా నారాజు?" అని చుట్టూరా కలయజూశాను.

ఇంటికి పోయేటప్పటికి తమ్ముడు ఎదురొచ్చాడు. నాలో ఒక్కొక్కసారి ఉద్రేకం పొంగిపోయింది. వాడితో చెప్పాను, శంకర్ చేసిన...గట్టిగా అనుమానమున్న ఈ అవినీతి—నీచాతినీచమైన కార్యాన్ని.

శంకర్ ద్రోహి. అతని కంట్లో విషం వుంది. శిక్షాస్మృతిలో ఇతనికి శిక్ష వుంటుందా?

"శంకర్ వారంరోజుల్నించి నా కనుపట్లేదు. ఒకసారి రావుగారే చెప్పారు వూరికెళ్ళాడని" అన్నాడు.

విధిలేక వాడూ, నేనూ ఈమహాపట్నంలోని వీథివీథినీ, వాడవాడని తిరిగాం రావుకోసం! ఎక్కడా జాడలేదు.

అతను నమ్మివుంటాడు? అందుట్లో ప్రపంచంలోని మాయలు వూహించని అమాయకస్థితిలోనే వున్నాడతను.

అవును. ఆమెకు భర్త లేడు! హిందూవితంతువు! కామవాంఛాపరుడైన పురుషుడు! వూరికే సాయం ఈర్ష్యవున్న ప్రతివాడూ లోపాల్ని కనిపెట్టే విషమసమయం!

*   *   *   *   *

నేను దుఃఖాంబుధిలో మునిగిపోయినాను. ఈ మానవప్రపంచంలో నేను విహరిస్తానను కోలేదు. కాని ఒక్కటే ప్రతీకారంకోసమే జీవించివున్నాను. శంకర్! అత నగుపడితే పొడిచి పొడిచి, చీల్చి చీల్చి చంపేస్తాను! ఒక జీవితాన్ని నిర్దయగా నలిపివేశాడు. రావు పరీక్షల సమయంలో జరిగిందీ విషాద ఘటన! అమ్మా, నాన్నల బలవంతంమీద నాలుగు మెతుకులు తినడం! ఓవిధంగా నామమాత్రంగానే జీవిస్తున్నాను.

పదేళ్ళు నెమ్మదిగా దొర్లాయి. మళ్ళీ ఎప్పుడన్నా శంకర్ నాదగ్గరికి వస్తాడనుకున్నానా?

ఓనాడు హఠాత్తుగా శంకర్ సరాసరి నాగదిలోకి వచ్చి కాళ్ళుపట్టుకొని వెక్కివెక్కి ఏడవటం మొదలుపెట్టాడు. నేను మొదట అతన్ని గుర్తించలేదు. ఆ పెరిగిన గడ్డం! అంతా విరక్తిజెందినవాడిలా వున్నాడు.

"ఎవరూ? శంకర్" అన్నాను లేస్తూ.

చాలాసేపు విలపిస్తూ అతను మాట్లాడలేకపోయాడు.

"నన్ను క్షమించమని అడగను. నువ్వు విధించబోయే శిక్షను విని, అనుభవించడానికి వచ్చా" నన్నాడు.

నేను మాట్లాడలేదు.

"నాకు నిజంగా రావు శిక్షవిధించవలసినవాడు. కాని అతన్ని గురించి నా కేమీ తెలీదు." అన్నాడు.

నే నాస్థితిలో అతన్ని నిందించదలచుకోలేదు. అసలే నడుంవిరిగిన పాము! "నీకతన్ని గురించి తెలిస్తే ఏమన్నా చెప్పు. ఎల్లాగయినా రక్షిద్దాం"

"నేను రెండు సంవత్సరాలు అతన్ని జాడతీసే ప్రయత్నంలో తిరిగాను"

"ఎక్కడున్నావ్ ఇన్నాళ్ళూ?"

"రెండేళ్ళు ప్రచ్ఛన్నంగా దాక్కున్నాను. నామీద ఘోరనేరం వస్తుందేమోననుకుని. అలాంటిదేమీ అగుపళ్ళేదు. తర్వాత నాగుండెల్లో ఏదో బరువుగా బాధించడం మొదలుపెట్టింది. నేను చేసిన ఘోరాన్ని గూర్చి ఆలోచించుకున్నాను. రావుని వెతకాలి. అతన్ని వెదికి నాసొంతసోదరునిగా చూసుకొని ఆ తల్లికొడుకుల జీవితాలకి ఆత్మశాంతి చేకూర్చాలి. నా ఆస్తి అంతా అన్నా విసర్జించదలచుకున్నా సంతోషంగా. కాని రావుజాడ తెలీలేదు. అతనికి పిచ్చెక్కిందని కర్ణాకర్ణిగా అన్నారు. హిమాలయాలకు పోయాడని అంటే అక్కడికి పోయాను. ప్రభుత్వం మీద విప్లవంజరిపే యువకవీరులతో తిరుగుతున్నారన్నారు. అసలు జీవించాడా? నాకు నమ్మకంలేదు.

ఇద్దరం విషాదంగా చాలాసేపు మౌనముద్ర వహించాం. చివరికి అత నన్నాడు: "నాజీవితాన్ని ప్రజాసేవకోసం అంకితం చెయ్యదలచుకొన్నాను. అందుకే ఆనాడే న్యాయవాదవృత్తికి తిలోదకాలిచ్చి బొంబాయి వైద్యకళాశాలలో చేరి పట్టభద్రుణ్ణయి వచ్చాను."

"నువ్విప్పుడు వైద్యుడివన్నమాట?"

"అవును. ఒకందుకు నువ్వీవిషయంలో సాయం చెయ్యాలి"

నేను మాట్లాడలేదు.

"నాఆస్తి సగం అమ్మదలిచాను. మనిద్దరి ఆత్మశాంతికోసం ధర్మవైద్యశాల నిర్మింపదలిచాను. రావు స్మారకభవనమని పేరుపెడదాం. మానవసేవతో అంతమవుదాం"

నేను బాగా ఆలోచించాను.

"ఇంతకంటే నేను ఏం చెయ్యాలో తోచడం లేదు. నాకు సమ్మతమే"

శంకర్‌కళ్ళల్లో ఆనందజ్యోత్స్నలు వెల్లివిరిశాయి.

"రావు అమ్మ ఎక్కడుంది?" అన్నాడు.

"ఊళ్ళోనే పిచ్చిగా తిరుగుతుందని విన్నా"

"ఆమెను యావజ్జీవితం పోషించే భారం నామీద వుంది"

ఇద్దరం అంగీకరించి "ఆమెను" ప్రార్థించాం.

కాని ఆమెకు అర్థంకాదు. "నే నిలాగా వుంటాను. తింటాను. తిరుగుతాను. మా అబ్బాయి ఎక్కడున్నాడో వెతుక్కోవద్దూ" అంటుంది. ఎన్నిసార్లు చెప్పినా వినలేదు.

ఇద్దరం అప్పటినుంచీ ఈ వైద్యశాలని స్థాపించి పనిచేస్తున్నాం. నిన్న పరీక్షించాడే అతనే డాక్టర్ శంకర్.

ఆ మాతృమూర్తి రోజూ వచ్చి మమ్మల్ని వాడుకగా వాళ్ళబ్బాయినిగురించి అడుగుతుంటుంది. మాకు విసుగులేదు. మాకు విపరీతపరితాపం. నన్ను ఆప్యాయంగా "నర్సుకోడలు" అంటుంది. ఇష్టమైతే మేమిచ్చిన వేమన్నా తీసుకుంటుంది. లేకపోతే లేదు."

—ఆమె నెమ్మదిగా ముగించింది.

"అయిపోయిందికదూ?" రోగి విశూ ఘోరాతిఘోరంగా దగ్గాడు. రక్తం కక్కుతున్నాడు. అసహాయంగా ప్రక్కమీద వాలిపోయాడు.

"డాక్టర్, డాక్టర్" అంటూ ముల్లోకాలు ప్రతిధ్వనించేటట్లు అరుస్తూ పరిగెత్తింది.

ఆ ఆర్తనాదానికి వార్డులోని నర్సులు, డాక్టర్లూ ఆమెగదివైపు పరిగెత్తారు. అతని నాడి నీరసించిపోయింది. అందరికీ నమస్కరించాడు. ముసలిదాది ముఖంలో కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు.

ఆ పిచ్చిదానివెంట పిలలు అరుస్తూ పరుగెత్తుతున్నారు.

మామూలుగానే "నర్సు కోడలా!" అంటూ ఆమె ఆస్పత్రిఅంతా వెదికింది. నిశ్శబ్దంగా వున్న ఆ గదిలోకి శరవేగంతో వచ్చింది! కాళీదేవిలా ఆ నినాదం రోగి విశూచెవుల్లో ఎన్నడూ వూహించుకోనంత

మధురంగా వినబడింది! ఏదో మాట్లాడబోయినాడు గాని మృత్యుదేవత గొంతునొక్కుతుంటే ఏం చేస్తాడు?

డాక్టరుకి ఆ సమయంలో ఏమీ తోచలేదు. ఆమెవంక అయోమయంగా చూశాడు. అందుట్లో రోగి చావుబ్రతుకుల్లో వున్న సమయం కూడాను! దాది ఆమెను అనునయిస్తూ "ఇక్కడికెందుకొచ్చావ్ ఇప్పుడు?" అంది. పిచ్చిది పెద్దగా అరిచింది. "మా అబ్బాయిసంగతి మీకు తెలుసు. మరి ఎవర్ని అడగమంటారూ?" అంటూ రోగిని ఎగాదిగా చూసింది! "అవును. మాట్లాడబోకు. ఇదిగో పడుకున్నవాడే మీ అబ్బాయి. సరేనా" అంది సమాధానపరచడానికి ప్రయత్నిస్తూ ఆ ముసలినర్సు! ఒక్కసారి, రోగి, తన గంభీర, విశాల, అందమైన, శాసించే నేత్రాల్ని తెరిచాడు. అతనికి మాట పడిపోయింది. కాని అతనికి ఎవ్వరూ అగుపడలేదు. తనని పరీక్షగాచూసే మాతృమూర్తి తప్ప.

..................

ఎక్కడినించి వచ్చిందో మృత్యువును ముద్దుపెట్టుకొనే ఆ రోగికి ఆశక్తి! ఒక్క వూపులో ఆ పిచ్చిదాని పాదద్వయంమీద చుట్టవేసుకున్నాడు. అతన్నెవ్వరూ ఆపలేదు. ఆపలేరు కూడా! అందరూ విభ్రాంతులై చూశారు వారివంక!

"అమ్మా! నన్ను తనివితీరా చూడు. మీ అబ్బాయిని. అమ్మా...అమ్మా...అమ్మా" లోకాలు మారుమోగేట్లు ఆక్రందించాడు. అదే అతని ఆఖరి అరుపు. ఆయాసంతో, ఆత్రుతతో ఆమెపాదద్వయంమీద కట్టకడపటి ముద్దు నుంచాడు. అంతటితో ఆ పాదాలు అతని రక్తంతో కడగబడి అరుణకాంతులు దాల్చాయి.

దాది తేలిపోయే కళ్లతో ఆ దారుణదృశ్యాన్ని చూసింది.

మూర్ఛబోయిన దాదిని, అతిదారుణంగా మరణించిన విశూని చూసి అందరూ ఉద్వేగంతో కణికిపోయారు.

ఆ పిచ్చితల్లికి ఇదేమీ అర్థమైనట్లు మాత్రం అగుపించలేదు.

"మీరంతా నన్ను పిచ్చిదాన్ని చేస్తున్నారు. సూర్యబింబంలాంటి శరీరకాంతి. రంభైనా వరించే రూపలావణ్యం. కలువపూవుల్లాంటి కన్నులు!...ఇతనా మా అబ్బాయి?? నా కెప్పటికైనా అగుపడకపోడు. నన్ను గుర్తుపట్టకపోయినా నేను గుర్తుపట్టగలను! నా మాట తిరస్కరించడు మా అబ్బాయి" ఆమె వికటహాసం చేస్తూ పోయింది.

*　　　*　　　*

శంకర్, దాదులవిషయం నా కనవసరం. ఇప్పుడాపిచ్చి ఏమైందో నాకు తెలియదు. విశూజీవితాన్ని చూసి ఏడవాలో, నవ్వాలో నిర్ణయించలేను. కాని జీవించే, జీవించబోయే ఏ తల్లికిగాని, ఎటువంటి అపరాధానికైనా, అటువంటి జీవితాన్ని మాత్రం ప్రసాదించవద్దని-మనల్ని ఈ లోకంలో పాలించి, శాసించే శక్తి ఏదన్నా వుండివుంటే - ప్రార్థిస్తాను. ఆమె వాళ్లబ్బాయికోసం ఇంకా ఈ విశాలప్రపంచంలో ఏమూలో-తల్లిని ఏడిపించే అమాయకబాలుడిలా-దాక్కున్నాడేమోనని వెతుకుతుంటుంది! అందుకే ఆమె జీవించి దేన్నీ లెక్కచెయ్యకుండా పరితపిస్తుంది!

బహుశా ఎప్పుడైనా మీ దగ్గరికొచ్చి "మా అబ్బాయిని చూశారా? కలువపూవుల్లాంటి కన్నులు..." అంటూ వర్ణిస్తుంది అనుకోండి. ఏం చెబుతారూ ఆ మాతృదేవికి?



# అభ్యుదయ రచయితల సంఘం-నవ్యసాహిత్యరంగం

— శ్రీ పల్లవరపు విశ్వేశ్వరరావు

అభ్యుదయరచయితల సంఘం నవ్యసాహిత్య రంగంలో ప్రవేశించి నాలుగేళ్ళయిందని మొన్న మద్రాసు వాణీమహల్‌లో జరిగిన వార్షికోత్సవాలు ఘోషిస్తున్నాయి. ఇది సంఘం వారి దృక్కోణంనుంచి సహజంగా వచ్చే వార్త. లోకదృష్టినుంచి చూస్తే, ఈసంఘం పుట్టిన నాలుగేళ్ళకి నవ్యసాహిత్యరంగం ఈ సంస్థని ఆదరించినట్లు తోచవచ్చును. ఈ రెండు దృష్టులకీ చాలా వ్యత్యాసం వుంది. జరిగిన దేమిటంటే, మొన్నటి సభలలో మొదటిసారి, ఒక తండా రచయితలు ఈసంఘ వేదికమీదకి హాజరయ్యారన్న మాట యథార్థం. అందులో కొందమంది సంఘసభ్యులు. వారైనా ఆదినుంచీ సభ్యులు కారు. మధ్యలో ముఖ్యస్థులుగా చేర్చబడ్డవారు. మిగతా అంతా సభ్యేతరులే. కాని ఆహ్వానితులు. అయితే అంతా అభ్యుదయనినాదం ప్రతిధ్వనించారు. అవి ప్రతిధ్వనులుమాత్రమే అయాయి. అసలు ధ్వనికారు లనదగినవారు అగుపించనేలేదు. అందువల్ల అంతా 'అభ్యుదయ'మన్న మాట వల్లించిన వారేగాని, ఆ ముక్కను నిర్వచించే యత్నం వ్యర్థమయింది. అంతా అభ్యాసయమే అయింది వారి వాగ్ధాటిలో. అదికూడ అగోచర మయింది. ఈ 'నినాదం' లేని శుష్కప్రతినినాదాలు తీసివేస్తే, అందరు వక్తలూ సాహిత్యాన్నిగూర్చి, నవ్యసాహిత్యాన్నిగూర్చి అర్థయుక్తమైన అభిప్రాయాలు అభివ్యక్తం చేశారు. ఎల్లా చేయకుండా వుంటారు? వారంతా నవ్యసాహిత్యనాయకులు, నవ్యసాహిత్యకారులు, నవ్యసాహిత్య పరిషత్కర్తలు, నవ్యసాహిత్యపరిషత్సభ్యులు అయి ఆరితేరినవారు. వీరెవరూ అభ్యుదయ రచయితల సంఘకర్తలు కారు. ఒకవేళ మున్ముందు వీతత్సంఘసంస్కర్తలు కావలసివుంటే, అది అసంభావ్యము కాకపోవచ్చును. ఈ పరిశీలనదృష్ట్యా నవ్యసాహిత్యరంగం ఈ సభలలో అభ్యుదయరచయితల సంఘాన్ని ఆదరించిందని లోకమనుకోవడం సత్యదూరం కాదు.

అయితే ఇంతవరకూ, అభ్యుదయరచయితల సంఘం ఎక్కడ పుట్టి, ఏదిక్కు ప్రయాణిస్తోవుంది? ఈ సంస్థ ఆంధ్రదేశంలో పుట్టినది కాదు. ఇది ఒక అఖిలభారతసంస్థకు రాష్ట్రశాఖ. అప్పుడు ఆంధ్ర శబ్దం ముందు చేర్చబడింది. ఇది ఆదిలో రాజకీయ, సాంఘిక విషయకమైన ఒక దృక్పథం కలవారిచే సంస్థాపన పొందింది. ఏ రాష్ట్రభాషాసాహిత్య సంప్రదాయం మీదగాని ఆధారపడి నిసర్గంగా పుట్టుకగాంచినది కాదు. ఈ సంస్థశాఖల సందర్భంలోనే రాష్ట్రభాషా సాహిత్యాలతో అవసరం ఏర్పడింది. అందువల్ల ఇది అభిప్రాయాలు ప్రధానం, సాహిత్యం తదనంతరం అనే ప్రాతిపదిక ననుసరించి నడవదగిన సంస్థ అని స్పష్టం. ఇట్టి సంస్థకు అభిప్రాయపరులూ, రచయితలూ ముందు అవసరం. రచయిత లనగానే సాహిత్యకారు లని అర్థం కాదు. అభిప్రాయాలు రచనలలో విశదంచేసేవారంతా రచయితలే. అట్టివారినే యీ సంస్థ పట్టుకొమ్మలుగా చేకొనగలుగు—సాహిత్యసంబంధం ఎంతవరకు వున్నా, లేకపోయినా. అందువల్ల కాకపోతే ఎందువల్ల ఈ సంస్థ ఆంధ్రరాష్ట్రంలోని సాహిత్యపరుల మధ్యలో సహజంగా అంకురించకుండా అఖిలభారత కేంద్రంనుంచి

ఆంధ్రరాష్ట్రానికి దిగమతి జరిగిందంటారు? అట్టి స్వభావం కల ఈ సంస్థ అభ్యుదయపదాన్ని వాడినప్పుడు ఒక అర్థంలో, ఒక నిర్వచనంలో ప్రయోగించక నానార్థాలలోనూ వాడినట్లు అనుకోవడం అన్యాయం అవుతుంది. శ్రీ రాజమన్నారుగారి అధ్యక్షవచనంలో ఈ మాట Progress అనే ఇంగ్లీషు శబ్దానికి పర్యాయపదమన్నారు. కాని వారు ఈ Progress శబ్దాన్ని భాషాశాస్త్రరీత్యా నిర్వచించారే కాని, రాజకీయసాంఘికదృష్ట్యా స్పష్టీకరించడానికి తలపెట్టలేదు. ఎందుకంటారో? అది వారి బాధ్యత కాదు కనుక. వారీ సంఘరచయితలలో ఒకరు కారు. వారు ముఖ్యంగా సాహిత్యపరులు, సంస్కారం కలవారు, నవ్యాంధ్ర సాహితీకారులు కూడా. నవ్యసాహిత్యసృష్టి ప్రగతికారణం అనే విశ్వాసం మాత్రమే వారి అభిభాషణలో సువేద్యం అయింది. ఇదే అనేకరూపాంతరాలలో తదితర వక్తల అభిభాషణలలో కూడా వ్యక్తమయింది. అయితే 'అభ్యుదయ' శబ్దం కేవల శబ్దమాత్రమే అయి నిర్దిష్టమైన ఒక అభిప్రాయ సముచ్చయం కాకుండా ఉండే అభ్యుదయ సంస్థ సార్థకనామం కలదని అనిపించుకోగలదా? ఇది సంస్థవారు సమాలోచించుకోవలసిన సమస్య. లోకానికి మాత్రం సాహిత్యం, నవ్యసాహిత్యం ఎల్లప్పుడూ కావలసిన నిధానం. సాహిత్యంలో ముందడుగు నవ్యసాహిత్యం. సాహిత్యంలో Progress గాని, దానికి సమానార్థంలో అభ్యుదయంగాని నవ్యసాహిత్యం. మృతభాష అయిన సంస్కృతంలో నవ్యసాహిత్యం ఉండనేరదు. జీవద్భాషలైన రాష్ట్రభాషలన్నిటిలోనూ అభ్యుదయకారకమైనది నవ్యసాహిత్యం. అది నిసర్గజనితం. అది అఖిలభారత సంస్థకు ఉపశాఖగా జనించలేదు. అది సంపూర్ణ వ్యక్తిత్వంతో, సహజ ప్రతిభతో ప్రతి భాషా ప్రయుక్త రాష్ట్రంలోనూ స్వతంత్రాంకురంగా ఉద్భవిస్తుంది.

హృదయంలేని మేధోజనితమైన అభిప్రాయాలు కొన్ని స్థూలమైన ఆలంబనంగా అవతరించిన ఆంధ్ర అభ్యుదయ 'రచయితల' సంఘం చతుర్థ వార్షికోత్సవ సందర్భానికి చేరుకొనేసరికి పునాదిలేని సౌధమై ఆంధ్ర సాహిత్యరంగంలో కూలి, ఆ కూలుట మూలంగానే తరించిందని తలపోసేవారిలో నేనొకణ్ణి. తమ ఉదార హృదయ వైశాల్యానికి సహజమైన ఆదరంతో ఆ సభలకు విచ్చేసి, నిరుద్ధమేనస్కమైన ఆం. అ. ర సంఘాన్ని తమ ఆలింగనంలోకి తీసుకొని, అనిర్దిష్టమైన అభ్యుదయ శబ్దం శూన్యంలో ప్రతినినాదమని నిరూపించి, సాహిత్యమనదగినదంతా అభ్యుదయపూర్వకమనీ, నవ్యసాహిత్యమే అభ్యుదయ పరంపరాకమనీ ప్రబోధించి నిదానమైన దృక్పథ ప్రదానం చేసి, కేవల రచయితల సంఘమనే పేరిట నడిచే ఒక సంస్థను విముక్తంచేసి సాహిత్యరంగంలో విలీనం చేసుకొన్న నవ్యసాహిత్యపరులైన పెద్దలందరూ అత్యంతం అభినందనీయులని ప్రేక్షకాభిప్రాయ ప్రతిబింబమైన నా ఆత్మీయాభిప్రాయాన్ని వెల్లడిస్తున్నాను.

ఇంతకీ నవ్యసాహిత్య రంగంలో యికముందు ఇన్నిన్ని విభక్త కుటుంబాలకి అవసరమేమిటో? ఆస్కారమేమిటో? అనిపిస్తుంది. ఒక రాష్ట్ర సాహిత్యానికి ఒక రాష్ట్ర సాహిత్యసంస్థ, ఒక సాహిత్య రంగంలో భిన్నభిన్నమైన అభిరుచులూ, అభిప్రాయాలూ, ఆ విభిన్న భావాన్వేషణ మార్గాలలో సత్య సామరస్య సందర్శనం సుసాధ్యం కాజాలదా అనికూడా అనిపిస్తుంది. అట్టి సామరస్య సాధ్యతా సాధనయేకదా సాహిత్యరంగంలో సంస్థానిర్మాణప్రయోజనమని సమాలోచనాంతాన్ని మిగిలే నా గాఢవిశ్వాసం.

శూన్యాకాశంలో పెరిగి తిరిగే ప్రతి నినాదాలను గాలికి వదలి, సాహిత్యంలో కావరణంలో ఈ సామరస్య నినాదాన్ని మ్రోగించలేరా—మొన్న వాణీ మహల్ వేదికమీద మేజువాణీకట్టిన పెద్దలూ, కట్టని పెద్దలూ అంతా—సరస్వతీ పాద వేదికాంగణాన్ని మంగళ తూర్యకలారవాలతో సమేళం చేసి? నవ్య సాహిత్య రంగాంతరంగణంలోనే నవనవకావ్య విమానాది రంగవల్లీ రచన మొనర్చి ఆంధ్రసాహితీ మాతృదేవ్యాలింగనంలో ఏకకుటుంబం కాలేరా? ఎందుకు కాలేరో—తలుచుకుంటే!

-:o:-

# కలగూరగంప

## పర్యాయోక్తాలంకారము

"చక్రాభిఘాత ప్రసభాజ్ఞయైవ
చకార యో రాహువధూజనస్య,
ఆలింగనోద్దామవిలాసవంధ్యం
రతోత్సవం చుంబనమాత్రశేషమ్"

[ఎవడు చక్రపు దెబ్బ యను కఠిన శాసనముచే రాహుభార్యల రతోత్సవము నాలింగనాది రహితము గను, చుంబనమాత్రశేషముగను నొనరించెను.]

ఈ పద్యవిషయమున ఉద్భటానందవర్ధనాభినవగుప్త మమ్మట రుయ్యక దీక్షిత జగన్నాథాద్యాలంకారిక బృందమునకు పర్యాయోక్తాలంకారమే యభిమతము. దాని లక్షణము కూడ వ్యంగ్యమును సుందరముగ భంగ్యంతరముతో శబ్దశక్తిచే దెల్పుటయనియే.

ఈ విషయమున నప్పయదీక్షితు లిట్లు చెప్పిరి:

"ఈపద్యమున భగవంతునియందు రాహువధూ సురతకర్మ కాలింగనరహిత చుంబనమాత్రశేష కర్తృత్వము వాచ్యము. వాసుదేవత్వము వ్యంగ్యము. అభినవగుప్తాలంకార సర్వస్వకారాది ప్రాచీనులన్నరో! లక్షణమును,లక్ష్యమును కష్టముగ నన్వయించిరి. వారు చెప్పినట్లు రాహుశిరశ్ఛేదాదికము వ్యంగ్యమన్నచో ప్రస్తుతముచే నింకొక ప్రస్తుతము తోచినచో ప్రస్తుతాంకురమని నేను కల్పించిన ప్రస్తుతాంకురమే యగును. వాచ్యవ్యంగ్యములు రెండును ప్రస్తుతములే కనుక. వాసుదేవత్వము వ్యంగ్యమన్న పర్యాయోక్త మగును. ప్రాచీనులు వృథాశ్రమ నొందిరని.

దీనికి జగన్నాథుని జవాబేమిటంటే?—

"వాసుదేవత్వ మెప్పటికి వ్యంగ్యము కాదు. "ఎతడు......ఒనరించె" ననుచో యచ్ఛబ్దవాచ్యము వాసుదేవుడు విశేషణ మగుటచే వాసుదేవత్వము వాచ్యమే యగుటవలన శబ్దశక్తి ప్రతిపాదితము దాని కెట్లును వ్యంగ్యత్వ మిష్టముకాదు. కావుననే ప్రాచీనులు క్లిష్టగతి నవలంబించుట. ఎట్లన? అభినవగుప్తుడు ధ్వన్యాలోక లోచనమున సద్భతోక్తముగు "అన్యదీయమున జెప్పబడునది పర్యాయోక్త" మను లక్షణమును జూపి దాని యర్థ మిట్లు వివరించెను. 'చెప్పబడు' నను మాటచే (అభిధీయత ఇత్యుక్త్యా) అన్యము = వాచ్యము కంటె నన్యము అని యర్థము. అన్యదీయమున్న = వాచ్యముకంటె వేఱగు వ్యంగ్యమే. అన్యదీయమున నన్నచో తృతీయార్థ ముపలక్షణము. ఇంతకు వ్యంగ్యోపలక్షిత మగుచు జెప్పబడునది పర్యాయోక్తమని ఫలితార్థము. వ్యంగ్య ముపలక్షణ మగుటచే ప్రధానము కాదు కనుక వాచ్యమే చమత్కారి యగుటచే ప్రధానమగుటవలన ధ్వని కంటె వేఱగు పర్యాయోక్తమని. ఇచట వ్యంగ్య మేమన? దాని నతడే యచటనే చెప్పెను. ఇచట వాసుదేవ ప్రతాపము వ్యంగ్యముగ వివక్షింపబడినది కాని యది చమత్కారి కాకపోవుటచే పర్యాయోక్తమే యగు"నని.

ఏతావతా దీక్షితులవారు చెప్పిన వాసుదేవత్వము వ్యంగ్యమను విషయము అభినవగుప్తపాదపర్యంతమును ప్రాచీనుల కెవరికి నభిమతము కాదనుట స్పష్టమే. వాసుదేవత్వము 'ఎతడు......నొనరించె'నని యచ్ఛబ్దవాచ్య మగుటవలన, సందర్భలబ్ధమగుట వలన, సుందరమగుట వలన వ్యంగ్యము కాదగదని తేలుటచేతనే వారు క్లిష్టగతి నవలంబింప వలసివచ్చెను. అలంకార సర్వస్వకారుడును "గమ్యమును గూడ వేఱువిధమున నభిధానము పర్యాయోక్తము" అని లక్షణముచెప్పి మమ్మట నిట్లు శంకించుకొని సమాధాన మొసగెను. గమ్యమునదానికే యభిధానము సంభవింపకుండుటవలన కార్యద్వారమునవే చెప్పుట యని. అట్లు చెప్పుటచే "చక్రపు దెబ్బ యను" నిత్యాద్యుదాహరణమున వాచ్యము రాహువధూసురతము నాలింగనరహితముగను, చుంబనమాత్ర శేషముగను జేయుట. దానికి కారణము రాహుశిరశ్ఛేదము. అదే వ్యంగ్యముకాని దీక్షితోక్తమగు వాసుదేవత్వము కాదు. అది 'ఎతడు' అను యచ్ఛబ్దవాచ్యము ప్రకరణలబ్ధము నగుటవలన.

ఇట్లు మమ్మటపక్షమందును యన్నద్ధాచార్యాదులు, ప్రకరణ లబ్ధమగు భగవంతునియందు రాహువధూసురత చుంబనమాత్రశేష కర్తృత్వము వాచ్యము కాగా రాహుశిరశ్ఛేదకర్తృత్వమే వ్యంగ్యమని దీక్షితోక్తమగు వాసుదేవత్వ మిదంరూపముగ చెప్పిన కారణమునకే వ్యంగ్యము కాదు. ఏమంచ-దీక్షితులవారు సర్వ ప్రాచీనాలంకారికాభిమతమునకు విరుద్ధముగనే చెప్పినట్లు తేలినది.

ఈ విషయమున చంద్రికాకర్త జగన్నాథుడు చెప్పినదాని దూషించి దీక్షితులవారు చెప్పినదానిని సాధించుచున్నాడు. ఎట్లన ?—

పర్యాయోక్తములో విషయమగు వాసుదేవత్వ రూపమున నవగమనము విశేషణమున్నదాలభ్యమగుటచే సుందరము కాదనునది యాలోచింపని మాట. ఎందుచేత ? పర్యాయోక్తమున వ్యంగ్యముకంటె వాచ్యమే సుందరమనుట సర్వసమ్మతవిషయము కదా! ప్రకృతమందు వాచ్యమగు రాహువధూసురతచుంబనమాత్రశేషకర్తృత్వమునకే వ్యంగ్యమగు వాసుదేవత్వముకంటె చమత్కారిత్వ మిష్టమే యగును. వాసుదేవత్వము సుందరము కానేకాదు. వాసుదేవత్వమే సుందరమైనచో ధ్వనియే యగునుకాని పర్యాయోక్తాలంకారము కానేకాదు. ఇంతేకాక అలంకార సర్వస్వకారుని ప్రసక్తమగు దీక్షితగ్రంథమునకు అలంకారసర్వస్వగ్రంథపరిశోధనము జూచుట మంచిది కాదు. ఎట్టును అలంకారసర్వస్వమును దీక్షితు డనుసరించె ననుటయును మోసగించె. దీక్షితులవారు కువలయానందారంభమునగాని, చిత్రమీమాంసారంభమునగాని సర్వస్వగ్రంథానుసరణముగ నేమియును చెప్పెనని ప్రతిజ్ఞ చేసిరా ? ఇంతియు కాదు సరికదా ! తన యభిమతము మాత్రమే యంగీకరించుచు విరుద్ధాంశమును ఖండించుచునే వచ్చిరి. అందువలన జగన్నాథోక్తములు దూషణములే కావు. అని.

ఈ చంద్రికాకారుడగు వైద్యనాథుడు చెప్పినదంతయు బాగున్నదికాని సర్వప్రాచీనాభిమతము కావున వాసుదేవత్వము వ్యంగ్యము కాదన్న జగన్నాథుని దూషణమునకు సమాధానము చెప్పి దానికి వ్యంగ్యత్వము సాధించకయే వాసుదేవత్వరూపవ్యంగ్య మాసుందరమన్నదానిని మాత్రమే గ్రహించి యిట్లు చెప్పుట యేమి న్యాయమో యూహింపరాదు.

కంభంపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి.

## శ్రీ తిమ్మరాజు శ్రీరామమూర్తిగారు

ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి పరీక్షల్లో బహుమాననీయంగా ప్రథమశ్రేణిలో పట్టభద్రుడై, ఇటీవల రెండేండ్లుగా మద్రాసు విశ్వకళాపరిషత్తువారి పరిశోధనశాఖలో ఆచార్య నీలకంఠశాస్త్రిగారి అంతే-



వాసియై చారిత్రకపరిశోధనలు సాగిస్తున్న ఈ ఇరవై రెండేండ్ల యువకుడు భారతప్రభుత్వంవారి పనుపున వచ్చే మార్చినెలలో చైనాకు చైనాచరిత్రాధ్యయనమునకై వెళ్లుచున్నాడు.

---

## శ్రీ సూరా రాజగోపాలనాయుడుగారు

(జననము: ౧౩-౫-౧౮౬౩—మరణము: ౪-౧-౧౯౨౪)

మద్రాసు ప్రభుత్వమువారి రాసాయనిక పరీక్షకులుగను, మద్రాసు మెడికల్ కాలేజిలో రసాయనాచార్యులుగను నుండిన శ్రీ నాయుడుగారు స్వదేశవిదేశములందు విరివిగా విజ్ఞానసంపదను, అంతకు మిక్కిలిగా అనుభవమును గడించినవారు ; వైద్యులనందున, వైజ్ఞానిక పరిశోధనలందును ఆరితేరినవారు ; ప్రభుత్వ విశ్వకళాశాలలందు ఉన్నతపదవుల నొంది సామర్థ్యముతో నిర్వహించుటయందు పేరుగన్నవారు ; నూతన విజ్ఞానశాఖాప్రచారమునకు కారణభూతులయినవారు ;

వివిధవిజ్ఞానసంస్థ లందు సభ్యత్వమును బడసి యమూల్యమగు సేవనొనరించినవారు [illegible] ప్రజ్ఞాశేషము వీరి కనేకవిధముల గౌరవమును, కీర్తిని చేకూర్చినది. ఇటి విజ్ఞానసంపన్నులు, వయస్సు ఏబదికి మిక్కిలి మించక పూర్వమే కీర్తిశేషులగుటవలన భారతదేశ విజ్ఞానాభ్యుదయమునకు గలిగిన నష్ట మపారము.

శ్రీ నాయడుగారు మరియు ననేకవిధముల మాననీయులు. వీరి హృదయము మిగుల మృదువయినది; స్వభావము సరళమయినది; జీవితము నిరాడంబరమయినది. వీరు బీదవిద్యార్థులకు సాయము చేయుచుండువారు. తమ లింక్డిషర్ శాశ్వతముగ విద్యార్థివేతనము కల్పించినారు. ఆంధ్రాభ్యుదయమునకయి వీరు నిరంతరము పాటుపడుచుండిరి.

వీరి యాదరము, సాయము కారణముగా విజ్ఞానశాఖలం దున్నతపదవులం దుండువారనేకులు ఉన్నారు.

జి. శేషగిరి.

గత నెల 18-వ తేదీనాడు చెన్నపురిలో న్యాయమూర్తులైన శ్రీ పి. వి. రాజమన్నారుగారి అధ్యక్షత క్రింద జరిగిన ఆంధ్ర అభ్యుదయ రచయితల చతుర్థసభలో పాల్గొన్న పెద్దలు.



# విమర్శనము



## చచ్చిపోయిన మనిషి

డి. హెచ్. లారెన్సు రచన. అనువాదం: "పాప"; యువబుక్ డిపో, ౩౭, ఆచారప్పన్ వీథి, మద్రాసు. వెల ౧౨ అణాలు.

డి. హెచ్. లారెన్సు ఆధునిక ఆంగ్ల కథారచయితలలో ప్రముఖుడు. వివిధ సన్నివేశాలలో అంకురించి ప్రజ్వరించే విపరీత ప్రేమావేశాలు లారెన్సు కథలకు చాలావరకు ప్రమాణమౌతాయి. అతని కథాంశాలు సామాన్యంగా సంఘజీవితంలోనించే ఎన్నుకుంటాడు. కాని ఎక్కడెక్కడి అనుభూతి అగాధాల్లోకో తీసుకుపోతాడు. అతని ఆంగ్ల శైలి అతను వర్ణించే అసాధారణానుభూతి ప్రపంచంలోకి మనలని ఒక మధురమైన సంగీతంతో ఆకర్షించి లాక్కుపోతుంది. ఆస్కార్ వైల్డుతర్వాత కథారచనలో మధుర శైలిసహాయంతో అనుకూలవాతావరణం సృష్టించే నేర్పరి లారెన్సుని చెప్పవచ్చు.

అయితే ఈ "చచ్చిపోయిన మనిషి" కథ ఈ కాలానిది కాదు. మరుపుమబ్బులలో మరుగైపోయిన గాథను ఈరచయిత పునస్సృష్టి చేశాడు. ఏసుక్రీస్తు చచ్చిపోయాక భూస్థాపితమైన అతని దేహం శవపేటిక నుంచి తిరిగివచ్చి, కొందరికి కనిపించి, అంతర్హితమై పోయినట్లు బైబిలుకథ ఉంది. క్రీస్తు అట్లు అంతర్హితుడు కాకుండా సజీవుడై మరికొంతకాలం గడిపినట్లూ, లోకశ్రేయంకొరకు ప్రబోధం చేసి త్యాగమూర్తిగా తన యౌవనం వెళ్లబుచ్చిన జీసస్, అంతటికీ పరిపక్వతపొందని తన వ్యక్తిజీవపరిణామానికి ఒకానొక విశిష్టప్రణయానుభవం ఉగ్రంగా రహస్యంగా జీవించింతరువాత సిద్ధుడైనట్లూ లారెన్సు తనకథలో విపులీకరిస్తాడు.

ఇది లారెన్సు వ్రాసిన కథలన్నిట్లో గొప్పకథ. ఈ కథాంశంలోని తత్వం పాశ్చాత్యవేదాంతానికి విరుద్ధమైనదైనా, ప్రాచ్యశ్రేష్ఠానికి అనుకూలమే అని తోస్తుంది. జీసస్‌ని కేవలం దివ్యాంశసంభూతుడుగానే కాకుండా, రామకృష్ణాది హైందవావతారాలలాగున పూర్ణపురుషునిగాకూడా చూపుతుంది లారెన్సు చేసిన పునస్సృష్టి. అందుకే అయివుంటుంది ఈకథ ఆంధ్రకథాకారులైన "పాప" గారి దృష్టిని ఆకర్షించింది. అనువాదకుడు ఈ పుస్తకంలో మూలంయొక్క అర్థాన్ని జాగ్రత్తగా తెనుగులోకి పొదిగారు. భాషాస్వాతంత్ర్యం భాషాంతరీకరణసహజంగా కొంతవరకు లోపించక తప్పదు. కొన్నిచోట్ల అర్థస్పష్టత ఉండదగా పాఠకులోకం తమ ఊహాశక్తిని ప్రయోగించి రసానుభూతి పొందగలుగ వచ్చును. కాని మూలంలోని శైలీమాధుర్యం తగినరీతిని తెనిగింపులో ప్రతిఫలించలేదేమో అనిపిస్తుంది.

"పాప" గారి స్వతంత్రరచనలలో వారిశైలి నిశితంగా, స్పష్టంగా ఉంటుంది. వారు వచనరచనలో మధురగుణం ఆశించరని అనుకోడానికికూడా వీలుంటుంది. కాని లారెన్సురచనకు సహజమైన మధురశైలి ప్రతిఫలించనంతవరకు ఇతరవిధాలగా శక్తివంతమైన ఈ అనువాదం భాషాస్ఫూర్తిలో కొంత కొరవడుతున్నదని చెప్పక తప్పదు. ఇది శైలీవిషయంలో అనువాదకునికీ, మూలగ్రంథకర్తకూ నడుమ గల అభిరుచివ్యత్యాసంపైన ఆధారపడివున్నందున మారీ తీరని లోపం. ఈ ఒక్క దృష్టితో చూచి తప్ప మిగతా అన్నివిధాలా ఇది అత్యంత జాగరూకతతో చేసిన అనువాదం. ఈ జాగరూకత ఆంధ్రానువాదాలలో చాలా అరుదైన గుణం కావడం వల్ల అత్యంతం అభినందనార్హమవుతుంది.

వి. రా.

---

## నవోదయ పారిశ్రామిక సంచిక

సంపాదకులు నీలంరాజు వెంకటశేషయ్యగారు. ౧౧, తంబుశెట్టివీథి, మద్రాసు, వెల రు. ౧-౮-౦.

సర్వతోముఖమైన ఆంధ్రాభ్యుదయానికి పాటుపడవలెనని సంపాదకుల ఆశయం. ఆంధ్రదేశంలో ఏఏపరిశ్రమలకు అవకాశమున్నదో వెంటనే సమగ్రమైన విచారణ జరిపించి మద్రాసురాష్ట్రప్రభుత్వం పరిశ్రమాభివృద్ధికి ఒక పంచవర్ష ప్రణాళికను సిద్ధంచెయ్యాలని సంపాదకులు సూచిస్తున్నారు.

ఈ సంచికలో అనుభవజ్ఞులైన పలువురు ప్రముఖులు శ్రీయుతులు సర్ కొంతి వెంకటరామమూర్తి, మద్రాసు

కార్మికశాఖామంత్రి వి. వి. గిరి, డా॥ భాగవతుల విశ్వనాథ్, డా॥బి. వి. నారాయణస్వామి నాయుడు, దివాన్ బహదూరు బి. రామచంద్రారెడ్డిగార్లు మొదలైనవారు అత్యంతోపయుక్తమైన వ్యాసాలు వ్రాశారు. మద్రాసు సమాచారప్రచురణశాఖ డైరెక్టరు చామలి హనుమంతరావుగారు సూచించినట్లు, ఈ ప్రముఖుల అభిప్రాయాల సహాయంతో ఒక సముచితసంగ్రహప్రణాళికను తయారు చెయ్యడానికి ప్రభుత్వం ఒక నిపుణుల సంఘాన్ని నియమించడం అవసరం.

---

### సంక్రాంతి "బాల"

పిల్లల తెలుగు మాసపత్రిక "బాల" సంక్రాంతి సంచిక మా కార్యాలయానికి చేరింది. ఆంధ్ర బాలబాలికల ఆదరాభిమానములను చూరగొన్న ఈ పత్రిక సంక్రాంతిసంచికను (మామూలు సైజులో ౧౨౮ పేజీలు : వెల రూపాయి) చిన్న చిన్న కథలతో, చిత్రమైన పాటలతో, అందమైన ముఖచిత్రంతో, అనేక బొమ్మలతో ఎంతో ఆకర్షకంగా తయారుచేసిన సంపాదకులు అభినందనీయులు.

---

### గృహలక్ష్మి - పునరాగమనసంచిక

సుమారు నాలుగేండ్లక్రిందట, అప్పటి అసాధారణపరిస్థితులలో, ఆగిపోయియుండిన గృహలక్ష్మి (స్త్రీల సచిత్రమాసపత్రిక) మొన్న జనవరిలో వెలువడిన ఈ 'పునరాగమన' సంచికతో ఎప్పటితీరున పునర్దర్శనమిస్తున్నది. ఈపత్రిక కార్యస్థానం మద్రాసు-రాయపేటలో.

## గ్రంథస్వీకారము

---

### శ్రీ సర్దార్ మరుపిళ్లశెట్టి

జీవితగాథ. రచన : పిల్లా వెంకటరత్నకవిగారు. ప్రకాశకులు : విజయవాడ కాంగ్రెసువర్కర్సు కేంద్ర కమిటీ, కొత్తపేట, బెజవాడ. వెల అ. ౧౨.

### ౧. గాంధీదేవుడు, ౨ రైతునాయకుడు

మొదటిది చిన్న పద్యరచన; రెండవది బుర్రకథ. రెంటికి కర్త: మునగపాటి విశ్వనాథశాస్త్రిగారు. రెంటికి ప్రకాశకులు : సుందరరాం అండ్ సన్సు, తెనాలి. వెలలు అ. ౪; ౬

### ఆహారచికిత్సాశాస్త్రము

ప్రథమభాగము. కర్త: డా. పుల్సా వెంకటరామయ్యగారు. ప్రకాశకులు : ప్రకృతి కార్యాలయ ట్రస్టు, బెజవాడ. వెల ౪ రూ.

### పాకిస్థాన్ మర్మం

కర్త: మండిజగన్నాథంగారు. ప్రకాశకులు: లలితా అండు కో, ఏలూరు. వెల ౧ రూ.

### కోయిల పాటలు

రచయిత : మంగిపూడి పురుషోత్తమశర్మగారు, పిప్పర, పశ్చిమ గోదావరి జిల్లా. వెల రూ ౧-౪-౦

### ఆంధ్రలిపి సంస్కరణము

రచయిత : సురవరము ప్రతాపరెడ్డిగారు, బి ఏ. బి. యల్, గోలకొండ పత్రికాలయము, హైదరాబాదు (దక్కన్) వెల 3 అ.

### 1. విప్లవసందేశం, 2. సోవియట్ ప్రజాస్వామ్యం, 3. బలిదాన్, 4. లెనిన్ ఉపదేశాలు.

మొదటినాలుగు మహీధర జగన్మోహన్‌గారి అనువాద అనుసరణలు. నాల్గవది రామమోహన్‌గారి అనువాదము. వెలలు వరుసగా, ౮ అ; ౧౨ అ; ౧ రూ; ౧ రూ. నాలుగింటికి ప్రకాశకులు : విశ్వసాహిత్యమాల, రాజమండ్రి.

### శ్రీజగద్గురు విశ్వారాధ్యాష్టోత్తరశతనామావళిః

సంస్కృతము. రచయిత: శ్రీజగద్గురు వీరభద్ర శివాచార్య మహాస్వామి. ప్రకాశకులు: శివధర్మ గ్రంథమాల, జంగంవాడీమఠము, కాశీ. వెల ౨ అ.

### ౧౮౫౭ విప్లవం

రచన : అశోకమెహతా; అనువాదం : మంగళంపలి చంద్రశేఖరంగారు. వెల రూ. ౧-౮-౦.

### అన్నపూర్ణాసుభాషితరత్నావళి

రచయిత్రులు అయితం ఇందిరాభారతీదేవులు. వెల ౮ అ.

పై రెంటికీ ప్రకాశకులు: జాతీయజ్ఞానమందిరము, త్యాగరాయనగరు, మద్రాసు.

## కూలిజనం

కథలసంపుటి. రచయిత: పాలగుమ్మి పద్మరాజుగారు. ప్రకాశకులు: నవరత్నావళి గ్రంథమాల, ౮/౮ దేశిగర్ సామివీథి, మైలాపూరు, మద్రాసు. వెల రూ. ౧-౮-౦.

## గాంధీజం - సోషలిజం

ఒక పరిశీలన. రచయిత: రాయప్రోలు సీతారామాంజనేయశాస్త్రిగారు. ప్రకాశకులు: విజ్ఞాన సాహిత్యసదనం, బెజవాడ. వెల రూపాయి.

## ౧. దేశ సేవ; ౨ చారిత్రక జ్యోతులు

రచయిత: పోలవరపు శ్రీహరిరావుగారు. ప్రకాశకులు: సాగర్ పబ్లికేషన్స్, అరండలుపేట, గుంటూరు. వెల చెరి ముప్పావలా.

## తొలిసంజ

వివిధరచయితల భావగీతముల సంపుటి. ప్రకాశకులు: ఆంధ్రసారస్వతపరిషత్తు, నీలగిరి (నల్లగొండ). వెల అర్ధరూపాయి.

## హరిజన విజయము

బుర్రకథ. మునగపాటి విశ్వనాథశాస్త్రిగారి రచన. తెనాలి సుందరరాం అండు సన్స్ ప్రచురణ. వెల ౬ అ

## చిత్రాంగి

నాటకము. రచయిత: ఉపద్రష్ట వేంకటసీతారామశాస్త్రిగారు, ౪౦ హావిలాక్ స్క్వేర్, న్యూఢిల్లీ. వెల రూ ౧.

## సర్వజిత్ పంచాంగము

గుణించినది: శ్రీ డిండిమ శ్రీవాత్స్య ఆదిడింగరి స్వామివారు. ప్రాప్తిస్థానము: శ్రీ విశిష్టాద్వైత మత ప్రచారకసంఘము, ఆత్రమూరు, వయా ద్వారపూడి. వెల ౮ అ.

## 'మద్యపాననిరోధక' ప్రత్యేక సంచిక

హైదరాబాదు మద్యపాననిరోధక కేంద్రసంఘమువారి ప్రచురణ.

## మాతృభూమి

కొత్తవారపత్రిక. ౧౯౪౭ జనవరి ౨౬-వ తేదీ-స్వాతంత్ర్యదినంనాడు ప్రారంభమైంది. సంపాదకుడు: వేలూరి సదానందంగారు. కార్యస్థానం ౩౭౬, ఎస్ప్లనేడ్, మద్రాసు. వార్షికచందా ౧౩ రూ.

## విశ్వకవి - రవిబాబు

గ్రంథకర్త: ఆకురాతి చలమయ్యగారు, శాంతినిలయ గ్రంథమాల, కాకినాడ. వెల రూ. ౨-౮-౦

---


# ఆయుర్వేద వైద్యనిలయంవారి

# "లుకోరియా క్యూర్"

స్త్రీల గర్భాశయ సంబంధమైన సమస్త వ్యాధులను నివారించి ఆరోగ్యవతులనుగా చేయుటలో సాటిలేని దివ్యౌషధము.

90 మాత్రల ప్యాకెటు రు. 2.8.0.

ప్యాకింగు పోస్టేజి అదనము.

# ఆయుర్వేద వైద్యనిలయం,

నామినాయుడుపేట, మచిలీపట్టణం.

అన్ని మందుల షాపులలో అమ్మబడుచున్నది


---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No, 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.